ఓమ్

# మలయాళ మునీంద్ర చంద్రమా!

—భక్తకవిరత్న శ్రీ పులిపాక చలపతిరావుగారు, బి. ఏ.

మానవమాత్రు లెల్లరు స
మానులటంచును, హెచ్చు, తగ్గు లీ
మానవ కల్పితమ్ము, లను
మాన మొకింతయు లేదటంచు, ప్ర
జ్ఞా నిధివై యమోఘముగ
జాటుచు, విజ్ఞులు రిచ్చవోవ, వి
జ్ఞానము పంచిపెట్టిన ని
జమ్మగు స్వామివి, యోగిపుంగవా! (1)

స్త్రీలకు బ్రహ్మ విద్యలు ని
షిద్ధము లంచును బల్కునట్టి వా
చాలుర లెక్కసేయక, ప్ర
శాంత మనస్కుడ వౌచు, బ్రహ్మ వి
ద్యాలయ మేర్పరించి బహు
ధా పరతత్త్వము వాడ వాడలన్
స్త్రీ లెరుగంగజేసిన ప్ర
సిద్ధ మహర్షివరేణ్య చంద్రమా! (2)

కుల, మత, జాతి భేదముల
కూకటివ్రేళుల బెల్లగించి, యీ
యిలగల మానవాళి తరి
యింపగ తత్త్వసుధారసమ్ము నిం
పలరగ బంచ, నాడు మల
యాళమునందు జనించి, వచ్చి, మా
తెలుగులనేల మెట్టి, గురు
దేవ శిఖామణివైన స్వామి! నిన్
మరతురె! యెన్నడైనను, సు
మా! మలయాళ మునీంద్రచంద్రమా!!



# శతజయంతి సమీక్ష







శ్రీ సద్గురు మహర్షి మలయాళ స్వాములవారి
శతజయన్త్యుత్సవ సంఘము

శ్రీ వ్యాసాశ్రమము
1986

శతజయన్తిమాల .... 29వ కుసుమం

SATAJAYANTI SAMIKSHA

ప్రథమ ముద్రణ 1986

ప్రతులు 1000

ప్రకాశకులు :-

బ్రహ్మచారి గోపాల్
కార్యదర్శి,
శ్రీ సద్గురు మహర్షి మలయాళస్వాములవారి శతజయన్త్యుత్సవ సంఘం,
శ్రీ వ్యాసాశ్రమము.

సభ్యులకు మాత్రము

---

పబ్లికేషన్ కమిటీ :

1. శ్రీ అసంగానంద సరస్వతి స్వాములవారు
2 శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారు M A. శిరోమణి
3. శ్రీ ఆకురాతి పున్నారావుగారు M,A., Phd. విద్యాప్రవీణ
4. శ్రీ ఆలపాటి వెంకటప్పయ్యగారు B.A. విద్యాప్రవీణ
5 శ్రీ బూదూరు నరసింహారెడ్డిగారు, విద్వాన్
6 శ్రీ బ్రహ్మచారి గోపాల్‌గారు, వేదాన్తశాస్త్రి, సాహిత్యరత్న
7. శ్రీ డా॥ అరుణాచలంగారు, M.A., Phd.
8. శ్రీ అడ్డేపల్లి నాగేశ్వరరావుగారు

ముద్రణ :

శ్రీ కృష్ణచిత్ర ప్రింటర్స్
టి. నగర్, మద్రాసు-17. ఫోన్ : 441286



శ్రీ సద్గురు మహర్షి మలయాళ స్వాములవారు
శ్రీ వ్యాసాశ్రమము.

ఓమ్

# నివేదన

శ్రీ సర్వేశ్వరుని అవ్యాజకరుణచేతను, మహర్షుల అనుగ్రహమువలనను, శ్రీ సద్గురు దేవుల ఆశీర్వాదబలంచేతను శ్రీ సద్గురు శతజయంతుత్సవాలు అపూర్వ వైభవంతో ఆనందకరంగా జరిగినవి. అందులకు సర్వేశ్వరునికి, మహర్షులకు, శ్రీ సద్గురు దేవులకు నా కృతజ్ఞతాంజలులు. ఆహ్వానించిన వెంటనే సుదూరముల నుండి వచ్చి ఈ ఉత్సవాలకు ఒక అపూర్వ శోభను, విశిష్టతను గలుగజేసిన మహామణ్డలేశ్వరులకు, మఠాధిపతులకు, మహాత్ములకు, ఆచార్య పురుషులకు కృతజ్ఞతా పూర్వక ప్రణామాలు.

హిమాలయ సానువులలో కొంత కాలం ధ్యానం, అధ్యయనం చేసుకొని ఆపై కలియుగ వైకుంఠమగు తిరుపతిలో శ్రీ సద్గురు స్వాముల వారి పేరిట సమాజసేవ చేయుచున్న సమయంలో 1974 సంవత్సరం శ్రీ వ్యాసాశ్రమానికి పరిపాలనాపరంగా కొన్ని ఇబ్బందులు వచ్చినవనియు, కావున శ్రీ వ్యాసాశ్రమ మేనేజ్ మెంట్ తీసుకోమనియు పూజ్యశ్రీవ్యాసాశ్రమపీఠాధిపతులు కోరినారు. వారు కోరుటేగాక అనేక మంది ఆశ్రమ ముఖ్యుల చేత వత్తిడి తెచ్చినారు. శ్రీ వ్యాసాశ్రమాధిపతుల ప్రబలకోర్కెమీదను, ఆశ్రమముఖ్య హితైషుల బలాత్కారము వలనను 1974 అక్టోబరులో విజయదశమినాడు శ్రీ వ్యాసాశ్రమ మేనేజ్ మెంటును తీసుకొంటిని.

ఇంతలో 1976 కు శ్రీ వ్యాసాశ్రమానికి యాభై ఏండ్లు నిండనున్నట్లు గుర్తించితిని. గత యాభై ఏండ్లుగా ఆంధ్ర దేశానికి ఎనలేని ఆధ్యాత్మిక, సామాజిక సేవ జేసిన శ్రీ వ్యాసాశ్రమ శతజయంతి

ఉత్సవాలు ఘనంగా జరుపాలని, తద్వారా ఆశ్రమాన్ని గురించి తెలుగుదేశమంతటా తెలియజేయాలని తలంచినాను అందుకు శ్రీ వ్యాసాశ్రమ పీఠాధిపతులవారు, భక్తులగు మీరందరూ సహాకరించినారు. 1976 లో స్వర్ణోత్సవాలు అమోఘంగా, దిగ్విజయంగా జరిగాయి.

ఆ తరువాత 1986 కు శ్రీ సద్గురు స్వాములవారు జన్మించి నూరు సంవత్సరాలవుతాయని 1981 లో గుర్తించినాను. 1976 లో శ్రీవారి శతజయంతి ఉత్సవాలను చాల ఘనంగా భారతదేశ వ్యాప్తంగా చేయాలని సంకల్పించినాను. ఈ విషయాన్ని వరంగల్లు సనాతన సభలలో శ్రీ సద్గురు స్వాములవారి ముఖ్యమైన శిష్యులతో, భక్తులతో, మహాత్ములతో చర్చించినాను. వారందరూ తప్పక చేయాలని, అందుకు పూర్తి సహకారం వుంటుందని బలపరచినారు. శ్రీ వ్యాసాశ్రమ పీఠాధిపతులు పూజ్యశ్రీ విద్యానంద స్వాములవారు అంగీకరించినారు. వెంటనే వరంగల్లు సభలలోనే అచటికే తెంచిన మహాత్ములను, భక్తులను ఒకచోట సమావేశపరచి శతజయంతి ఉత్సవాన్ని జరపడానికి "శతజయన్త్యుత్సవ సంఘం" అని ఒక సంఘాన్ని ఏర్పరచినాము. సదరు సంఘంయొక్క మరుసమావేశం శ్రీ వ్యాసాశ్రమంలో జరిగినది. అందు శతజయంతి ఉత్సవాలు చాల ఘనంగా, అపూర్వంగా జరుపాలనియు, దానికి కొన్ని లక్షలు ఖర్చగుననియు, గాన దీనికి సంఘం సొసైటీ చట్టంక్రింద రిజిష్టర్ అయితే చట్టపరంగా ఏ ఇబ్బందులు వుండవనియు పలువురు సూచించినారు. ఆ విధంగానే శతజయంతి ఉత్సవ సంఘం తన ఆశయాలు, నిబంధనలతో రిజిష్టర్ చేయబడింది.

ఉత్సవాలకు, శతజయంతి సంఘ ఆశయాలగు జన్మస్థల స్మృతి నిర్మాణము, గోగర్భ తపోవన నిర్మాణం వగైరాలకు లక్షలకొలది

పైకం అవసరం గాన దానిని సంఘంలో సభ్యులను చేర్చుకొని సభ్యుల నుండే వసూలు చేయాలని నిర్ణయం జరిగింది. ఆ నిర్ణయ ప్రకారము కరపత్రాలు వేయబడినవి, మీ కందరకి అందజేయబడినవి. ఆయా ప్రాంతీయ సంఘాలు ఏర్పడ్డాయి. యథార్థ భారతి ద్వారా, కరపత్రాల ద్వారా విషయ మెరిగిన కొందరు వారికి వారే తమ తమ సభ్యత్వ రుసుములను నేరుగా చెల్లించారు, బ్యాంకుల ద్వారా పంపినారు. ఆ పిదప ఈ సభ్యుల ద్వారా ధనసేకరణ విషయంలో వయోవృద్ధులు, శ్రీ సద్గురు స్వాములవారి సాక్షాచ్ఛిష్యులు, ప్రొద్దుటూరులో శ్రీ కృష్ణగీతాశ్రమ స్థాపకులు, అనేక విద్యాలయముల స్థాపకులు శ్రీ నామా మెరుకలయ్యగారు అనే శ్రీ ఏకరసానంద స్వాములవారు తమ వార్ధక్యాన్ని గూడ లెక్కచేయక కర్నాటక, తమిళనాడు, రాయలసీమ అంతా తిరిగినారు. వారి పరిశ్రమ సహకారం అనన్య మైనది. వారికి నా కృతజ్ఞతాపూర్వక వందనములు. వారికి సహకరించిన శ్రీ కె. రాధాకృష్ణయ్యగారికి, శ్రీ అనంతానంద స్వామి వారికి నా వందనములు. అట్లే సర్కారు జిల్లాలలో పూజ్యశ్రీ రాజ శేఖరానంద స్వాములవారు, మాతృశ్రీ చోడే వెంకటరమణమ్మ గారు, మాతృశ్రీ నాగాచ్యుతకుమారి గారు అనే ధనమ్మగారు; శ్రీమతి బొప్పన సీతారామమ్మగారు, పూజ్యశ్రీ నిర్మలానంద స్వాములవారు, పూజ్యశ్రీ పరబ్రహ్మానంద స్వాములవారు, శ్రీ గాదంశెట్టి సుబ్రమణ్యంగారు తిరిగి ప్రచారంచేసి సభ్యత్వ పైకాన్ని వసూలు చేశారు. వారికిన్ని నా కృతజ్ఞతాపూర్వక వందనములు. తెలంగాణా విషయంలో పూజ్యశ్రీ దయానందస్వాములవారు (గాగిల్లా పురం), శ్రీ గుజ్జ భీమయ్యగారు, శ్రీ టి. పరమేశ్వరమ్మగారు, శ్రీ డా॥ రామాచారిగారు, శ్రీ నాగిళ్ళ లింగమూర్తిగారు పూజ్యశ్రీ ప్రణవానంద స్వాములవారు (కారంచేడు) విశేష పరిశ్రమ చేశారు. వీరికి నా కృతజ్ఞతాభివందనములు. వీరిసందరినీ ఆయాప్రాంతములలో

తోడు తీసుకొని అన్నిచోట్ల తిరిగినవారు పూజ్య శ్రీ మాధవానంద స్వాములవారు (చివటం), పూజ్య శ్రీ పరిపూర్ణానంద స్వాములవారు వీరికిన్నీ నా కృతజ్ఞతాభినందనలు ఇట్లు వీరందరి పరిశ్రమతో మీయందరి సహకారంతో శతజయంతి ఉత్సవాలకు ఇరవై ఐదు లక్షల రూపాయలు వచ్చినవి. వెంట్రుకలున్న అమ్మ ఏ కొప్పునైనా పెట్టుతుంది, పిండి వుంటే ఏ రకమైన రొట్టయినా చేయవచ్చు అన్నట్లు మీ అందరి దాతృత్వంతో ఇంత ఆర్థిక వసతి గల్గినందుననే శతజయంతి ఉత్స వాలకు భూరి ఏర్పాట్లు చేయగలిగాము. స్థిరనివాసయోగ్యమగు రూములు కట్టగలిగాము, అనేక గ్రంథముల ముద్రించ గలిగినాము. ఇట్లు ఇంత ఆర్థిక వసతిని గలుగజేసి శతజయంతి ఉత్సవాలకు పుష్టిని గలుగజేసిన సభ్యులగు మీ అందరికీ కృతజ్ఞతాభివందనములు.

అట్లే తిరుమల తిరుపతి దేవస్థానము వారిని మనము మన అభ్యర్థనా పత్రము ద్వారా కోరిన సహాయ సహకారాలన్నింటిని అందజేసినందులకు వారికి కృతజ్ఞతాభివందనములు. మఱియు శ్రీసద్గురు స్వాములవారియెడ, వారి సంస్థ శ్రీ వ్యాసాశ్రమము చేయు సమాజ సేవ యెడల విశేష ఆదరాభిమానములు గల పూజ్య శ్రీ సత్యసాయి బాబాగారు తమ ఆదరాభిమానములకు చిహ్నంగా లక్ష రూపాయల నిచ్చినందులకు వారికిన్ని కృతజ్ఞతాభివందనములు.

ఏ కార్యమైనా కేవలం డబ్బున్నంతమాత్రాన బాగా జరుగదు. శ్రద్ధాభక్తులతో నాది అని పనిచేసే కార్యకర్తలు అందుకు చాల అవసరం. వారి కార్యదీక్షచేతనే కార్యక్రమాలు దిగ్విజయంగా జరుగు తవి. శ్రీ సద్గురు కృపచే మంచి కార్యకర్తలు లభించారు. నిర్మాణ కార్యక్రమాలను తమ భుజస్కంధములపై నిడుకొని శ్రీ వేగుళ్ళ జానకిరామయ్యగారు, శ్రీ చిట్టూరి సత్యనారాయణగారు కృషి చేశారు. ఆశ్రమంలో శతజయంతి రూములను నిర్మించారు. వారికి

నా అభినందనలు. శతజయంతి పైకంతో పన్నెండు రూములు గల బ్లాకులు రెండు (24 రూములు) నిర్మింపబడినవి. తొమ్మిది రూముల బ్లాకు ఒకటి నిర్మింపబడింది. సింగిల్ రూములుగల రెండు వేరు వేరు గదులు నిర్మింపబడ్డాయి. ఇక ఆశ్రమంలో ఆరు రూములు నిర్మించాల్సి వుంది. తిరుమల గోగర్భంలో రెండు రూములు, ఒక తపోవనము, దానికి ప్రహరీ నిర్మించాల్సి వుంది. ఆశ్రమంలో సద్గురు స్తూపమందిరం నిర్మించాల్సి వుంది. జన్మస్థలంలో అతిథి గృహ నిర్మాణం జరిగింది.

ఇదివరలో శ్రీ సద్గురు సాన్నిధ్యంలో కొంత కాలముండినవారు, ఇపుడు శ్రీ శివానందాశ్రమంలో సన్న్యాసం తీసుకొని వుంటున్న శ్రీ అసంగానంద సరస్వతి స్వామివారు ఒక సంవత్సరం ముందే శత జయంతి నిమిత్తం శ్రీ వ్యాసాశ్రమం చేరారు. వారు నిరంతర కృషి చేశారు. ప్రచురణల విషయంలో, శతజయంతి సంచిక, శ్రీ గోవింద స్వాములవారి సంచిక విషయంలో. అంతేగాక సంయుక్త కార్యదర్శిగా శతజయంతి కార్యనిర్వహణలోను అవిశ్రాంత కృషి చేశారు. వారికి నా ప్రత్యేక కృతజ్ఞతాభినందనలు.

అల్లే శ్రీవారి గ్రంథాలను ఎనిమిదింటిని ఆంగ్లానువాదం చేసిన శ్రీ ఆర్. యం. చల్లాగారికి, ఆ అనువాదానికి కావలసిన ప్రోత్సాహం, ఏర్పాట్లు చేసిన ఇంజనీరు (ఎ. పి. పి. మిల్లు) శ్రీ బదరీనాథ్‌గారికిని, చాల అందంగా వానిని ముద్రించిన శ్రీ అడ్డేపల్లి నాగేశ్వరరావు గారికిని అభినందనలు అల్లే శ్రీవారి జీవిత చరిత్ర ఆంగ్లంలో రచించిన శ్రీమతి అడ్డేపల్లి వివేకానందదేవి గారికి, తెనుగున మరల సంగ్రహ జీవిత చరిత్రను అందించిన శ్రీ సముద్రాల లక్ష్మణయ్య గారికిని, హిందీలో శ్రీవారి చరిత్రను వ్రాసిన శ్రీ బాలచెన్నారెడ్డి గారికి (కంభం), శ్రీ సుందరమూర్తిగారికి (చితూరు), శ్రీవారి తొలి రచన శుష్కవేదాన్త తమోభాస్కరాన్ని హిందీలో అనువదించిన

శ్రీ ఆకెళ్ళ సీతారామం (రాజమండ్రి) గారికిని, కృతజ్ఞతా పూర్వక వందనములు. శతజయంతి ఆశయాలల్లో ముఖ్యాంశమగు ప్రచురణాలను తమ తమ ప్రెస్సులలో సర్వాంగ సుందరంగా ముద్రించి యిచ్చిన శ్రీ వేదవ్యాస ప్రెస్సు (చిత్తూరు), ఫ్రీడం ప్రెస్సు (మద్రాసు) శ్రీ కృష్ణచిత్ర ప్రింటర్స్ (మద్రాసు), రాజన్ ప్రెస్సు (మద్రాసు), మెర్క్యూరీ ప్రెస్సు (మద్రాసు), రత్నా ప్రెస్సు (మద్రాసు), బాలాజీ ప్రెస్సు (చిత్తూరు), ప్రయిమరీ ప్రింటర్స్ (రాజమండ్రి), సరస్వతీ ఫవర్ ప్రెస్సు (రాజమండ్రి) వారికిన్ని, ఎస్సార్ ప్రాసెస్ (మద్రాసు) వారికిన్నీ నా అభినందనలు.

సందిళ్ళ ఏర్పాట్లు, స్థల శుభ్రత, ఆశ్రమంలో ఏర్పాట్లు విషయంలో నెలరోజుల నుండి రాత్రింబవళ్ళు పరిశ్రమచేసి తన ఆరోగ్యాన్ని కూడ లెక్కచేయక సేవచేసిన శ్రీ కొట్టడి కృష్ణమూర్తిగారి సేవను ఎన్నడును మరువజాలము. వారికి నా అభినందనలు. అట్లే శతజయంతి ఉత్సవానికి ముఖ్యాంగమగు భోజనాల విషయంలో నిద్రాహార ములు మాని వంటలు చేయించిన నెల్లూరు శ్రీ కె. జి. కృష్ణమూర్తి గారికి, శ్రీ అయితా సుబ్బరాయులుగార్కి, పోరుమామిళ్ళ తులసి వెంకటసుబ్బయ్యగారికి, శ్రీ గుజ్జ భూమయ్యగారికి, శ్రీ అనంతానంద స్వాములవారికీ, వారికీ సహకారంగా నుండిన మిగతా పెద్దలకు నా వందనములు. అదే వడ్డన విషయంలో సహకరించిన అనేక ఆశ్రమ భక్తులకు, అమ్మగార్లకు, ఆశ్రమ పాఠశాల ఉపాధ్యాయులకు, బాల బాలికలకు, శ్రీ సత్యసాయి సేవా సమాజం వారికి (తిరుపతి) అభినందనలు. అతిథుల వసతుల విషయంలో నేతృత్వం వహించిన శ్రీ ప్రణవానన్ద స్వాములవారికి (కారంచేడు), శ్రీ అద్దేపల్లి వివేకానన్ద దేవి గారికి కృతజ్ఞతలు.

మహాత్ముల సేవా శుశ్రూషలలోను తదితర కార్యములలోను పూర్తిగా సేవజేసిన శ్రీ ప్రణవానంద స్వామీజీకి (ఋషీకేశ్),

శ్రీ సదానంద బ్రహ్మచారిగార్కి, ఆశ్రమ బ్రహ్మచారులకు, సాధు పుంగవులకు నా అభినందనలు. అయిదు రోజులు వేలమంది నివాస మున్నచోట పారిశుద్ధ్యం చాల ముఖ్యం. అందులో ఏ లోటుగల్గినా అచటజేరినవారి ఆరోగ్యాలకు తీవ్రప్రమాదం గల్గును. కానీ యీ విషయంలో అతి శ్రద్ధ తీసుకొని ఆశ్రమంలో నేగాక తత్పరిసర చెట్లల్లో అడవుల్లో గూడ ఎలాటి అపరిశుద్ధత లేకుండా చాలా కట్టుదిట్టంతో పరిశ్రమజేసిన చిత్తూరు కెప్టన్ ఆనందరాజుగారు, శ్రీ కాళహస్తి పురపాలక సంఘ పారిశుద్ధ్య సిబ్బంది ఎంతో ప్రశంసనీయులు. వారికి నా వందనాలు. సభాకార్యక్రమాలు ఆనందంగా జరుగాలంటే మంచి లైట్లు, మైకులు వుండాలి. ఆ విషయంలో చాల ప్రశంసనీయంగా ఏర్పాట్లు చేసిన తిరుమల తిరుపతి దేవస్థానం సిబ్బంది స్తుత్యులు. సభావేదికాలంకరణ, అధిష్ఠానమందిరాలంకరణలో ప్రత్యేక శ్రద్ధ తీసుకొనిన శ్రీ నిర్మలానంద స్వామివారికి, శ్రీ సుబ్బారావు గారికి అభినందనలు. అన్ని వేలమందికి మండుటెండలో మంచినీటి కొరత లేకుండా చేసిన తిరుమల తిరుపతి దేవస్థానం సిబ్బందికిన్నీ నా వంద నాలు. ఈ విషయంలో ప్రత్యేకశ్రద్ధ తీసుకొని పాటుపడిన శ్రీ మాధవా నంద స్వాములవారికి (చివటం), శ్రీ G. రామచంద్రరావు గారికి (కొత్తపల్లి) నా అభినందనలు. ఆంగ్ల సంభాషణను అనువదించిన శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారికి, మహామండలేశ్వరుల యొక్క హిందీ ప్రవచనాలను, సంస్కృత ప్రవచనాలను అనువదించిన శ్రీ శివానంద బ్రహ్మచారి, శ్రీ శంకరానంద స్వామి, శ్రీ సదానంద బ్రహ్మచారులకు నా వందనములు.

ఇన్ని వేలమంది భక్తులు సుదూర ప్రాంతాలనుండి వచ్చినారంటే దానికి తగు సౌకర్యం, అన్ని ఎక్స్‌ప్రెస్ బస్సులను ఏర్పేడులో ఆపు నట్లు, ఆ రోజుల్లో ఆశ్రమానికి ప్రత్యేక బస్సులు నడుపునట్లు ఏర్పాటు చసిన ఆంధ్రప్రదేశ్ రోడ్డు రవాణా (ప్రభుత్వ) సంస్థవారికి, ఆ

మార్గంలో పోయే అన్ని ఎక్స్‌ప్రెస్ రైలులను ఆ అయిదు రోజులు ఏర్పాడులో ఆగునట్లు ఏర్పాటుచేసిన సౌత్ సెంట్రల్ రైల్వేశాఖ వారికిన్నీ నా అభినందనలు.

మండు వేసవిలో ప్రయాణశ్రమలకోర్చి చాలదూరంనుంచి వచ్చి యీ శతజయంతి ఉత్సవాలకు తమ రాకద్వారా అపూర్వ శోభను చేకూర్చిన మహామండలేశ్వరులకు, సమస్త మఠాధిపతులకు, ఆశ్రమాధిపతులకు, మహాత్ములకు పునఃపునః నా కృతజ్ఞతాపూర్వక ప్రణామాలు. తమ ధనమును యిచ్చి యీ శతజయంతి ఉత్సవాలకు పుష్టి నిచ్చుటేగాక శ్రమకోర్చి ఇంతదూరం వచ్చి వుండుటకు, పరుండుటకు తగినంత సౌకర్యం లేకున్నా వుండి, ఈ ఉత్సవంలో పాల్గొని శ్రీ సద్గురువులవారికి మీమీ శ్రద్ధాంజలి సమర్పించి ఉత్సవాలను దిగ్విజయం చేసిన సభ్యులగు మీ అందరికీ కృతజ్ఞతాభివందనములు.

ఈ శతజయంతి ఉత్సవంలో ముందు నిలుచుటేగాక గౌరవాధ్యక్షులుగా నుండిన శ్రీ శివానందాశ్రమాధిపతులు పూజ్యశ్రీ చిదానంద స్వాములవారికి, అధ్వర్యం వహించిన శ్రీ వ్యాసాశ్రమాధిపతులు పూజ్యశ్రీ విద్యానన్ద స్వాములవారికి, శ్రీ శుకబ్రహ్మాశ్రమాధిపతులు పూజ్యశ్రీ విద్యాప్రకాశానంద స్వాములవారికి, శ్రీ భూమానందాశ్రమాధిపతులు పూజ్యశ్రీ రామకృష్ణానంద స్వాములవారికి నా నమస్కారాలు. శ్రీ వ్యాసాశ్రమ కార్యదర్శిత్వ భారంతోబాటు ఈ శతజయంతి ఉత్సవాధ్యక్ష పదవిని స్వీకరించి శతజయంతిని ఘనంగా నడిపించిన పూజ్యశ్రీ గోవిందస్వాములవారికి నా వందనములు. అట్లే కార్యనిర్వాహక సంఘంలో వుండి అన్నివిధాల సహకరించిన కార్యనిర్వాహకవర్గ సభ్యులందరికీ, అట్లే కోశాధికారిగా, ఉపకోశాధికారిగా బాధ్యతల నెరవేర్చిన శ్రీ ఏకరసానంద స్వాములువారికి, శ్రీ పి. కుమారస్వామిగారికిన్నీ నా అభినందనలు. అట్లే మా లెక్కలను

ప్రత్యేక శ్రద్ధతో ఆడిట్ చేసిన ఆడిటర్ గోపిగారికి నా వందనములు. శతజయంత్యుత్సవాల నిమిత్తం తమ బ్యాంకుల ద్వారా పంపు పైకానికి ఏలాటి రుసుం లేకుండా పంపు ఏర్పాట్లు చేసిన ఆంధ్రా బ్యాంకు వైశ్యా బ్యాంకు, కెనరా బ్యాంకు యజమాన్యానికి కృతజ్ఞతాభి వందనములు. ఈ శతజయంత్యుత్సవాలల్లో చాలా శ్రద్ధతో హృదయ పూర్వకంగా ప్రేమతో వైద్యం చేసిన శ్రీ డాక్టర్ లక్ష్మణరావుగార్కి, శ్రీ డాక్టర్ శ్రీహరి రావుగార్కి, శ్రీ డాక్టర్ రామచంద్రా రెడ్డిగారికి, శ్రీ కుమారి డాక్టర్ గాయత్రిగార్కి నా వందనాలు. శతజయంత్యుత్సవాలను ఎప్పటికప్పుడు ప్రచార ప్రసారాలు చేసిన ఆంధ్రప్రదేశ ప్రభుత్వ ప్రచార & పౌరసంబంధశాఖ అప్పటి కమీషనర్ శ్రీ ప్రసాద్ గార్కి వారి శాఖ సిబ్బంది అందరికీ, అట్లే రేడియో, T. V. శాఖా సిబ్బందికి మరియు అన్ని పత్రికా విలేఖరులకు, పత్రికాధిపతులకు నా కృతజ్ఞతాభి వందనములు.

యేన కేన ప్రకారేణ ఈ శతజయంత్యుత్సవంలో సహకరించి యున్న ప్రతివారికీ, దీని దిగ్విజయానికి పాటుబడిన ప్రతివారికి నా ప్రత్యేక వందనాలు.

ఈ శతజయంతి సమీక్షలో అన్నిరకాల సభ్యుల పేర్లు చందాలు ముద్రించ ప్రయత్నించినాము ఆఖరున జమాఖర్చులు ఆడిట్ రిపోర్టులను పొందుపరచినాము. అట్లే ఇందు శతజయంతి వుత్సవ సమీక్షు వుపన్యాసాలు పూర్తిగా ముద్రించలేక పోయినాము. వుపన్యాసాలను వ్రాయడానికి టేపులు — కేసెట్లు మాకు లభ్యం కాకపోవడమే కారణము. లభించినంతవరకు మొదటిరోజు ప్రవచనాలు సంగ్రహంగా పొందుపరచినాము.

ఆంధ్ర దేశ చరిత్రలో, కాదు కాదు దక్షిణ భారత చరిత్రలో ఒక అపూర్వ సమ్మేళనంగా అందరి చేత కొనియాడబడిన ఈ శత జయంత్యుత్సవాలను ఇంత అపూర్వంగా నడుపుకొనిన పూజ్య శ్రీ సద్గురు స్వాములవారికి, శ్రీ జగదీశ్వరుడగు సర్వేశ్వరునకు నా ప్రణామాంజలి సమర్పిస్తూ విరమిస్తున్నాను.

ఓమ్

శాన్తిః శాన్తిః శాన్తిః

ఇట్లు మీ

[signature]

కార్యదర్శి

శతజయన్త్యుత్సవ సంఘం

30-1-86

శ్రీ వ్యాసాశ్రమము

---

గమనిక : గదుల దాతల పేర్లు 153 వ పేజీలో శ్రీ గుజ్జభూమయ్య గారుతో బాటు శ్రీ మెర్ల గంగారామ్‌గారు అని చదువుకొనవలెను.

SWAMI DAYANANDA SARASWATI

Purani jhadi
Rishikesh

Br. Gopal 1st June 85
Sri Vyasasramam
Yerpedu

Dear Br. Gopal

I am very happy that I could attend the Centenary Festival of Sri Sadguru Malayala Swami. I did want to write to you about the great arrangements you had made for the whole Celebration. It was a great sight to see so many mahatmas assembled for the function in the midst of those hundreds of devotees. That the glory of a Mahatma does not die with his passing away, that it would continue to abide and inspire the people for generations to come was evident in the festival you had organised. I congratulate you for the glorious work you have done.

With best wishes,

Yours
**Swami Dayananda Saraswati.**

పురాణఝూడి
ఋషీకేశ్
1-6-85

ప్రియ గోపాల్ సోదరా!

శ్రీ సద్గురు శ్రీ మలయాళస్వాములవారి శతజయంతి ఉత్సవములలో పాల్గొనుట సంతోషదాయకమైనది. అనేక మహాత్ములు, వేలకొద్ది భక్తులతో కూడుకొన్న ఉత్సవం నేత్రానందకరంగా వుండినది మీరు చేశిన భారీ ఏర్పాట్లు, సత్కారాలు, సన్మానాలు గురించి వ్రాయటం అనవసరమనే నేనుభావిస్తున్నాను. ఎందుకంటే భాషకు భావమునకు అందుపాటులేనివి మీ ఏర్పాట్లు

మహర్షులు పరమపదించినా వారి దివ్యాత్మ పరమ పదించక వారి దివ్యజ్యోతి కాంతుబు నలు చెరుగులా వ్యాపిస్తుంటాయి. వారి దివ్యబోధలు ఆశయాలు వారితోనే పోక సత్సంగులకు సజ్జనుల హృదయములను పులకిరించి ప్రజలను పునీతం చేస్తున్నాయి అనటానికి తార్కాణమే జయప్రదమైన శతజయన్తి సమావేశ ఉత్సవము.

ఇంత విశిష్టంగా ఉజ్వలంగా వుత్సవాలను జయప్రదంగా నిర్వహించిన మీకు అభివందనలు.

మీ—

స్వామి దయానంద సరస్వతి.

BIDAR 15-12-1985

Dear B. Gopalji,

It is worth while for me to convey my hearty thanks for the hospitality given to me at Sri Vyasasramam on the eve of Sri. Sadguru Maharshi Malayala Swamiji's Centenary Festival. I think my part of service at the festival was mere a drop in a occasion.

I wondered at the systamatised organisation made at a large scale, arranging for the shelter, food, water seperately for drinking, bathing and washing, medicine transportation and light arrangements for the thousands of devotees and pilgrims, who attended the festival, from all over Andhra Pradesh and Karnataka.

The cordination and combination of enlightned and ever blissed saints and sages all over the country was really the blessings of all mighty and Sri. Sadguru Maharshi Malayala Swamiji. The preachings of Holy sages and saints was a flow of Dayana Ganga which purified the soles of thousands of devotees. The arrangement of translating the speeches of the saints into Telugu appeared to me like spoon feeding to the devotees.

I desire that such type of functions, which enlightnes and provides for the ever bliss of devotees and pilgrims in mass, should be arranged oftenly.

With best wishes and blessings,

Om Tat Sat

Yours
**Shivakumar Swamiji.**

శ్రీ సిద్ధారూఢమఠం
బీదర్
15-11-85

ప్రియగోపాల్‌జీ!

శ్రీ సద్గురు మహర్షి మలయాళస్వాములవారి శతజయంత్యుత్సవంలో పాల్గొనటం ఎంతో సంతోషదాయకమైనది. శ్రీ వ్యాసాశ్రమంలో మీరు జరిపిన ఈ వేడుకల్లో నా యెడల మీరు చూపిన ఆత్మీయతకు అభినందనలు. ఆ మహాసభల్లో నేను సముద్రంలో నీటి బొట్టు లాంటి వాణ్ణి. ఐనా మీరు ప్రతివక్కారిని పేరుపేరునా పలకరించి, పరామర్శించి, సత్కరించటం, వచ్చిన వాళ్ళకు అన్ని రకాల వసతులు మంచినీళ్ళు, భోజనం, విడిది, వైద్య సదుపాయాలు, విద్యుద్దీపాలంకరణలు వంటి, సదుపాయాలు హృదయ రమ్యంగా వున్నాయి.

ముముక్షువులు, ముక్తిగాములు, పరివ్రాజకులు పరస్పర చర్చలు, బోధలే కాకుండా పరస్పర అవగాహనకు అవకాశం కలగటం మహర్షి పరమహంస శ్రీ మలయాళస్వామివారి దివ్య ఆశీస్సుల వలనే, మహర్షుల మహాత్ముల బోధనలు నిర్ఝర గంగా ప్రవాహంవలే సాగి ధ్యానగంగ హృదయాలను పునీతం చేశాయనటంలో అతిశయోక్తి లేదు. అన్య భాషీయుల భాషను తెలుగులోనికి తర్జుమాచేసి వినిపిస్తుంటే ఎంతో హృద్యంగా రమ్యంగా వుండి చెంచాతో తినిపించినట్టున్నది.

ఆధ్యాత్మిక గౌరవాలు ఆశ్రమ ధర్మాలు పెంపొందాలంటే ఇటువంటి సభలు మున్ముందు ఎన్నో జరగాలని దానివల్ల భక్తులు యాత్రికులు లబ్ధి పొందాలని ఆకాంక్షిస్తూ అభినందనాశీస్సులతో.

ఓమ్ తత్సత్ — మీ
శ్రీ శివకుమార స్వామీజీ

CHINMAYARANYAM

Swamini Sarada Priyananda Ellayapalli

28-11-85

Looking back after all these months to remember how the Jayanti celebrations took place, one is left with wonderment at the grand spiritual felst that thrilled the hearts of the onlookers.

Usually the plans and ambitions will be very high and the actualities will be far below the mark. But not in the case of the spiritual Master or his institution. Like a tiny seed growing into a huge banian tree sheltering thousands of birds, so too the sankalpa of the great soul grows into a huge movement to inspire and guide generations of sincere sadhaks,

The Jayanti Celebrations are a fine. example of this phenomenon. The planners expected a gathering of forty to fifty thousand people. The audience swelled up far beyond the wildest imagination of all. It was a human stream of seventy to eighty thousand devotees flowing in and out of the Ashram during all the five days. Despite the discomforts and inconvenience which they must have felt, none was deterred. No untoward happenings took place, no unruly behaviour nor indecent talk to mar the spirtiual atmosphere. It was the homage of the grateful people to a revered sage who poured himself out for their welfare. It was the homage of the ordinary man within the limitatioas to the wise master who went beyond all bondage. It was India that is Bharat revelling in spirituality. It was the homage of wealth and power bending low to make obeissance to Emperor of Atma Samrajya!

Salutations to the great Master whose Light continues to kindle the spiritual spark in the heart!

Thy ownself

**Saradapriyananda.**

చిన్మయారణ్యము                ఎల్లాయపల్లి

ఇటీవల అత్యద్భుతంగా జరిగిన శ్రీ స్వామి వారి జయంతి ఉత్సవాలను తలుచుకొంటుంటే హృదయం పులకరిస్తోంది. ఇంత గొప్పగా, ఉజ్జలంగా చేయటం సాధ్యమా? అనిపించేటట్టు జరిగినదానిని తలుచుకొంటుంటే ఆస్తికులకే కాదు ముముక్షువులకే కాదు, సమస్త ప్రజానీకానికి సంతోషదాయకంగా వున్నది.

ఆలోచనలు ఆశయాలు జాస్తిగా వుండి ఆచరణకు వచ్చేటప్పటికి గాలిమేడల్లా తేలిపోతుంటాయి. అలా కాకుండా ఆద్యాత్మిక చింతనా పరులకు, సర్వసంగ పరిత్యాగులకు, పరమహంసలకు జరిగిన ఏర్పాట్లు, వారికి జరిగిన సత్కారాలు చూస్తుంటే ఈ ఆశ్రమాన్ని స్థాపించిన శ్రీ మలయాళ స్వాములవారి సంకల్ప సిద్ధులనిపిస్తున్నది. వారి దివ్య ఆత్మ దీన్ని ఇంత గొప్పగా నడిపించి వుండవచ్చును.

వేల మంది భక్తులు, సాధువులు, సన్యాసులు పరివ్రాజకులు పరమహంసలను ఒక్కచోట చూచేభాగ్యం, వారి దివ్య బోధనలు వినే అవకాశం కలగటం పూర్వ జన్మ సుకృతమో - అదృష్టమో అయి వుండాలి. సభలు, వుత్సవాలు జరపటం తేలికే కాని వాటిని జయప్రదం చేయటం ఇంతమందికి స్వాగత సత్కారాలు అతిథి మర్యాదలు చేయటం సామాన్య విషయమా? ఎవరికీ ఎటువంటి అసౌకర్యములు కలగకుండా జరిపిన నిర్వాహకులకు స్వామి వారి అదృశ్యబలమే కారణమై వుండును.

స్వామివారి దివ్యజ్యోతి కాంతుల్లో అజ్ఞానాంధకారము పటాపంచలగు గాక!

—స్వామి శారదాప్రియానంద.

SWAMI SASWATHIKANANDA

Sivagiri Mutt- Varkala-695141, Kerala.

2nd June 85

Dear Sri Gopalji,

Thanks for your kind letter dated 22nd May '85. I am really elated to learn that the Celebrations were a grand success.

Myself, the accompanied Sanyasins and Dr. P. K. Gopala-

krishna were happily surprised over the elaborate arrangements made under your able guidence and the devotional respond of millions of devotees offering their personal participation despite inevitable inconveniences common in identical situations.

In fact, we were all the more happy for having made ourselves a part of the Celebrations.

I would avail of this opportunity to convey to one and all of the Vyasahram, to you in particular, for the special care shown to us.

May Gurudevan Bless You Always.

Yours very sincerely,

**Swami Saswathikananda.**

To

**Brahmachari Gopal,**
Secretary, The committee for the
Birth Centenary of Sadguru Sri. Maharshi
Malayal Swamijl
Yerpedu, Chitoor·

ప్రియశ్రీ గోపాల్ జీ, శివగిరిమఠం, కేరళ

మీరు 2 -5-85 వ్రాసిన జాబు చేరినది. కృతజ్ఞతలు. శతజయంతి ఉత్సవములు ఉన్నతంగా ఉజ్వలంగా ముగిశాయని తెలిసి సంతోషిస్తున్నాను.

నేను, నాతోపాటు పాల్గొన్న సన్యాసులు మరియు డా॥ పి. కె. గోపాలకృష్ణ భారీ ఎత్తున, విస్తృతంగా వేల కొద్ది భక్తులను, నూర్ల కొద్ది మహాత్ములను ఒకచోట చేరుటకుగాను మీరు చేసిన అద్భుత ఏర్పాట్లు చూచినాము అభిందనీయమైనవి. చిన్న చిన్న అసౌకర్యములు వదిలేస్తే, ఇంత ఉన్నతంగా జరిగిన ఈ ఉత్సవంలో పాల్గొనటం సంతోషదాయకమైనది.

ఈ ఉత్సవాన్ని జయప్రదంగా నిర్వహించిన శ్రీ వ్యాసాశ్రమమువారికీ, ముఖ్యంగా ప్రతి వక్కరినీ పలకరించి, పరామర్శించి పలు తెరుగుల గమనించిన మీకు అభినందనీయులు. మీరు మా ఎడ చూపిన అభిమానానికి కృతజ్ఞతలు.

గురుదేవుడు సదా రక్షించుగాక !

స్వామి శాశ్వతికానంద—

శ్రీ దక్షిణామూర్తి మఠం,

శ్రీ దక్షిణామూర్తయేనమః మిశ్రపోఖరా

వారాణసీ (కాశీ)

శ్రీ దక్షిణామూర్తి మఠ వాస్తవ్యేన శాశ్వతానన్దతీర్థ స్వామినా క్రియన్తే నారాయణ స్మృతయః। బోభవతు శివాశిషో బ్రహ్మచారిణే గోపాలాయ జయన్త్యుత్సవ సంఘస్య కార్యదర్శినే। శ్రీమతాం మలయాళ స్వామినాం శత జయన్త్యుత్సవః సానన్దం సమ్పన్న ఇతి నిశమ్యామోదే! ప్రజాముపకుర్వన్తి సర్వే ధార్మికోత్సవాః పరం పరమోపకారాయ భవన్తి యతి సమ్మేళన ఘటితాః పరమ పురుషార్థ సాధన బోధకత్వాద్యత్యుక్తీనామ్। పరమాదరణీయా వేదాన్తబోధ ప్రద్యోతిత స్వాన్తాః పరమహంసా జయన్త్యుత్సవేఽశోభన్త। అహమపి సమమేళిషం శ్రీజయన్త్యుత్సవే। అహో! కీదృశీ సువ్యవస్థా! సర్వేషాం సుఖ సువిధాయై సావధానతా సంఘ సదస్యానామ్ జన సమ్మర్ద స్యైయత్తం నైవా పశ్యమ్। మహద్భక్తిః స్వామి చరణ చరణేషు తత్రత్యానామ్। అద్యాపి మోదతే హృదయం స్మారం స్మారం శ్రీ మలయాళ యతి జయన్త్యుత్సవమ్, తస్మిన్నుపలబ్ధమానానందఞ్చ। నైతాదృశముత్సవం సమవలోకిషి క్వాపి భారతే వర్షే। సర్వేయతయో గృహస్థాశ్చ ప్రాశంసిషుః సమస్తముత్సవమ్। ఏవమేవ ప్రతివర్షమపి శ్రీ వ్యాసాశ్రమే సంమిల్యాసురాచార్యాః శుశ్రూషవో గృహిణిశ్చ శ్రీ స్వామినాం జయన్త్యుత్సవ ఇతి భగవన్తముమారమణం రమారమణం చ ప్రార్థయే.

శ్రీ భగవత్పాద పాదారవిన్దోపాసకః

శాశ్వతానన్ద తీర్థః

శ్రీ దక్షిణామూర్తి సంస్కృత మహా విద్యాలయస్య,

న్యాయ విభాగాధ్యక్ష చరః

శత జయన్త్యుత్స కార్యదర్శి బ్రహ్మచారి గోపాల్‌కు

నారాయణ స్మరణలు !

శత జయన్త్యుత్సవాలు ఆనందంగా జరిగినందులకు సంతోషించుచున్నాను. ధార్మికోత్సవాలన్నీ ప్రజోపకారకములగుచున్నవి. పరమాదరణీయులు వేదాన్త బోధచేత ప్రకాశింపబడిన అన్తః కరణంగలవారగు పరమహంసలు (మహాత్ములు) ఈ జయన్త్యుత్సవంలో పాల్గొనడము మరింత శోభ నిచ్చింది. జయన్త్యుత్సవంలో నేనున్ను పాల్గొన్నాను.

ఆశ్చర్యం ! ఎంత మంచి ఏర్పాట్లు ! అందరి సుఖ సువిధల నిమిత్తం సంఘ సభ్యులు చాల జాగ్రత్తలు తీసుకున్నారు. వేదాన్త సభలకు యింతమంది జనులు కూడడం నే నెచ్చటా చూడలేదు. శ్రీ స్వామి చరణుల (శ్రీ మలయాల స్వాములవారి) పదకమలములయందు అచటివారికిగల భక్తి చాల గొప్పది. శ్రీ మలయాళస్వామివారి శత జయన్త్యుత్సవమును, దానివలన గల్గిన ఆనందాన్ని తలంచుకొని, తలంచుకొని నా హృదయం ఇప్పటికీ సంతోషిస్తూంది. భారతదేశంలో ఎచటను ఇటువంటి ఉత్సవాన్ని నేను చూచి వుండలేదు.

అందరు మహాత్ములూ. గృహస్థులున్ను ఈ ఉత్సవాన్ని చాలా పొగడినారు. ఈ విధంగా ప్రతి సంవత్సరం శ్రీ వ్యాసాశ్రమంలో ఆచార్య పురుషులు [మహాత్ములు] గృహస్థులు కలసి శ్రీవారి జయన్త్యుత్సవాలను నడుపుదురుగాక యని పరమేశ్వరుని, రమారమణునిన్ని ప్రార్థించుచున్నాను.

ఇట్లు,

స్వామి శాశ్వతానన్ద తీర్థ,

శ్రీ దక్షిణామూర్తి సంస్కృత మహా విద్యాలయ

భూతపూర్వ న్యాయ విభాగాచార్యులు.

ఓం తత్సత్ ఋషీకేశ్

తే 20-9-85

దైవాత్మ స్వరూపులు, పవిత్రాత్ములైన శ్రీ బ్రహ్మచారి గోపాల్‌గారికి—
ప్రేమపూర్వక నమస్కారములు.

శతజయంత్యుత్సవముల ద్వారా, మీరు చేసిన గురుసేవ అమోఘము, అత్యద్భుతము, మిక్కిలి శ్లాఘనీయము. శ్రీవారివి ఎన్నో గ్రంథములను అచ్చొత్తించి భక్తులకు అందజేసితిరి.

శతజయంత్యుత్సవ కార్యక్రమములు జ్ఞప్తికి వస్తే జీవితంలో, మరల అటువంటి కార్యక్రమములను చూడగలుగుదుమా! యని తోచుచుండును. శ్రీ సద్గురు దేవుని దివ్యానుగ్రహం సదా మీయందుండుగాక. ఇట్లు

మీ దేవానంద - చిన్నస్వామి



ఆంధ్ర సాహితీ ప్రచారసభ

కెల్విన్ లైను ¼, తాల్పుకూర్ పోస్టు, 24 పరగణాల జిల్లా, పశ్చిమ బెంగాల్

శ్రీ గోపాలబ్రహ్మచారి వారి పవిత్ర సన్నిధానమునకు :-
ఆర్యమహాశయా ! హార్దిక నమస్సులు.

పూజ్యశ్రీ సద్గురు మహర్షి వరేణ్యుల శతజయంత్యుత్సవ మహాసభలు ప్రముఖ మహా మండలేశ్వరులు, తపోనిధులు, భక్త జిజ్ఞాసు మనీషుల పవిత్ర సమక్షమున పరమ పవిత్ర వాతావరణమున బహు విజయవంతముగ పరిసమాప్తమై బహుజనామోద ప్రమోద సంజనకములై లోక కళ్యాణ శాంతి కారకములై చరితార్థములైనట్లు విని యానందించితిని. శ్రీ సిద్ధిమత మండలేశ్వరులు పూజ్యశ్రీ బాలకృష్ణ యతీంద్రులు కలకత్తా విచ్చేసిన సందర్భమున వారిని దర్శింపగా శ్రీ వ్యాసాశ్రమ కార్యక్రమ వైభవము తత్రస్థ శస్త్రియు వారి శ్రీముఖమున మేము మనోరంజకముగ శ్రవణ ప్రియముగ నాకర్ణించితిమి.

తమ నిత్యక్షేమాభ్యుదయముల నాకాంక్షించు భవదీయ సద్గురు సేవా జీవి.

కె. లింగరాజు

సహాయ సంయుక్త కార్యదర్శి



" ఓం నమో భగవతే శ్రీ మలయాళ యతీన్ద్రాయ "

శ్రీ సద్గురు మహర్షి

# మలయాళస్వాములవారి
# శత జయన్త్యుత్సవములు

**28 - 3 - 85** నుండి **1 - 4 - 85** వరకు

శ్రీ వ్యాసాశ్రమము

శ్రీ వ్యాసాశ్రమ స్థాపకులు, ఆంధ్రదేశానికి ఆధ్యాత్మిక పితామహులు, స్త్రీ జనోద్ధారకులు అగు మన గురుదేవులు శ్రీ సద్గురు మహర్షి మలయాళ స్వాములవారి శత జయన్త్యుత్సవాలు 1985 సం॥ మార్చి 28 తేది సప్తమి గురువారము నుండి 1-4-85 తేది చైత్ర శుద్ధ ఏకాదశి సోమవారము వరకు శ్రీ వ్యాసాశ్రమములో జరుగును. భక్తులందరు పాల్గొని ఆనందింతురు గాక !

27—3—1985 బుధవారము సాయంత్రము

అంతర్జాతీయ దివ్యజీవన సంఘాధ్యక్షులగు

పూజ్యశ్రీ స్వామి చిదానంద సరస్వతీజీ మహరాజ్ చే

శ్రీ అసంగానంద వైద్యశాల భవనమునకు ప్రారంభోత్సవము.

28—3—1985 గురువారము

ఉదయం 4-15 గం॥ శ్రీ సద్గురు సుప్రభాతము ఉ. 5 గం॥ ప్రణవ పతాకావిష్కరణ

శ్రీ వ్యాస పీఠాధీశ్వరులగు

పూజ్యశ్రీ విద్యానంద స్వాములవారు, శ్రీ వ్యాసాశ్రమము

సద్గురు చిత్రపటావిష్కరణ :—

పూజ్యశ్రీ గీతానంద స్వామీజీ మహరాజ్

శ్రీ నారాయణ ధర్మ సంఘ ట్రస్టు - మాజీ అధ్యక్షులు, శివగిరి మఠము - కేరళ.

జ్యోతి వెలిగింపు :—

పూజ్యశ్రీ శాశ్వతికానన్ద స్వామీజీ మహరాజ్

అధ్యక్షులు, నారాయణధర్మ సంఘట్రస్టు, శివగిరిమఠము, కేరళ.

## గీతపారాయణ

గీతాపారాయణ సమయంలో ప్రతిదినము శ్రీ వ్యాసాశ్రమ వ్యాస పీఠాధీశ్వరులగు పూజ్యశ్రీ విద్యానంద స్వాములవారు ప్రవచనము చేయుదురు.



## ప్రథమ యతి సమ్మేళనము

ఉదయము 9-30 గం॥ నుండి 11-30 గం॥ వరకు

అధ్యక్షులు :.... పూజ్యశ్రీ రంగనాథానంద స్వాములవారు
శ్రీ రామకృష్ణ మఠాధ్యక్షులు, హైదరాబాద్.

స్వాగత సమర్పణ :- శ్రీ పెళ్ళకూరి రామచంద్రా రెడ్డిగారు
శత జయన్త్యుత్సవ సంఘ ఉపాధ్యక్షులు.

పరిచయ వాక్యములు :— శ్రీ బ్రహ్మచారి గోపాల్ గారు
శతజయన్త్యుత్సవ సంఘ కార్యదర్శి.

శ్రీ సద్గురు స్వాములవారి ఆంగ్ల గ్రంథావిష్కరణ :
(సభాధ్యక్షులగు పూజ్యశ్రీ రంగనాథానంద స్వాములవారిచే)

శ్రీ సద్గురు స్వాములవారి గ్రంథములను ఆంగ్లభాషలోనికి అనువాదము గావించినట్టి
శ్రీ ఆర్. ఎమ్. చల్లా వారికి సన్మానము

ప్రారంభోపన్యాసకులు :

ఆచార్య మండలేశ్వర్ పూజ్యశ్రీ స్వామి విద్యానంద గిరిజీ మహారాజ్
కైలాస పీఠాధీశ్వరులు, ఋషీకేశ్.

ఉపన్యాసకులు :

1. పూజ్యశ్రీ స్వామి చిదానంద సరస్వతీజీ మహారాజ్,
ఋషీకేశ్.
2. పూజ్యశ్రీ సత్యానంద మహర్షులవారు,
శ్రీ సత్యానందాశ్రమ సంస్థాపకులు, ఇనమడుగు.
3. పూజ్యశ్రీ స్వామి నందానందజీ మహారాజ్,

శ్రీరామకృష్ణ మఠ్, కాంచీపురము, తమిళనాడు.

4. పూజ్యశ్రీ స్వామి శివకుమార్ జీ మహారాజ్,

శ్రీ సిద్ధారూఢ మఠాధ్యక్షులు, బీదర్, కర్నాటక.



రెండవ యతి సమ్మేళనము

అధ్యక్షులు :— పూజ్యశ్రీ ఆచార్య మండలేశ్వర్,

స్వామి విద్యానందగిరిజీ మహారాజ్, ఋషీకేశ్.

ఉపన్యాసకులు :

1. పూజ్యశ్రీ రంగనాథానందస్వాములవారు, హైదరాబాద్.
2. మహామండలేశ్వర్ పూజ్యశ్రీ స్వామి బ్రహ్మానందజీ, మహారాజ్

సన్న్యాసాశ్రమాధిపతులు, బొంబాయి.

3. మహామండలేశ్వర్ పూజ్యశ్రీ ప్రకాశానందస్వామీజీమహారాజ్,

జగద్గురు పీఠాధీశ్వరులు, హరిద్వార్.

4. పూజ్యశ్రీ భూమానందస్వాములవారు,

శ్రీ బ్రహ్మవిద్యాశ్రమాధిపతులు, కల్యాణదుర్గము, అనంతపురం జిల్లా.



29–3–1985 శుక్రవారము, మూడవ యతి సమ్మేళనము

ఉదయము 8 గం॥ నుండి 11-00 గంటల వరకు

అధ్యక్షులు :—

మహామండలేశ్వర్ పూజ్యశ్రీ స్వామి బ్రహ్మానందజీ మహారాజ్,

బొంబాయి.

ఉపన్యాసకులు :

1. ఆచార్య మండలేశ్వర్ పూజ్యశ్రీ స్వామి విద్యానందజీ మహరాజ్, ఋషీకేశ్.
2. మహామండలేశ్వర్ పూజ్యశ్రీ స్వామి కాశికానందజీ మహరాజ్,

ఆనందవనాశ్రమము, బొంబాయి

3. పూజ్యశ్రీ స్వామి యోగానందజీ మహరాజ్, బ్రహ్మానందమఠాధిపతులు,మధురై
4. పూజ్యశ్రీ రామకృష్ణానందస్వాములవారు,

శ్రీ భూమానందాశ్రమాధిపతులు, గండీక్షేత్రము. కడప జిల్లా.



## నాల్గవ యతి సమ్మేళనము

సాయంత్రము 3-30 గం॥ నుండి 7-00 గంటల వరకు

అధ్యక్షులు :— పూజ్యశ్రీ స్వామి చిదానందజీ మహరాజ్, ఋషీకేశ్.

ఉ ప న్యా స కు లు :

1. మహామండలేశ్వర్, పూజ్యశ్రీ స్వామి ప్రకాశానందజీ మహరాజ్,
జగద్గురు పీఠాధీశ్వరులు, కన్ ఖల్ - హరిద్వార్.
2. మహామండలేశ్వర్, పూజ్యశ్రీ స్వామి అభినవ సచ్చిదానందజీ మహరాజ్,
శ్రీ భోళాగిరి ఆశ్రమము, కలకత్తా.
3. పూజ్యశ్రీ స్వామి నిత్యచైతన్యయతీజీ మహరాజ్,
శ్రీ నారాయణ గురుకులము. నీలగిరి.
4. పూజ్యశ్రీ మాతా త్యాగీశానందపురివారు, శ్రీ రామకృష్ణ సమాజము, బాపట్ల.
5. పూజ్యశ్రీ కారుణ్యానందస్వాములవారు, పుట్టపర్తి.



30-3-1985 శనివారము, ఐదవ యతిసమ్మేళనము

ఉదయము 8 గం॥ నుండి 11-00 గంటల వరకు

అధ్యక్షులు :—

మహామండలేశ్వర్, పూజ్యశ్రీ స్వామి కాశికానందజీ మహరాజ్,
బొంబాయి.

ఉ ప న్యా స కు లు :

1. మహామండలేశ్వర్, పూజ్యశ్రీ స్వామి గణేశానందజీ మహరాజ్, హరిద్వార్.
2. పూజ్యశ్రీ స్వామి విద్యానంద గిరీజీ మహరాజ్,
శ్రీ సుబ్బయ్యస్వామి మఠాధిపతి, మదరాసు.
3. పూజ్యశ్రీ స్వామి శాశ్వతానందజీ మహరాజ్, న్యాయాచార్య, వారణాశి
4. పూజ్యశ్రీ మాతా శారదా ప్రియానందజీ,
శ్రీ చిన్మయారణ్యము, యల్లాయపల్లె, కడప జిల్లా.



ఆరవ యతి సమ్మేళనము

సాయంకాలము 3-30 గం॥ నుండి 7-30 గంటల వరకు

అధ్యక్షులు :—

మహామండలేశ్వర్ పూజ్యశ్రీ స్వామి బాలకృష్ణయతీజీ మహరాజ్

ఉపన్యాసకులు :

1. పూజ్యశ్రీ రామనాథ జ్ఞానదేశికర్ స్వామీజీ మహరాజ్,
తిరుకొయిలూర్ మఠాధీశ్వర్, తమిళనాడు.
2. పూజ్యశ్రీ స్వామి శివకుమార్‌జీ మహరాజ్, బీదర్.
3. పూజ్యశ్రీ స్వామి మాధవచైతన్య భారతీజీ మహరాజ్, కాశీ.
4. పూజ్యశ్రీ యోగినీ మాతాజీ, శ్రీ విశ్వనాథమఠ్, చింతలపూడి.
5. పూజ్యశ్రీ స్వామి గీతానందజీ మహరాజ్, శివగిరిమఠ్, వర్కాల.



31—3—1985 ఆదివారము ఏడవ యతి సమ్మేళనము

ఉదయము 8-00 గం॥ నుండి 11-00 గంటల వరకు

అధ్యక్షులు :-

పూజ్యశ్రీ విద్యానందస్వాములవారు, శ్రీవ్యాసాశ్రమము.

ఉపన్యాసకులు ;

1. మహామండలేశ్వర్, పూజ్యశ్రీ స్వామి ప్రకాశానందజీ మహరాజ్,
కన్‌ఖల్, హరిద్వార్.
2. పూజ్యశ్రీ స్వామి నిత్యచైతన్యయతీజీ మహరాజ్ నీలగిరి.
3. పూజ్యశ్రీ స్వామి యోగానందజీ మహరాజ్, మధురై.
4. పూజ్యశ్రీ పూర్ణానందస్వాములవారు, నెల్లూరు.
5. పూజ్యశ్రీ నిర్విశేష శివానందగిరి స్వాములవారు,
శ్రీ బ్రహ్మనిష్ఠాశ్రమము, ఖమ్మమ్.
6. పూజ్యశ్రీ శాశ్వతికానన్దస్వాములవారు। శివగిరి మఠం.



ఎనిమిదవ యతి సమ్మేళనము

సాయంత్రము 3-30 గం॥ నుండి 7-00 వరకు

అధ్యక్షులు :— పూజ్యశ్రీ స్వామిని శారదాప్రియానందమాతాజీ,
చిన్మయారణ్యము.

ఉ ప న్యా స కు లు :

1. పూజ్యశ్రీ యోగినీ మాతాజీ, చింతలపూడి.
2. పూజ్యశ్రీ శాన్తిబాయిగారు, సాధు స్త్రీల మఠము, రాజమండ్రి.
3. పూజ్యశ్రీ స్వామి సిద్ధేశ్వరానందజీ మహరాజ్.
శ్రీ శంకరానంద గురుకులం - సానేపల్లి, అనంతపురం జిల్లా
4. పూజ్యశ్రీ వేద్యానందగిరి స్వాములవారు,
శ్రీనివాసాశ్రమము, అగరము, కర్నాటక.
5. పూజ్యశ్రీ నిర్విషయానందస్వాములవారు,
శ్రీ శాన్తి ఆశ్రమము, తోటపల్లి హిల్స్, తూర్పుగోదావరి జిల్లా
6. పూజ్యశ్రీ స్వామి శాశ్వతికానందజీ మహరాజ్,
శ్రీ శివగిరి ఆశ్రమము, వర్కల, కేరళ



1-4-1985 సోమవారము, జన్మదినము.
తొమ్మిదవ యతి సమ్మేళనము
ఉదయము 8-00 గం॥ నుండి 11-00 గంటల వరకు

అధ్యక్షులు :—పూజ్యశ్రీ రామకృష్ణానందస్వాములవారు, గండిక్షేత్రము

ఉ ప న్యా స కు లు :

1. పూజ్యశ్రీ స్వామి దయానంద సరస్వతీజీ మహరాజ్,
శ్రీ దయానందాశ్రమము, పురానా ఝూడి, ఋషీకేశ్,
2. పూజ్యశ్రీ సర్వేశ్వరానందస్వాములవారు,
అఖిలాంధ్ర సాధు పరిషత్ అధ్యక్షులు, తెనాలి.
3. పూజ్యశ్రీ స్వామి దేవానందజీ మహరాజ్, శ్రీ శివానందాశ్రమము, ఋషీకేశ్.
4. పూజ్యశ్రీ విరజానందస్వాములవారు, అఖిలాంధ్ర సాధు పరిషత్ భవనము, తెనాలి
5. పూజ్యశ్రీ ప్రసన్నాత్మానందగిరి స్వాములవారు, గండిపాలెము.
6. పూజ్యశ్రీ ప్రబోధానందస్వాములవారు.
శ్రీ యాజ్ఞవల్క్యాశ్రమము, మెండూరు, పశ్చిమగోదావరి జిల్లా.

రుద్రాభిషేకము (అధిష్ఠాన మందిరములో) పూజ.



పబ్లిక్ మీటింగ్

సాయంత్రము 3-30 గం॥ నుండి 7-30 గంటల వరకు

అధ్యక్షులు :— పూజ్యశ్రీ విద్యాప్రకాశానందస్వాములవారు,
శ్రీ శుకబ్రహ్మాశ్రమాధిపతులు, శ్రీకాళహస్తి.

ఉపన్యాసకులు :

1. పూజ్యశ్రీ స్వామిదయానంద సరస్వతీజీ మహరాజ్, ఋషీకేశ్,

2. పూజ్యశ్రీ దయానందగిరి స్వాములవారు,
శ్రీ ధ్యాననిష్ఠాశ్రమము, గాగిళ్ళాపురము.

3. పూజ్యశ్రీ ప్రణవానందగిరి స్వాములవారు,
హరేరామ జపయజ్ఞ సమాజాధ్యక్షులు, కారంచేడు.

4. పూజ్యశ్రీ బ్రహ్మానంద స్వాములవారు
అఖిలాంధ్ర సాధు పరిషత్-ఉపాధ్యక్షులు, కేశవదాసుపాళెం.

5. పూజ్యశ్రీ అశేషానంద స్వాములవారు,
శ్రీ గోపాలకృష్ణాశ్రమము, వెలిమినేడు, నల్గొండ జిల్లా.

6. పూజ్యశ్రీ రామకృష్ణానందగిరి స్వామిజీ మహరాజ్,
ఆనందాశ్రమము, విజయపుర, కర్ణాటక.

7. పూజ్యశ్రీ నిర్మలానంద స్వాములవారు,
శ్రీ మలయాళ స్వాములవారి గీతాశ్రమము, తెనాలి.

8. పూజ్యశ్రీ రామకృష్ణానంద స్వాములవారు, (ఎల్లంపల్లి)

9. పూజ్యశ్రీ చిదానందగిరి స్వాములవారు, (చిత్తూరు)

శత జయన్తి సమీక్ష : శ్రీ స్వామి అసంగానంద సరస్వతీజీ,
శత జయన్తి సంఘ సంయుక్త కార్యదర్శి.

కృతజ్ఞతలు : శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారు,
శతజయన్తి సంఘ సహాయ కార్యదర్శి.

శాంతి మంత్రములు

మంగళమ్,



శతజయన్త్యుత్సవంలోని యతి సమ్మేళనంలో వేదికపైన ఆసీనులైన
మహామణ్డలేశ్వరులు



శతజయంత్యుత్సవంలో 27-8-85 న పూజ్యశ్రీ చిదానందస్వాములవారు
ఆస్పత్రి భవనమునకు ప్రారంభోత్సవం చేయుట.



# మహర్షి - సద్గురు శ్రీ మలయాళ స్వాములవారి శతజయంతి మహోత్సవాలు

సముద్రాల లక్ష్మణయ్య

ఆంధ్రదేశ చరిత్రలోనే కాదు, అఖిల భారత చరిత్రలోనే అదొక అపూర్వ ఘట్టం. కనీ వినీ ఎరుగని ఆ సన్నివేశం ఐదురోజులపాటు అవిరామంగా కొనసాగింది. వివిధ ప్రాంతాల నుండి తండోపతండాలుగా తరలి వచ్చిన ఆ జనసందోహాన్ని చూచి అందరూ ఆశ్చర్యచకితులయ్యారు. సాధు బృందాలతోనూ, భక్తమండలులతోనూ శ్రీ వ్యాసాశ్రమ ప్రాంగణమంతా జనసందోహంతో క్రిక్కిరిసిపోయింది. భజనలు, సంకీర్తనలు, పారాయణలు, వేదాంత ప్రవచనాలు, తత్త్వ విచారాలు, మంగళ తూర్యనాదాలు, జయజయధ్వానాలు, దిక్కులను మారుమ్రోగించాయి. తిరునాళ్ళలోని తీర్థప్రజలాగా, ఏర్పేడు బస్సుస్టాండు నుండీ, రైల్వేస్టేషన్ నుండీ, తక్కిన కాలిబాటల నుండీ ఆశ్రమానికి వస్తూ పోతూ వున్న ఆ వేలాది ప్రజానీకాన్ని చూచి ఆశ్చర్యపడనివారు లేరు.

శ్రీ సద్గురు మలయాళ స్వాములవారి శతజయంత్యుత్సవాలు జరుగుతాయని బహుకాలంనుండీ అనుకొంటున్న విషయమే కాని ఈ కార్యక్రమానికి ఇంతమంది తరలి వస్తారనీ, ఇంత ఘనంగా ఏర్పాట్లు జరుగుతాయనీ ఏవరూ ఊహించలేకపోయారు. 'అనాహూతోఽధ్వరం గచ్ఛేత్' అన్నట్లు ఎవరికివారే ఈ జ్ఞానయజ్ఞ స్థలికి తరలి వచ్చారు. భారతీయులకు మహాత్ములమీద ఉన్న భక్తిశ్రద్ధలు ఎలాంటివో ఆధ్యాత్మికమయమైన ఆ వ్యాసాశ్రమ వాతావరణాన్ని కళ్ళారా చూచినవారికే అర్థమవుతుంది. ఆశ్రమ చరిత్రలో యిది ఒక స్వర్ణాక్షర లేఖ్యమైన సురుచిర సుందర ఘట్టం.

ఉత్సవ ప్రారంభానికి ఒక వారం రోజుల ముందునుండే ఆశ్రమానికి భక్తుల రాక ఆరంభమయింది. ఆకాశవాణి, దినపత్రికలు దూరదర్శని ఉత్సవ వార్తలను ప్రముఖంగా ప్రకటించాయి. రైల్వే శాఖవారు ఏర్పేడు స్టేషన్లో ఎక్స్‌ప్రెస్ రైళ్ళన్నీ ఆగేటట్లు ఆదేశాలు ముందుగానే జారీ చేశారు. రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థవారు

ఎక్స్‌ప్రెస్ బస్సుల విషయంలో కూడా ఈలాంటి ఉత్తర్వులే విడుదల చేశారు. మార్చి 25 నుండీ ప్రవాహ రూపంగా భక్తుల రాక మొదలైంది. ఆశ్రమ ప్రాంగణంలో షామియానాలు, తాత్కాలిక కుటీరాలు విస్తృతంగా ఏర్పాటు చేయబడ్డాయి.

తిరుమల తిరుపతి దేవస్థానంవారు విద్యుద్దీపాలు, నీటి సరఫరా, సభావేదికా లంకరణ, మైకులు-సౌకర్యాలను అత్యంత విస్తృత స్థాయిలో ఏర్పాటుచేసి ప్రజానీక ప్రశంసలకు పాత్రులయ్యారు. అన్నదానాది సౌకర్యాలు సమకూర్చడంలో కార్య కర్తలు తగిన శ్రద్ధ గైకొన్నారు. భగవదనుగ్రహం వల్ల, గురు కరుణవల్ల, మహర్షుల ఆశీర్వాదంవల్ల అన్నీ సవ్యంగా జరిగిపోయాయి.

తగిన సమయానికి మండలేశ్వరులు, మఠాధిపతులు, పీఠాధిపతులు, సన్న్యాసులు, సాధుపుంగవులు, బ్రహ్మచారులు వ్యాసాశ్రమం చేరుకొన్నారు. రామకృష్ణ మఠం, దివ్యజీవన సంఘం, చిన్మయ మిషన్, శ్రీ నారాయణ ధర్మ సంఘం, హథియారాం మఠం, సిద్ధారూఢ మఠం, బ్రహ్మానంద మఠం, సుబ్బయ్య స్వామి మఠం, సాధుస్త్రీల మఠం, అఖిలాంధ్ర సాధు పరిషత్తు, అనేకాశ్రమాలు— ఇలా పెక్కు ఆధ్యాత్మిక మహా సంస్థలకు చెందిన మహానుభావులెందరో ఆ వచ్చిన వారిలో వున్నారు.

సుప్రసిద్ధులైన మహా మండలేశ్వరులు హృషీకేశ్, హరిద్వార్, బొంబాయి, కలకత్తా, కాశీ మొదలైన సుదూర ప్రాంతాల నుండి రావడం విశేషం. ఇక గృహస్థ భక్తుల విషయం చెప్పనక్కరలేదు. పాత భక్తులు, క్రొత్త భక్తులు, సుపరిచితులు, అపరిచితులు, వేలకు వేలుగా ఆశ్రమం చేరిపోయారు. వీరిలో రెండు వంతులు స్త్రీలు. ఒక వంతు పురుషులు. మొత్తంమీద యాభై అరవై వేలమంది ప్రజలు ఈ మహోత్సవాలను సందర్శించారు.

మార్చి 27 సాయంకాలం దివ్యజీవన సంఘాధ్యక్షులు పూజ్యశ్రీ చిదానంద స్వాములవారు (హృషీకేశ్) పది పడకలు గల అసంగానంద వైద్యశాలకు ప్రారం భోత్సవం చేశారు. ఈ సందర్భంలో సంప్రదాయానుసారం పూజా కార్యక్రమం ముగిసిన తర్వాత శ్రీవ్యాసాశ్రమాధిపతులు పూజ్యశ్రీ విద్యానంద స్వాములవారు ప్రసంగిస్తూ ఇలా అన్నారు—

"ఈ ప్రాంతంలో తగిన వసతులు గల ఆస్పత్రి ఏదీ లేదు. అవసరమైనపుడు అటు తిరుపతికో, ఇటు కాళహస్తికో పరుగెత్తవలసినదే. ఈ పరిస్థితులను గమనించి

శ్రీ సద్గురు స్వాములవారి పేర ఒక వైద్యాలయం స్థాపించాలనే సంకల్పం మాకు చాలాకాలంనుండీ కలదు. అది నేడు కార్యరూపం ధరించింది. ఈ హాస్పిటల్ ఆశ్రమ వాసులకే కాక పరిసర గ్రామ ప్రజలకుకూడా ఎంతో ఉపకరించగలదనే తలంపుతోనే యిక్కడ నెలకొల్పడం జరుగుతున్నది. దీనిని ప్రారంభించవలసిందిగా పూజ్యశ్రీ చిదానంద సరస్వతీ స్వాములవారిని అర్థిస్తున్నాను."

తర్వాత వైద్యాలయానికి ప్రారంభోత్సవం చేస్తూ పూజ్యశ్రీ చిదానంద సరస్వతీ స్వాములవారు ఈ విధంగా అన్నారు—

"ఇది పరమ పవిత్రమైన దినం. ఇంగ్లీషు తారీకుల ప్రకారం మార్చి 27 శ్రీ సద్గురు మలయాళ మహర్షులవారి జన్మదినం. అంతేకాదు. నిన్నటికి వారు ఆవిర్భవించి నూరు సంవత్సరాలు పూర్తి అయ్యాయి. ఈనాడు వారి నూట ఒకటవ జన్మదినం. శ్రీ స్వాములవారు మహా తపస్వి. పరమ విరాగి. వేదాంత పితామహులు, భవరోగ నివారణా దక్షులు. అట్టి పరమ పూజ్య శ్రీశ్రీశ్రీ అసంగానందగిరి స్వాములవారి పేర నిర్వహించబడనున్న ఆస్పత్రికి ప్రారంభోత్సవం చేయమని శ్రీ వ్యాసాశ్రమాధీశ్వరులు నన్ను ఆదేశించారు. ఇది నాకు పరమ సౌభాగ్యం.

మానవుడు ఏ కార్యం చేయాలన్నా ఆరోగ్యం అతి ప్రధానం. ఆరోగ్యమే మహా భాగ్యం. ఎంత సంపద వున్నా ఆరోగ్యం లేకపోతే మానవుడు పొందతగిన ఆనందం పొందలేడు, ఏ సాధనా చేయలేడు. మనం ఎంత జాగ్రత్తగా వుండినా అప్పుడప్పుడు రోగాలు సంభవిస్తూనే వుంటాయి. వాటినుండి రక్షణ పొందడానికి వైద్యాలయాలు అవసరం. తగిన వైద్యసౌకర్యం అందుబాటులో లేని ఈ పరిసర ప్రజలకు ఈ వైద్యాలయం ఎంతో తోడ్పడుగాక! మహర్షి-సద్గురు-శ్రీ మలయాళ స్వాములవారి అనుగ్రహంతో ఇక్కడి ప్రజలు ఆరోగ్యవంతులగుదురు గాక!

"డాక్టర్లకు ఒక సలహా! రోగులను సాక్షాద్భగవత్స్వరూపులుగా భావించండి! అపుడు మీకు ఎంతో ఆనందం కల్గుతుంది. రోగాలను త్వరలో దూరీకరించ గల్గుతారు."

వేలాది ప్రజలు సమావేశమైన ఈ శతజయంతీ మహోత్సవ సమయంలో చికిత్సలు చేయటానికి శ్రీ సత్యసాయి సేవాదళ సభ్యులు డాక్టర్ లక్ష్మణరావుగారు, డా॥ శ్రీహరిరావుగారు తిరుపతినుండి, డా॥ గాయత్రీదేవిగారు శ్రీకాళహస్తి నుండి, డా॥ రామచంద్రారెడ్డిగారు చిత్తూరునుండీ విచ్చేశారు. ఆస్పత్రి భవనంలో ఒకవైపు

శ్రీ మహర్షి మలయాళ స్వాములవారి ఛాయా చిత్రాన్నీ, మరొకవైపు శ్రీ భగవాన్ సత్యసాయిబాబా గారి ఛాయా చిత్రాన్నీ పుష్పమాలాలంకృతంచేసి నిలిపారు "

భక్తులు ప్రణవోచ్చారణ చేస్తుండగా, మంగళవాద్య ధ్వనులతో, శాంతి మంత్రాలతో ఈ కార్యక్రమం పరిసమాప్తమైంది.

28 తేది బ్రహ్మ ముహూర్తంలో శ్రీ సద్గురు సుప్రభాత పఠనంతో శత జయంతీ మహోత్సవ కార్యక్రమం ప్రారంభమయింది. ఉదయం 5 గంటలకు సభా వేదిక వద్ద శ్రీ వ్యాసాశ్రమ పీఠాధిపతులు పూజ్యశ్రీ విద్యానంద స్వాములవారు ప్రణవ పతాకను ఆవిష్కరించారు. ఈ సందర్భంలో ప్రణవ ప్రాశస్త్యాన్ని ఉగ్గడిస్తూ శ్రీ స్వాములవారు యిలా అన్నారు—

"ఓమిత్యేకాక్షరం బ్రహ్మధ్యేయం సర్వముముక్షుభిః"—ముముక్షువులందరూ ప్రణవాన్ని ధ్యానించాలి, ధ్యానంవల్ల జ్ఞానం, జ్ఞానంవల్ల మోక్షం పొంద వీలవుతుంది. ప్రణవం పరబ్రహ్మ స్వరూపమే.

లోకమంతా నామరూపాలతో కూడివున్నది. రూపంకంటే నామం ప్రధానం. రూపం నశించినా నామం మిగిలే వుంటుంది. వైదిక, లౌకిక నామాలన్నీ ఓంకారం నుండే ఉద్భవించాయి 'ఓంకార ప్రభవా వేదాః' — వేదాలకు ఉత్పత్తి స్థానం ఓంకారమే. ఓంకారమూ, బ్రహ్మమూ రెండూ ఒకటే. వాచ్య వాచకాలకు భేదం లేదు. ఓంకారం వాచకం, బ్రహ్మ వాచ్యం. అందువల్ల ఓంకారమే బ్రహ్మమని స్పష్ట మైంది. అందుకే ప్రణవాన్ని ధ్యానించాలి.

ప్రణవం సర్వమంగళ స్వరూపం. ఈ జయంత్యుత్సవాలు మంగళ ప్రదంగా ముగియటానికి ఇప్పుడు ప్రణవ పతాకావిష్కరణ జరిగింది "

పిమ్మట 5 గం॥ 20 నిమిషాలకు శ్రీ నారాయణ ధర్మసంఘం మాజీ అధ్య క్షులు (కేరళ) పూజ్యశ్రీ గీతానంద స్వాములవారు వేదికపై శ్రీ మలయాళ సద్గురు స్వాములవారి చిత్రపటాన్ని ఆవిష్కరిస్తూ ఇలా ప్రబోధించారు—

"శ్రీ నారాయణ గురుదేవుల భావప్రచారం వ్యాసాశ్రమంద్వారా చక్కగా జరుగుతున్నది. ఈ పటావిష్కరణవల్ల ఇపుడు శ్రీ స్వాములవారి నేత్రోన్మీలనం జరిగింది. దీనివల్ల శ్రీవారి కరుణాదృష్టి, జ్ఞానదృష్టి ప్రసారమై లోకక్షేమం కల్గు తుంది. మన అందరిలోనూ శ్రీ అసంగానందగిరి స్వాములవారు ప్రకాశిస్తూ ఉన్నారు, మనకు భాషాభేదమే గాని భావభేదం లేదు."



శ్రీవారి గురుస్థానం వర్కల (కేరళ) శివగిర్యాశ్రమాధిపతులు పూజ్యశ్రీ గీతానన్ద స్వాములవారు
పూజ్యశ్రీ శాశ్వతికానన్ద స్వాములవార్లు శతజయన్త్యుత్సవాలకు ప్రారంభోత్సవం చేయుట.



మహామణ్డలేశ్వరులు పూజ్యశ్రీ కాశికానన్ద స్వాములవారు (బొంబాయి)
అధ్యక్షోపన్యాసం చేయుట.

తదుపరి శ్రీ నారాయణ ధర్మసంఘాధ్యక్షులు పూజ్యశ్రీ శాశ్వతికానంద స్వామీజీ (కేరళ) జ్యోతి వెలిగించారు వారు తమ ప్రసంగంలో ఇలా చెప్పారు-

"స్వాములారా! భక్తులారా! ఈ శతజయంతి శుభసందర్భంలో ఇక్కడికి రాగలిగినందుకు చాలా సంతోషిస్తున్నాను. కవిగా, వేదాంతిగా, సంఘసంస్కర్తగా శ్రీ నారాయణ గురుదేవులు చాలా ప్రశస్తి వహించారు, కేరళలోనేకాక వారి ప్రబోధాలు ఇతర ప్రాంతాలలో గూడా వ్యాపించాయి. వారి శిష్యులలో ప్రముఖులైన శ్రీ శివలింగ స్వామీజీనుండి శ్రీ మలయాళ స్వాములవారు ఆధ్యాత్మిక చైతన్యం పొందారు. శ్రీ మలయాళ స్వాములవారి తత్త్వాన్ని చక్కగా అర్థంచేసుకోవాలంటే శ్రీ నారాయణ గురుదేవుల ప్రబోధాలను సమగ్రంగా ఆకళించుకోవాలి.

శ్రీ మలయాళ స్వాములవారు ఆంధ్రావని అంతటా ధర్మబీజాలు చల్లారు. వారు చూపిన బాటలో మనం పయనించాలి. పీడిత ప్రజల బాధలు తొలగించడానికి శ్రీ నారాయణ గురుదేవులు ఎంతో కృషిచేశారు. మన జీవితం సుఖవంతం కావాలంటే వారి ప్రబోధాలను పాటించాలి. శ్రీ నారాయణ గురుదేవులు, శ్రీ సిద్ధ శివలింగ స్వాములు, శ్రీ అసంగానంద స్వాములు మనలను ఆశీర్వదింతురు గాక!

ఆపై సామూహిక ధ్యానం జరిగింది. ధ్యానానంతరం గీత 11 వ అధ్యాయం పారాయణ నిర్వహింపబడింది. పారాయణానంతరం పూజ్యశ్రీ విద్యానంద స్వాములవారు తమ ప్రవచనంలో ఇలా ప్రబోధించారు—

"పరిపూర్ణ పరబ్రహ్మస్వరూపులగు పూజ్య మహాత్ములారా! ప్రియాత్మ బంధువులారా! దశమాధ్యాయంలో భగవంతుడు తన విభూతులను వివరించాడు. అవన్నీ ఒక్కచోట చూడాలని అర్జునుడు అర్థించాడు. భగవంతుడు భక్తవశంకరుడు కాబట్టి అంగీకరించి విశ్వరూపం చూపాడు. అప్రాకృతమైన భగవద్రూపాన్ని ప్రాకృత నేత్రంతో చూడలేము. దివ్యనేత్రంతోనే చూడగలము. అర్జునునికి కృష్ణుడు దివ్యదృష్టిని ప్రసాదించాడు.

విశ్వరూపాన్ని చూచేసరికి అతనికి భయం కలిగింది. ఆ రూపం ఉపసంహరించి శంఖ చక్రాదులతో కూడిన రూపం చూపమన్నాడు

విశ్వరూప దర్శనం కొఱకై దేవతలు గూడ ఎదురుచూస్తూ వుంటారు. వేదాధ్యయనం, దానం, తపస్సు మొదలైనవాటితో విశ్వరూప దర్శనం వీలుకాదు,

అనన్య భక్తిగలవారు మాత్రమే దాన్ని చూడగలరు. మోక్షసాధన సామగ్రిలో 'భక్తి గరీయసి' అని శంకరులు చెప్పారు.

కర్మ జ్ఞాన కాండలమధ్య దేహదీపన్యాయంగా ఉపాసనా కాండ బోధింపబడింది. కర్మలను భక్తితో చేయాలి. భక్తితో చేయని వారికి కష్టాలు కల్గుతాయి. దక్షుడు భగవంతుని తిరస్కరించి యజ్ఞం చేయబోతే అది యుద్ధంగా పరిణమించింది. అర్జునుడు భగవంతుని పురస్కరించుకొని యుద్ధంచేస్తే అది యజ్ఞంగా మారింది.

ప్రతివారూ ధర్మమార్గంలో ఆర్జించి సన్మార్గంలో ప్రవర్తించి నిత్య సుఖ శాంతులను పొందాలి. నిర్మల భక్తిని సంపాదించుకోవాలి.అనన్య భక్తులు మాత్రమే భగవద్దివ్యరూపాన్ని చూడగలరు."

శాంతి మంత్రాలతో గీతాపారాయణ కార్యక్రమం పరిసమాప్తమయింది. ఈ కార్యక్రమం ఐదు దినాలూ ఈలాగే ఉదయ వేళలో నిర్వహింపబడింది.

మార్చి, 28 నుండి, ఏప్రిల్, 1 వరకూ ప్రతి దినం ఉదయం 9-30 గం॥ నుండి 12 గం॥ వరకూ, మధ్యాహ్నం 3-30 గం॥ నుండి రాత్రి 7-30 గం॥ వరకూ మొత్తం పది యతిసమ్మేళనాలు జరిగాయి. ప్రముఖ పరివ్రాజకులు ఆయా సభలకు అధ్యక్షత వహించారు. ఇంచుమించు 60 మంది మహాత్ములు ధార్మికోపన్యాసాలు కావించారు. ఉపన్యాసకులు శ్రీ సద్గురు మలయాళ స్వాములవారి లోకసేవలను బహుధా కొనియాడారు.

సభాస్థలంలో నిత్యమూ క్రిక్కిరిసికూర్చున్న ముప్పైవేలమంది భక్తజనులు. సువిశాలమై, సర్వాలంకారశోభితమైన వేదికమీద సుఖాసీనులైన సుమారు 200మంది, యతిపుంగవులు—అహో! ఆదృశ్యం చూచి తీరవలసిందే! వర్ణించటానికి వీలుగాదు.

శతజయంత్యుత్సవ సంఘం ఉపాధ్యక్షులు శ్రీ పెళ్ళకూరు రామచంద్రారెడ్డి గారు తెలుగులో, సహాయ కార్యదర్శి శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారు సంస్కృతం లోనూ స్వాగత వచనాలు పలికారు. కార్యదర్శి శ్రీ బ్రహ్మచారి గోపాల్‌గారు వేదిక మీది మహామహులను సదస్యులకు పరిచయం చేశారు.

శ్రీ పెళ్ళకూరు రామచంద్రారెడ్డిగారు తమ స్వాగతోపన్యాసంలో యిలా అన్నారు—

"శ్రీ సద్గురు మహర్షి మలయాళ స్వాములవారి శతజయంతీ మహోత్సవ శుభసమయంలో పవిత్రమైన శ్రీ వ్యాసాశ్రమానికి భక్తిశ్రద్ధలతో విచ్చేసిన జిజ్ఞాస

బృందానికి, జ్ఞానామృతం పంచిపెట్టుటకు దయతో అరుదెంచిన పరమపావన పుణ్య మూర్తులగు మహా మండలేశ్వరులకు, పీఠాధిపతులకు, మఠాధిపతులకు, ఆశ్రమాధిపతులకు, తపోధనులకు, తదితర పరివ్రాజకులకు, సాధువర్యులకు ప్రణామాంజలులు!

ఈ మహత్తర శుభ సందర్భమును పురస్కరించుకొని భక్తిప్రపత్తులతో అరుదెంచిన భక్తకోటికి వందనాలు అర్పిస్తున్నాను. పూజ్యశ్రీ వ్యాసాశ్రమ వ్యాస పీఠాధీశ్వరులు శ్రీ విద్యానంద స్వాములవారికి హృదయపూర్వక వందనాలు!

ఆంధ్రదేశ చరిత్రలో ఇది ఒక చిరస్మరణీయమైన, మంగళప్రదమైన శుభ దినము. అనేక ప్రాంతాల నుండి దయతో విచ్చేసిన మహాత్ములతో యీ వేదిక కళకళలాడుతున్నది. ఈ ఐదు దినాలు ఇక్కడ ధర్మసమ్మేళనం జరుగనున్నది. ఇదంతా మన పూర్వపుణ్య ఫలం.

నూరు సంవత్సరాల క్రిందట కేరళ రాష్ట్రంలో అవతరించి నియమనిష్ఠాగరిష్ఠమైన తపశ్చర్యలతో, పవిత్ర జీవన విధానంతో, సారవంతమైన ప్రబోధాలతో ఆంధ్రావనిని ఆధ్యాత్మిక తేజోవిరాజితం కావించిన మహనీయమూర్తి శ్రీశ్రీశ్రీ మహర్షి-సద్గురు-మలయాళ-స్వాములవారి శతజయంతి మహోత్సవ శుభసమయ మిది.

ఆంధ్రదేశ ప్రజలు అనేక సంశయాలతో జీవనయాత్ర సాగిస్తున్న సమయంలో ఆ మహనీయులు శుష్కవేదాంత తమోభాస్కరం అందించారు. అనేక వేదాంత గ్రంథాలను ప్రచురించి మనకు విజ్ఞానం కలుగజేశారు. నాస్తికులైన అనేకులను ఆస్తికులుగా మార్చారు. ముఖ్యంగా స్త్రీలకు జ్ఞానోపదేశం గావించారు. కుల మతాలతో నిమిత్తం లేకుండ సంస్కృతం చెప్పించి ఎంతోమందిని పండితులను గావించారు. అనేకులకు భక్తిప్రపత్తులను ప్రసాదించారు. పెక్కుమంది సాధువులకు కీర్తి - శక్తులను కలుగజేసిన మహనీయులు శ్రీ మహర్షి మలయాళస్వాములవారు

శ్రీవారికి మనదేశం ఎంతో ఋణపడి వున్నదని మనవిచేస్తున్నాను. శ్రీవారి బాధ్యతలను స్వీకరించిన ప్రస్తుత పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ విద్యానందస్వాములవారి బోధలు విని ఆచరించవలసిన బాధ్యత మనమీద వున్నది.

ఈ తరుణంలో మా ఆహ్వానం మన్నించి ఎంతో దయతో, ఆదరంతో ఇచ్చటకు అరుదెంచిన తపోనిధులగు మహామండలేశ్వరులకు, స్వాములకు హృదయ పూర్వకస్వాగత సుమాంజలులను మరొకసారి సమర్పిస్తున్నాను.

ఈశ్వర కృపచేతను, మహర్షుల దివ్యానుగ్రహముచేతను, మహనీయుల

శుభాశీర్వాదం చేతను, శ్రీ బ్రహ్మచారి గోపాల్‌గారి కార్యదీక్షచేతను, ఉత్సవ సంఘసభ్యుల అహర్నిశకృషి చేతను, వందలాది స్వచ్ఛంద సేవకుల నిర్విరామ కృషివల్లనూ ఈ శతజయంత్యుత్సవ కార్యక్రమం విజయవంతంగా నిర్వహింపబడు గాక! సభలో సమావిష్టులయిన వక్తలకు, శ్రోతలకూ—అందరికీ మా హృదయ పూర్వక స్వాగతం!! సుస్వాగతం!!!"

ఆ పిదప శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారి సంస్కృత స్వాగత వచనాల అనంతరం శతజయన్త్యుత్సవ సంఘ కార్యదర్శి బ్రహ్మచారి గోపాల్‌గారు ఉత్సవాల కేతెంచి సభావేదిక నలంకరించిన మహాత్ముల నీక్రింది విధంగా పరిచయం చేశారు—

పవిత్రాత్మస్వరూపులైన పూజ్యమహాత్ములారా! సభికులారా! నేడు మన జీవితంలో మరువరాని మహోన్నత దినం. ఒకే వేదికపై ఇంతమంది మహానుభావులు మహా విద్వాంసులగు మహా మణ్డలేశ్వరులు (దక్షిణ భారత దేశంలో) సమావేశ మవడం మన మహాభాగ్యం నిన్న ఆస్పత్రి ప్రారంభోత్సవంతో శతజయన్త్యుత్స వాలు ప్రారంభమయినాయి. ఆసుపత్రిని ప్రారంభించిన వారు పూజ్యశ్రీ చిదానంద స్వాములవారు ఉత్తరప్రదేశ్‌లోని హిమాలయ సానువులందు గల ఋషికేశ్‌లో పూజ్యశ్రీ శివానందస్వాములవారిచే స్థాపింపబడిన శివానందాశ్రమాధ్యక్షులు, మఱియు అంతర్జాతీయ సంస్థయగు "దివ్య జీవన సంఘము"నకు అధ్యక్షులు పరిపూర్ణప్రేమ స్వరూపులు సదా ఆనందమూర్తి. మన ఆహ్వానం మన్నించి వీరు విదేశ కార్య క్రమాలను గూడ ప్రక్కకు నెట్టి ఈ ఉత్సవానికి విచ్చేశారు.

ఉదయం సభావేదికపైన శ్రీవారి చిత్రపటావిష్కరణ గావించినవారు పూజ్యశ్రీ గీతానంద స్వాములవారు. వీరు శ్రీవారి పరమగురువులగు శ్రీ నారాయణ గురువుల వారిచే స్థాపింపబడిన కేరళలోని వర్కలలోనున్న శివగిరి మఠానికి మొన్నటివరకు అధ్యక్షులు, అట్లే శ్రీ నారాయణ ధర్మసంఘ ట్రస్టునకున్ను మొన్నటివరకు అధ్యక్షులు

ఆ పిదప జ్యోతిని వెలిగించిన పూజ్యశ్రీ శాశ్వతికానంద స్వాములవారు కేరళలోని వర్కలలో నున్న పూజ్యశ్రీ నారాయణగురుచే స్థాపింపబడిన శ్రీనారాయణ గురు ధర్మ సంఘ ట్రస్టునకు ప్రస్తుత అధ్యక్షులు.

నేటి ప్రథమ యతి సమ్మేళనమునకు ఇపుడధ్యక్షత వహించు పూజ్యశ్రీ రంగనాథానంద స్వాములవారు అంతర్జాతీయ సంస్థయగు శ్రీ రామకృష్ణమఠం యొక్క హైద్రాబాద్ మఠానికి అధ్యక్షులు. ప్రపంచమంతా ఆహ్వానితులై సదా



ఉపాధ్యక్షులు శ్రీ పెళ్ళకూరు రామచంద్రారెడ్డిగారు స్వాగతం చెప్పుట



కార్యదర్శి బ్రహ్మచారి గోపాల్‌గారు మహాత్ములను పరిచయం చేయుట

తమ ప్రవచనాలను అంతటా ప్రసాదిస్తూ వుంటారు. మన ఈ కార్యక్రమంలో పాల్గొని వెంటనే తమ ప్రవచనాల్తొసంగుటకై ఎల్లుండి విదేశాలకు పోతున్నారు.

ఈ యతి సమ్మేళనమునకు ప్రారంభోత్సవం చేయుచున్న వీరు పూజ్యశ్రీ ఆచార్య మహా మండలేశ్వరులు శ్రీశ్రీశ్రీ విద్యానన్దగిరి స్వాములవారు. వీరు ఋషికేశములో అతి ప్రాచీనమైనదగు కైలాసాశ్రమాధిపతులు, కైలాసపీఠాధీశ్వరులు. అద్వైతవేదాంతమున మహా పణ్డితులు. వీరు నేటి మధ్యాహ్నం జరుగు రెండవ యతి సమ్మేళనానికి అధ్యక్షత వహింతురు.

వీరి ప్రక్కన సమావిష్టులైన వీరు పూజ్యశ్రీ మహా మణ్డలేశ్వర శ్రీశ్రీశ్రీ బ్రహ్మానంద స్వాములవారు. వీరు హరిద్వారమునగల సురత్‌గిరి ఆశ్రమము మఱియు బొంబాయిలోగల సన్న్యాసాశ్రమాధిపతులు. మహామణ్డలేశ్వరులు, మహా విద్వాంసులు పూజ్యశ్రీ మహేశ్వరానంద స్వాములవారి స్థానంలో వచ్చిన పూజ్యులు. అతి ప్రాచీనమగు హరిద్వార్ కంఖల్‌లోని సురత్‌గిరి పీఠాధీశ్వరులు. వీరు 29 తేది జరుగు మూడవ యతి సమ్మేళనమునకు అధ్యక్షత వహింతురు.

30 తేది జరుగు ఆరవ యతి సమ్మేళనానికి అధ్యక్షత వహించనున్న వీరు మహా మణ్డలేశ్వర పూజ్యశ్రీ శ్రీశ్రీ బాలకృష్ణయతి స్వాములవారు. వీరు కాశీలో నున్న సుప్రసిద్ధ అతి ప్రాచీన మఠమగు హధియారాం మఠాధిపతులు. సాక్షాత్ శివ స్వరూపులు. వీరి మఠములోనే మన ఆశ్రమ బ్రహ్మచారులు విద్య నభ్యసించు చున్నారు.

అయిదవ యతి సమ్మేళనానికి అధ్యక్షత వహించనున్న వీరు పూజ్యశ్రీ మహా మణ్డలేశ్వర శ్రీశ్రీశ్రీ కాశికానంద స్వాములవారు. వీరు బొంబాయిలోని అనన్దవనాశ్రమాధిపతులు. అత్యంత విద్వాంసులు. సరస్వతీ స్వరూపులు. వేదాంతంలో పాణ్డిత్యమున వీరికి సాటి ఇపుడెవరూ లేరని ప్రతీతి.

వీరి సరసనగల వీరు పూజ్యశ్రీ మహామణ్డలేశ్వరులు శ్రీశ్రీశ్రీ ప్రకాశానంద స్వాములవారు. వీరు హరిద్వార్‌లోని కంఖల్‌లోగల జగద్గురు పీఠాధీశ్వరులు. విశ్వహిందూ పరిషత్తు ద్వారా హిందూధర్మ రక్షణకు అవిరళకృషి చేయు చున్నారు.

వీరు కలకత్తాలోను, పవిత్రమైన కాశీ పట్టణమునందుగల భోళాగిరి ఆశ్రమాధిపతులు పూజ్యశ్రీ మహామణ్డలేశ్వర శ్రీశ్రీశ్రీ అభినవ సచ్చిదానంద

స్వాములవారు. పండితోత్తములు వీరి ఆశ్రమ సంస్కృత కళాశాలల అనేకమంది మహాత్ములు పండితులయిరి. వీరు హరిద్వారమందలి భీమఘోడాలోగల మోహనానన్దాశ్రమాధిపతులు పూజ్యశ్రీ మహామణ్డలేశ్వర శ్రీశ్రీశ్రీ గణేశానన్ద స్వాములవారు తమ భాగవత ప్రవచన ద్వారా ఈ ప్రాంతీయులకు సుపరిచితులే.

వీరు మనందరికి చిరపరిచితులు పూజ్యశ్రీ శ్రీ శ్రీనందానన్దస్వాములవారు. వీరు ఊటీ, చెంగల్పట్టు, రాజమండ్రి పట్టణాలలోని శ్రీరామకృష్ణ మఠాలకు అధ్యక్షులుగా వుండినవారు. మహా ప్రేమస్వరూపులు. నేటి ప్రథమ యతిసమ్మేళనలో వీరి ప్రవచనము గలదు.

వీరు మద్రాసు నగరంలో అతిప్రాచీనము బహు ప్రశస్తమునగు చూళైలోని వీరసుబ్బయ్యస్వామి మఠాధిపతులు పూజ్యశ్రీ శ్రీ శ్రీ విద్యానన్దస్వాములవారు. వీరున్ను కాశీలో వేదాన్తాచార్యచదివినవారు. తమిళదేశంలో నేడుగల అద్వైతవేదాన్త పణ్డితులైన మఠాధిపతులలో ఒకరు. 5వ యతిసమ్మేళనంలో వీరి ప్రవచనం గలదు.

వీరు మద్రాసు రాష్ట్రమందలి పవిత్ర మీనాక్షీ దేవాలయముగల మధురలోని శ్రీ బ్రహ్మానంద మఠాధిపతులు పూజ్యశ్రీ శ్రీ శ్రీ యోగానందస్వాములవారు వేదాంతాచార్య చదివినవారు. మంచి పండితులు. మూడవ యతిసమ్మేళనంలో వీరి ప్రవచన గలదు.

నేటి ప్రథమ యతిసమ్మేళనములో ప్రవక్తయగు వీరు పూజ్యశ్రీ శ్రీ శ్రీ శివకుమారస్వాములవారు. వీరు బీదరు పట్టణమందలి సిద్ధారూఢ మఠాధిపతులు. ఇటు ఆంగ్లమున, అటు సంస్కృతమున మంచి పండితులు.

నేటి యతిసమ్మేళనములో ప్రవక్తయగు వీరు పూజ్యశ్రీ శ్రీ శ్రీ సత్యానంద మహర్షులవారు. వీరు ఇనమడుగు సత్యానందాశ్రమ స్థాపకులు. ఆంధ్రులకు చిరపరిచితులు.

రెండవయతి సమ్మేళనములో ప్రవక్తయగు వీరు పూజ్యశ్రీ శ్రీశ్రీ భూమానందస్వాములవారు కళ్యాణదుర్గం బ్రహ్మవిద్యాశ్రమాధిపతులు ఉపనిషత్తులపై వీరి ప్రవచన అనర్గళమని మనందరికి తెలిసినదే.

ఎనిమిదవ యతిసమ్మేళమునకు అధ్యక్షత వహించనున్న వీరు పూజ్యశ్రీ శారదా ప్రియానందవారు. వీరు చిన్మయమిషన్ స్థాపకులు పూజ్యశ్రీ చిన్మయానందస్వాములవారి ముఖ్య శిష్యులు, కడప జిల్లాలో స్థాపించిన చిన్మయారణ్యాధ్యక్షులు.

ఏడవ యతి సమ్మేళనాధ్యక్షత వహించనున్న పూజ్యశ్రీ శ్రీ శ్రీ విద్యానంద స్వాములవారు, మన మూల స్థానమగు, శ్రీ వ్యాసాశ్రమాధిపతులు, శ్రీ వ్యాస పీఠాధిపతులు. అద్వైత వేదాంతాన్ని అతి సరళంగా హృద్యంగా తేట తెనుగున అందించగలవారు.

తొమ్మిదవ యతి సమ్మేళనమునకు అధ్యక్షత వహించనున్న వీరు పూజ్యశ్రీ శ్రీ శ్రీ రామకృష్ణానందస్వాములవారు, కడప జిల్లా గండిలోని శ్రీ భూమానందాశ్రమాధిపతులు,గీతావాణి సంపాదకులు. అఖిలాంధ్ర సాధుపరిషత్ భూతపూర్వాధ్యక్షులు ప్రస్తుతం సాధు పరిషత్తుకు గౌరవాధ్యక్షులు. వీరి భాగవత ప్రవచనం వినదగినది, విశిష్టమైనది.

పదవ సమ్మేళనమునకు అధ్యక్షత వహించనున్న వీరు పూజ్యశ్రీ శ్రీశ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు. వీరు శ్రీ కాళహస్తిలోని శ్రీ శుక బ్రహ్మాశ్రమ స్థాపకులు, అధ్యక్షులున్ను. వీరి గీతోపన్యాసాలు, గీతామకరందం తెనుగుదేశంలో విశేషాదరణ పొందినది.

పదవ యతి సమ్మేళనంలో ప్రధానోపన్యాసకులు పూజ్యశ్రీ శ్రీశ్రీ దయానంద స్వాములవారు ఋషీకేశ్‌లోని పురాణ ఝాడీలో దయానందాశ్రమ స్థాపకులు. చిన్మయ మిషన్‌లో ప్రముఖ వ్యక్తిగా, వక్తగా మనకందరికి పరిచితులు.

నాల్గవ యతిసమ్మేళనంలోని వక్త పూజ్యశ్రీ శ్రీశ్రీ మాతా త్యాగీశానందపురి వారు. వీరు పూజ్యశ్రీ అనుభవానందస్వాములవారి ప్రధాన శిష్యులు. వారి అనంతరం బాపట్ల భీమునిపట్నం ఆశ్రమాలన్నింటికి అధ్యక్షురాలు. అనర్గళ ప్రవక్త.

ఆరవ, ఎనిమిదవ యతి సమ్మేళనంలో ప్రధాన ప్రవక్త పూజ్యశ్రీ శ్రీశ్రీ యోగినీ మాతగారు చింతలపూడి శ్రీ బోధానందాశ్రమంలోని శ్రీ బోధానంద స్వాములవారి శిష్యురాలు. భాగవతంలో వీరి గంభీర పురాణ ప్రవచనం అందరికి విదితమే.

వీరు పూజ్యశ్రీ శ్రీశ్రీ శాశ్వతానందస్వాములవారు. వీరు న్యాయాచార్యులు, కాశీలోని దక్షిణామూర్తి మఠంలోని సంస్కృత కళాశాలలో చాల సంవత్సరాలు మహాత్ములకు న్యాయశాస్త్ర బోధకులుగా పనిచేసిన పండితోత్తములు.

వీరు పూజ్యశ్రీ శ్రీశ్రీ మాధవచైతన్యస్వాములవారు. వీరు కాశీలోని తిల భాండేశ్వర పార్కువద్ద ముకుళేశ్వర మందిరంలో స్వంత ఆశ్రమం నిర్మించి

యుంటున్నారు. శ్రీ వ్యాసాశ్రమ పాత విద్యార్థులు మీమాంస న్యాయ వేదాంతా చార్యులు. మీమాంసలో కాశీలో ప్రామాణికులు.

వీరు పూజ్యశ్రీ పూర్ణానందస్వాముల వారు, తమిళనాడులో శ్రీ రామకృష్ణ తపోవన స్థాపకులు పూజ్యశ్రీ చిద్భవానందస్వాములవారి శిష్యులు. నెల్లూరులో శ్రీ రామకృష్ణాశ్రమ స్థాపకులు.

వీరు పూజ్యశ్రీ కారుణ్యానందస్వాములవారు. గౌతమీ జీవకారుణ్యసంఘ మును రాజమండ్రిలో స్థాపించి దీనజన సేవ విరివిగాచేసినవారు శ్రీ సద్గురు స్వాముల వారి శిష్యులు.

వీరు పూజ్యశ్రీ సర్వేశ్వరానంద స్వాములవారు. అఖిలాన్ధ్ర సాధుపరిషత్ ప్రస్తుత అధ్యక్షులు.

వీరు సిద్ధేశ్వరానంద స్వాములవారు. చిత్తూరు సమీపం వెంగనపల్లి శ్రీ శంకరానందాశ్రమాధిపతులు పూజ్యశ్రీ శంకరానందస్వాములవారి శిష్యులు.

వీరు పూజ్యశ్రీ నిర్విశేష శివానందస్వాములవారు ఖమ్మం బ్రహ్మవిద్యాశ్రమ స్థాపకులు. పూజ్యశ్రీ సద్గురుస్వాములవారి శిష్యులు, బహుగ్రంథ రచయితలు.

వీరు పూజ్యశ్రీ నిర్విషయానందస్వాములవారు. శ్రీ సద్గురు స్వాములవారి వద్దయుండి శిక్షణపొందిన వారు. ప్రసన్న హృదయులు. మంచి రచయిత కవి పెనుమత్స ఆశ్రమాధిపతులు.

వీరు పూజ్యశ్రీ దయానన్దస్వాములవారు. గాగిళ్ళపురం ధ్యాననిష్ఠాశ్రమ స్థాపకులు, అధ్యక్షులు. శ్రీ సద్గురు స్వాములవారి శిష్యులు. పవిత్రచరితులు.

వీరు పూజ్యశ్రీ వేణ్వానందగిరి స్వాములవారు. కర్నాటక అగరంలోని శ్రీనివాసాశ్రమాధ్యక్షులు. మంచి ప్రచారకులు శ్రీ వ్యాసాశ్రమంలో చదివినవారు.

పూజ్యశ్రీ దేవానందస్వాములవారు. ఋషీకేశ్‌లోని శ్రీ శివానందాశ్రమవాసులు శ్రీ సద్గురుస్వాములవారివద్ద కొంతకాలముండినవారు. శ్రీశ్రీ శివానందస్వాములవారి శిష్యులు శ్రీవారి ఆంగ్ల గ్రంథాలను పెక్కింటిని తెనిగించినవారు.

పూజ్యశ్రీ విరజానన్ద స్వాములవారు శ్రీ సద్గురు స్వాములవారి శిష్యులు. శ్రీ వ్యాసాశ్రమంలో చదివిన వారు. పండితులు.

పూజ్యశ్రీ ప్రసన్నాత్మానంద స్వాములవారు పూజ్యశ్రీ రామకృష్ణానంద స్వాములవారి శిష్యులు. మంచి వక్త.



మహామణ్డలేశ్వరులు పూజ్యశ్రీ బ్రహ్మానందస్వాములవారు శతజయన్తి సంచిక
నావిష్కరించుట



పూజ్యశ్రీ రంగనాథానందస్వాములవారు అధ్యక్షోపన్యాసం చేయుట

పూజ్యశ్రీ ప్రబోధానందస్వాములవారు ఏలూరు పూజ్యశ్రీ బ్రహ్మానంద స్వాములవారి శిష్యులు, మెండూరు ఆశ్రమ స్థాపకులు

పూజ్యశ్రీ బ్రహ్మానందస్వాములవారు, కేశవదాసుపాళెం ఆశ్రమ స్థాపకులు అఖిలాంధ్రసాధుపరిషదుపాధ్యక్షులు.

పూజ్యశ్రీ అశేషానంద స్వాములవారు వెలిదునేడు శ్రీ గోపాలకృష్ణాశ్రమ స్థాపకులు. మంచి వక్త.

పూజ్యశ్రీ రామకృష్ణానందస్వాములవారు, కర్నాటకలోని ఆనందాశ్రమ స్థాపకులు.

పూజ్యశ్రీ చిదానంద స్వాములవారు శ్రీ వ్యాసాశ్రమానికి కొంతకాలం కార్యదర్శిగా నుండినవారు, చిత్తూరు శ్రీ సద్గురు సేవాశ్రమ స్థాపకులు.

పూజ్యశ్రీ నిర్మలానంద స్వాములవారు, శ్రీసద్గురు స్వాములవారి శిష్యులు, తెనాలి శ్రీ సద్గురు గీతా మందిర స్థాపకులు.

పూజ్యశ్రీ ప్రణవానంద స్వాములవారు. కారంచేడు హరేరామ జపయజ్ఞ సమాజాధ్యక్షులు.

పూజ్యశ్రీ రామకృష్ణానంద స్వాములవారు చిత్తూరు సమీపం ఎల్లంపల్లి శ్రీరామకృష్ణాశ్రమ స్థాపకులు" అంటూ సభికులకు అందరినీ పరిచయం చేసి వీరందరినీ పుష్పమాలాలంకృతులను చేశారు.

28-3-85వ తేదీ ఉదయం 9-30 గంటలకు ప్రారంభమైన ప్రథమ యతి సమ్మేళనానికి హైదరాబాద్ శ్రీ రామకృష్ణ మఠం అధ్యక్షులు పూజ్యశ్రీ రంగనాథానంధ స్వామీజీ అధ్యక్షత వహించారు. కార్యక్రమం "ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తృభ్యో। వంశ ఋషిభ్యో మహద్భ్యో నమో గురుభ్యః" అంటూ గురు స్తోత్రంతో ప్రారంభమైనది.

పూజశ్రీ రంగనాథానందస్వాములవారు తమ అధ్యక్షోపన్యాసంలో యిలా అన్నారు :-

ఒక పవిత్రమైన మహాత్ముడు మహర్షి మలయాళస్వాములవారి శతజయంత్యుత్సవాలను జరుపుకొనుటకు మనం యిప్పుడు యిచ్చట చేరినాము. "ప్రశాంతవః కారుణికాః సుహృదః సర్వ దేహినాం। అజాత శత్రవః శాంతాః .," అని భాగవత

ములో అన్నట్లు సాధువులకే భూషణులైన సాధువులు కొందరుంటారు. ఈ వర్ణన ఈనాడు మనం శతజయంతి జరిపే శ్రీ మలయాళస్వాములవారికి సరిపోతుంది. వారు గొప్ప బుద్ధిగలవారేగాక విశాలభావంగలవారు గూడ. కావుననే వారికి కుల మతాది భేద బుద్ధిలేదు. సంసారబంధాన్ని వదిలించుకోవడానికి మనం యిట్టి సాధు సత్పురుషులను ఆశ్రయించాలి, సాధువుల వైపు పోతే, వారిని ఆశ్రయిస్తే సంసార బంధాలను వదిలించుకోవచ్చును.

శ్రీ మలయాళస్వాములవారు శ్రీ కృష్ణుడు చెప్పిన భగవద్గీతను గొప్పగా ప్రచారం చేశారు. నేడు దేశానికి ఆచరణాత్మక బోధచేసే గ్రంథము గీతయే. శ్రీ వివేకానందస్వామి గూడ దీనిని అంగీకరించినారు. శ్రీ ఆదిశంకరులు మహా భారతంలో ఒక భాగమైన గీతను వేరుగా వెలికి తెచ్చి ప్రచారం చేశారు. ఆ గీతనే శ్రీ మలయాళస్వాములవారు ముఖ్యంగా తీసుకొని దేశంలో బహుళ ప్రచారము చేశారు.

మనమింతవరకు గీతను పఠించినామేగాని, ఆచరణలో పెట్టలేదు; నేటి, అధునికయుగంలో యీ గీత అవసరం యెంతేని వుంది. "యోగః కర్మసు కౌశలం" అంటూ కర్మ కౌశలమే యోగమని గీతలో చెప్పబడింది. కర్మ కర్మనిష్ఠల సంబంధాన్ని గీత చాలా చక్కగా వివరించింది. కౌశలంతో కర్మచేస్తే అది దేశానికి యెంతో మేలు అని నిరూపించింది. శ్రీ మలయాళస్వాములవారి గీతా ప్రవచనం, గీతాభాష్యం దేశమంతా వ్యాపించాలి. దాన్ని ఆధారంగావారు విశ్వమానవ ఏకతను స్థాపించినారు భేదంలేని సమాజాన్ని స్థాపించారు, ప్రచారం చేశారు ఈనాడు కర్మ కౌశలం భారతదేశంలో క్షీణించింది.దాన్ని పెంపొందించడానికి యిప్పుడు అందరూ కృషి చేశాలి "

ఆ పిదప శ్రీ మలయాళస్వాములస్వాములవారు రచించిన "శుష్కవేదాంతమో భాస్కరం" నకు "స్వబోధ సుధాకరం" నకు "True Knowledge" "Self Knowledge" అనే పేర్లతో శ్రీ R, M. చల్లాగారు చేసిన అందమైన ఆంగ్లానువాద గ్రంథాలను శ్రీ రంగనాథానందస్వాములవారు ఆవిష్కరించినారు.

ఆ పిదప ఋషీకేశ్ - కైలాసాశ్రమాధిపతులు కైలాసాపీఠాధీశ్వరులు మహామండలేశ్వరులు పూజ్య పాదశ్రీ విద్యానంరస్వాములవారుతమ ప్రవచనాన్ని యిలా కొనసాగించినారు. "ధర్మ ప్రధాన భారతదేశంలో ఆచార్యుల జన్మభూమియైన యీ దక్షిణా పథానికి మొదట నా నమస్కారాలు. నాటినుండి నేటివరకు

ఋా భూమి అనేక ఆచార్య పురుషులకు జన్మ నిచ్చింది శ్రీ శంకరాచార్యుల మొదలు నేటి శ్రీ మలయాళస్వాములవారివరకు గల అనేక ప్రచారకులకు యీ దక్షిణదేశం పుట్టినిల్లు. ఈ దేశంలో పుట్టిన ఆచార్యులకు నమస్కారాలు.

వైదిక ధర్మం ప్రవృత్తి లక్షణం నివృత్తి లక్షణంఅనిరెండు రకాలు. అందు నివృత్తి ధర్మం సనకాదుల కుపదేశింపబడినది. నివృత్తి ధర్మపరులైన వారికి ఆశ్రమాలులేవు చరిత్ర చూడండి సనకాదులకు ఆశ్రమాలు లేవు శుకునికి లేదు. దత్తాత్రేయులకు లేదు. కాని వసిష్ఠాది ఋషులందరికి ఆశ్రమాలున్నవి." అయితే వారు ప్రవృత్తి ధర్మపరులు.

జగద్గురు శంకరాచార్యులకు పూర్వం నివృత్తి ధర్మపరులకు మఠాలు, ఆశ్రమాలున్నట్లు లేదు. శంకర జన్మ సమయానికి వైదిక ధర్మానికి విరుద్ధంగా ప్రచారం బలంగా వుంది. దాని ప్రచారకులను బౌద్ధమతం అనేక సంఘాలు పెట్టి, ఆరామాలు (మఠాలు) పెట్టి, అందు వారి ప్రచారకులకు శిక్షణనిచ్చి దేశంలో ప్రచారానికి పంపుతూ వుండినది. ఇట్లు బౌద్ధమత ప్రచారం ప్రబలి వైదిక ధర్మం తగ్గిపోజొచ్చింది. ఆ సమయంలో శంకరులు జన్మించినారు. దేశపరిస్థితిని అవగాహన చేసుకొని బౌద్ధమతానికి అడ్డ కట్టవేసి దేశంలో వైదికధర్మ రక్షణకు కంకణం కట్టారు. వైదిక ధర్మప్రచారానికై శిక్షణా కేంద్రాలుగా మఠాలను స్థాపించినారు. దేశం నలుమూలల నాలుగు ప్రధాన వైదిక ధర్మప్రచార కేంద్రాలుగా నాలుగు మఠాలను స్థాపించినారు. అందు ధర్మప్రచారకులకు శిక్షణ నిచ్చి దేశంలో ధర్మరక్షణకు వారిని పంపినారు. ఇట్లు శంకరాచార్యుల కాలం నుండి వైదికధర్మ ప్రచారకుల శిక్షణాకేంద్రాలుగా మఠాలు, ఆశ్రమాలు దేశంలో స్థాపింపబడ్డాయి. ప్రారంభింపబడ్డాయి.

కానీ కొంత కాలానికి మఠాలల్లో ధర్మ ప్రచారకులకు ప్రశిక్షణ తగ్గిపోయి, ప్రచారకులను తయారు చేయడంమాని, కేవలం మఠ పరిపాలనకే సీమితమయ్యాయి. ధర్మ ప్రచారం దాదాపు నిలిచిపోయింది మఠాల నుండి. అట్టి స్థితిలో దక్షిణ భారత దేశంలో క్రైస్తవులు ప్రవేశించి వారి మతాన్ని విరివిగా ప్రచారం చేయ మొదలు పెట్టినారు. క్రైస్తవమతం ప్రారంభమై విరివిగా పెరుగజొచ్చింది. మన వైదిక ధర్మానికి లోపం ప్రారంభమైంది. ఈ సమయంలో దక్షిణ దేశంలో వైదికధర్మ రక్షణ కొఱకై అనేక మంది ఆచార్యులు పుట్టి మరల వైదిక ధర్మరక్షణకు పూనుకొన్నారు. అట్టి వారిలో మహర్షి సద్గురు మలయాళస్వాములవారు అనే

శ్రీ అసంగానంద స్వాములవారొకరు. శ్రీ స్వాములవారు ఈ ఆశ్రమాన్ని స్థాపించి ఇచట మంచి శిష్యులను ప్రచారకులను తయారు చేశారు. ఆన్ధ్ర దేశమంతటా ఆశ్రమాలు స్థాపించి ఈ తమవద్ద శిక్షణ పొందిన శిష్యులను పంపి ధర్మ ప్రచారం చేశారు ధర్మరక్షణ చేశారు. ధర్మోద్ధరణకే నిరంతరం గ్రామ గ్రామాల్లో ప్రచారం చేశారు. పరిశ్రమ చేశారు. దానికి సాక్ష్యం ఈ సభలో నున్న కొన్నివేలమంది మీరే. మఠాలు, ఆశ్రమాలు విశ్రాన్తిగా కూర్చోడానికి గాదు. అవి ఆరామ కేంద్రాలు గాదు. మరేమంటే ధర్మప్రచారకులకు మంచి ప్రశిక్షణా కేంద్రాలు. నిరంతరధర్మ రక్షణకే మఠాల స్థాపన అని మరువవద్దు.

భగవంతుడు ధర్మరక్షణకై రామాది అవతారాలెత్తి అధర్మాన్ని అణచి ధర్మ రక్షణ చేశాడు. అందుకై అస్త్రాలు, శస్త్రాలు చేబట్టి యుద్ధం చేశాడు శంకరాచార్యులున్ను ధర్మరక్షణకై అవతరించినారు. కానీ ఆయన తన్నిమిత్తం కత్తి - కఠారు చేపట్టలేదు. యుద్ధాలు చేయలేదు. మరేమంటే విచిత్రమైన శస్త్రాలు ఆయన ఎత్తి ధర్మ రక్షణ చేశాడు. ఆ అస్త్రాలే ప్రస్థానత్రయ భాష్యాలు. సూత్రభాష్యం, గీతా భాష్యం, ఉపనిషద్భాష్యం వగైరా. ఈ శాస్త్రాలనే అస్త్రాలుంటే చాలదు. వానిని బాగా ఉపయోగించే విధానం తెలియాలి. అందుకే మఠాల స్థాపన. ఈ మఠాలలో ధర్మోద్ధరణకై వాడే అస్త్రాలగు ఈ భాష్యాది శాస్త్రాలను వాటిలోని రహస్యాలను విపరీతభావన, అసంభావనాది దోషాలు లేకుండా నిజమైన శాస్త్రజ్ఞానాన్ని బోధించి శ్రవణ మనన నిధిధ్యాసనలద్వారా మనలోని అజ్ఞాన్ని కామక్రోధాది అంతశ్శత్రువుల నాశనంచేసి సమగ్రంగా శాస్త్రాన్ని తెలుసుకొని జ్ఞానులమై ధర్మ ప్రచారం చేయాలి. అపుడు విధర్మం తనకు తానే పోతుంది. మన వైదిక ధర్మం ఉద్ధరింపబడుతుంది ఇట్లు ధర్మరక్షణ సంప్రదాయ పరంపర, శాస్త్రజ్ఞాన ప్రశిక్షణ మఠాలల్లోనే జరుగాలి గావున మఠాధిపతులకు నా ప్రార్థన ఏమంటే తమ మఠాలల్లో శాస్త్రాలను బాగా నేర్పి శంకరాచార్య పరంపరకు బాగా ప్రశిక్షణ నిచ్చి దాని బలంతో మనలోని శత్రువుల జయించి ఆ పైన ధర్మప్రచారం ద్వారా బాహ్య విధర్మ శత్రువుల జయించాలి.

దక్షిణ భారత దేశంలో విధర్మ ప్రచారం విరివిగా సాగుతున్న కాలంలో శ్రీ మలయాళ స్వాములవారు వచ్చి గ్రామగ్రామాల్లో ధర్మప్రచారంచేసి అనేక శిష్య ప్రశిష్యులను ఈ మఠం ద్వారా తయారుచేసి వారికి శాస్త్రపరిజ్ఞానం కలుగజేసి వారి ద్వారా ధర్మప్రచారం చేశారు వారెంతో అభినందనీయులు. దక్షిణ దేశంలో క్రైస్తవుల ద్వారా వైదిక ధర్మానికి చాలా అవరుద్ధత గల్గింది. ఆ సమయంలో



ఆచార్య మహామణ్డలేశ్వరులు పూజ్యశ్రీ విద్యానన్దస్వాములవారు (ఋషీకేశ్ - కైలాస పీఠాధీశ్వరులు) అధ్యక్షోపన్యాసం చేయుట.



దక్షిణ భారతదేశ మఠాధిపతులు పూజ్యశ్రీ విద్యానందస్వాములవారు (మద్రాసు),
పూజ్యశ్రీ యోగానందస్వాములవారు (మధురై).

శ్రీ మలయాళ స్వాములవారుద్భవించి క్షత్రియ వైశ్యాదులందరికి గూడా సన్న్యాస సార్హత వున్నదంటూ ప్రచారంచేసి. వారికా యధికారమిచ్చి, వారందరికి సన్న్యాస మిచ్చి ధర్మరక్షణ చేశారు. వారి ద్వారా ధర్మప్రచారం విరివిగా చేశారు.

హిందువులు తత్రాపి బ్రహ్మచారులు తదితర గృహస్థులు శిఖాయజ్ఞోపవీతాలను ధరించి మన ధర్మ చిహ్నాలను నిలపాలి. వైదిక షోడశ సంస్కారాలను అనగా గర్భాదానం మొదలు అంత్యేష్టి వరకు గల 16 సంస్కారాలను అందరికు తెలుపాలి. వానిని ప్రవర్తింపజేయాలి. వానిని గురించిన సమగ్రజ్ఞానాన్ని అందరిలో కలిగించాలి అందరిచేత వానిని అమలు పరిపించాలి. తద్వారా మన వైదిక ధర్మాన్ని ప్రతిష్ఠితం చేయాలి. మఠాధిపతులందరూ నడుం బిగించి శ్రీ మలయాళ స్వాములవారనే శ్రీ అసంగానందగిరి స్వామివారి వలెనే వైదికధర్మ ప్రచారకులను తమతమ మఠాలల్లో ప్రశిక్షణనిచ్చి దేశమంతా వారిని గ్రామగ్రామాలకు పంపి వారిద్వారా ధర్మ ప్రచారం చేయాలి. అందరిచేత మన ధర్మ చిహ్నాలగు శిఖాయజ్ఞోపవీతాలను ధరించేట్లు చేయాలి. 16 సంస్కారాలను గురించి వారికి బాగా తెలిపి వాటిని వారిచే అమలు చేయించాలి. భాష్యాది శాస్త్రాలను సరైన పద్ధతిలో మఠాలలో నేర్పి మంచి శాస్త్రజ్ఞులను తయారు చేయాలి, వారిని శ్రవణ మనన నిధిధ్యాసితులనుగా చేసి తద్ధారా జ్ఞానుల చేసి ఆపైన దేశంపై పంపి ధర్మ ప్రచారం చేయాలి. దేశమంతటా ధర్మ ప్రతిష్ఠితం చేయాలి. ఇదే మఠాధిపతులకు నా మనవి. ఇట్టి కార్యం చేసి ధర్మ రక్షణ చేసిన శ్రీ మలయాళ స్వాములవారికి వారి ఈ శతజయన్తి సందర్భంగా నమస్కృతులర్పిస్తూ విరమిస్తున్నాను.

ఆపైన పూజ్యశ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు (కాళహస్తి) మాట్లాడుతూ గుమ్మిడి చెట్టు ఎక్కడో పుట్టి ఎక్కడో పండునిస్తుంది. అట్లే శ్రీ మలయాళస్వాములవారు ఎచటో కేరళలో పుట్టి ఇచట తెలుగుదేశంలో పండు పండించారు. ఆ జ్ఞానఫలాన్ని మనం తిని ఎంతో ధన్యులమయ్యాము. అట్టి మహనీయులు గురుదేవులగు శ్రీ మలయాళ స్వాములవారికి నమోవాకాలు.

శ్రీవారు పుట్టేటప్పటికి సంఘంలో సంకుచిత భావాలు ప్రబలి దురాచారాలు చోటు చేసుకొని ధర్మానికి హ్రాసం గల్గింది. దురాచారాలతో, శుష్కవేదాంతాలతో, సంకుచిత భావాలతో సంఘం కుళ్ళిపోయింది. కళాయిలేని పాత్రలో వండిన పులుసు చెడిపోయినట్లు ఆచారహీనుల చేతుల్లో, స్వార్థపరుల చేతుల్లో పడి మన ధర్మం విపరీత

మార్గంలో పయనించడం మొదలెట్టింది. ఆ పరిస్థితుల్లో శ్రీవారు జన్మించి శుష్క-వేదాన్తతమో భాస్కరులై ఈ స్వార్థపరుల, దురాచారుల ఆట కట్టించినారు. ధర్మానికి, వేదాన్తానికి సరైన అర్థం తెలిపినారు. అందరిని జాగృతపరచి మనందరికి ధర్మాన్ని వేదాంత రహస్యాలను తెలిపి మనలను అసలైన సిసలైన ధార్మికులనుగా, వేదాంతులుగా అనుష్ఠానపరులుగా తయారు చేశారు.

మనం "నాదీ నాకే, నీదీ నాకే" అనేట్లు వుండరాదు. అది అసలైన వేదాన్తం. అనుష్ఠాన వేదాంతం గాదు. ఆత్మైమ్యేన సర్వత్ర—అంతటా తనవలెనే చూడాలి. "నీదీ నీకే, నాదీ నీకే" అనేట్లుండాలి. కాలుకు ముల్లు గ్రుచ్చుకుంటుంది. వెంటనే కన్ను, చెయ్యి పని చేస్తాయి. ఆ ముల్లును కాలు నుండి తొలగిస్తాయి ఆత్మౌపమ్యత అంటే అది. అవి తామంతా ఒకే శరీరంలో భాగం అనుకున్నాయి. అట్లే మనమంతా ఒకే విశ్వరూపంలో భాగం గాన, ఇతరుని తన వలెనే చూడాలి. ఇతరునికి కష్టం గల్గినపుడు అతనిని ఆదుకోవాలి. మనకు స్కోభ్రాతృత్వంగాదు కావలసింది. ఆత్మౌపమ్యత. ఇతరుని తనవలె చూచుకోవడం కావాలె. కాబట్టే శ్రీవారు శుష్క-వేదాన్తాన్ని దూషించారు, ఖండించారు. అందరికి అర్హతనిచ్చి అడ్డు గోడల తొలగించి అందరిని అనుష్ఠాన వేదాంతులుగా చేశారు. మానవత్వాన్ని వుద్ధరించారు. నిజమైన ధర్మ ప్రచారం చేశారు. గాన వారి జీవితాన్ని మనం మరువరాదు. దాన్ని ఆదర్శంగా పెట్టుకొని వారి విశాల సిద్ధాంతాలను అమలు పరచాలి. వారిలోని విశేష గుణాలను క్రమశిక్షణ, విశాల దృష్టి, భేదరాహిత్యం చెప్పిన దానిని చేసి చూపే అనుష్ఠానం అనే వానిని మనం అలవరచుకోవాలి.

వీధిలోని రాయి అనేక సుత్తి దెబ్బలకు ఓర్చుకొని విగ్రహమైతే గుడిలో చేరి పూజింపబడుతుంది. అట్లే శ్రీవారు సాధనలో సంఘ సంస్కరణలో ఎన్నో అడ్డంకులను ఎదుర్కొన్నారు. ఎన్నో కష్టాలను ఓర్చుకున్నారు. వారి అనుష్ఠానాన్ని వదలలేదు. స్థిర సంకల్పులై దృఢ దీక్షతో వుండి ధర్మ ప్రతిష్ఠ చేశారు. సోమరి తనానికి తిలోదకాలిచ్చినారు. శ్రీవారి వలె మీరున్ను చేయవలసిన సాధన చేస్తే గమ్యం తప్పక పొందుదారు. నిత్యజీవితంలో శ్రీ సద్గురు దేవులను స్మరిస్తూ, వారి ఉపదేశాలను ఆచరిస్తూ ముందుకు పదండి అపుడు శ్రీవారు పొందిన స్థానం మనమున్ను పొందుతాము. ఈ శతజయంతిలో ఇదే శ్రీవారికి మన ఆరాధన." అన్నారు.

ఆ పిదప పూజ్యశ్రీ చిదానందస్వాములవారు (ఋషీకేశ్) -మాట్లాడుతూ "జ్ఞానులు, వృద్ధులు, తపస్వులు వీతరాగులైన మిమ్ములనందరినీ ఒకే చోట ఒకే

వేదికపై చూస్తున్నందులకెంతో ఆనందంగా వుంది. ఈ అవకాశం కల్పించిన వారికి నమస్కారాలు. మహాపురుషులైన శ్రీ మలయాళస్వాములవారి శతజయంతి నేడు. నాడు కేరళలో పుట్టిన ఆ చిన్న బిడ్డ నేడు ఇచట ఇంత విభూతికి కారణమైనాడు. నాడెవరూ దీన్ని కలలో గూడ వూహించి వుండరు.

శ్రీ మళయాళస్వామి వారు ఈ యుగంలో ఒక దివ్య విభూతి వారు సనాతన వైదిక ధర్మాన్ని తానను భవించి ప్రచారం చేసి మిమ్ముల నందరిని అనుభవింపేట్టు చేసిన వారు అట్టి వారిని దివ్య విభూతి అనడంలో ఏలాటి సందేహం లేదు. నేను 1826 లో శ్రీవారిని దర్శించినాను. నేను వచ్చిన నాడు శ్రీవారు తెల్లగుడ్డలతో మహా తపస్విగా వున్నారు. వారి దర్శనం చేతనే మనోవృత్తులు నశించినవి. ప్రశాంతి గలిగింది. అపుడే కాశీ నుండి పూజ్యశ్రీ శంకరానందస్వాములవాడు వచ్చి విరజాహోమం చేయించి శ్రీవారికి సన్న్యాసమిచ్చినారు. నేను మొదట తెల్లగుడ్డలతోనున్న స్వామిని చూచాను. మరల నెల లోపలే కాషాయాంబరధారి సన్న్యాసిగా చూస్తే నాకు వారిపై మహా శ్రద్ధ గలిగింది.

నిరసన వాదాలు, నాస్తికవాదాలు, సిద్ధాంతాలు వుండే ఈ కలియుగంలో భారత దేశంలో. ప్రతి చోట ప్రతి జనరేషన్‌లో మహా పురుషులు, సిద్ధపురుషులు జన్మిస్తున్నారు, జన్నిస్తుంటారు. ఇదే భారతదేశ విశిష్టత. ఈ విశేషం మరే దేశంలోను లేదు. ఇదే భారతదేశ గొప్పదనం. కాబట్టే ఈ భూమి పుణ్యభూమి. ఈ దేశములో జన్మించిన వారంతా ధన్యులు. ఈ యుగంలో పాశ్చాత్యులు వచ్చి మన దేశాన్ని ఆక్రమించి పరిపాలకులవడమే గాకుండా మన ధర్మాలను, ఆచారాలను అంధ విశ్వాసమని ప్రచారం చేశారు. మన ధర్మాలకు హాని గలుగజేశారు. ధర్మానికి గ్లాని గలుగజేశారు. మన ధర్మనిరతిని, మన ధర్మ విశ్వాసాన్ని నశింపజేసి వారి మత ప్రచారాన్ని వృద్ధి చేయు సమయంలో శ్రీమలయాళస్వాములవారి వంటివారు పుట్టి విధర్మ ప్రచారాన్ని ఖండించి మన ధర్మాన్ని పునః ప్రతిష్ఠ జేసి మనలను ధర్మ నిరతులజేసి దేశానికి ఎనలేని సేవ చేశారు.

శంకర భగవత్పాదులు వివేక చూడామణిలో " శాంతో మహాంతో....వసంతవల్లోక హితం చరన్తః " అని చెప్పినట్లు వసంతఋతువు కొత్త చిగుళ్ళ చిగిర్చి దేశానికి శోభనిచ్చినట్లు శ్రీ మలయాళస్వాములవారు వచ్చి సర్వభూతహితరతులై తాము ఆప్తకాములైనా మసకొరకు వచ్చి కుల, మత, వర్గ, వర్ణ, జాతి వివక్షత లేకుండా అందరకు భవసాగర తరుణోపాయాన్ని తెల్పి అందరిని తాపత్రయదూరు

టుగా చేశారు. శ్రీవారు పోయినా వారి పరంపర సాగుతూనే వుంది. శ్రీవారుగార్గి మొదలగువారిని ఆదర్శంగా చూపి స్త్రీలకు గూడా సన్న్యాసమిచ్చి ఒక కొత్త మార్గాన్ని చూపి మంచి ధర్మవృద్ధిని గలుగజేశారు. జాతిలో ఒక ముఖ్య ప్రబల అంగమగు స్త్రీలల్లో ధర్మనిరతిని, ధర్మనిష్ఠను, ధర్మప్రచార దీక్షను పెంచినారు. ఇట్టి యుగ పురుషుడు, ధర్మ రక్షకుడు అగు శ్రీ స్వామివారి శత జయంతిలో కలుసుకొనే అవ సరం యిచ్చినందులకు ధన్యవాదం సమర్పిస్తూ విరమిస్తాను" అన్నారు.

ఆపైన (ఇనమడుగు) పూజ్యశ్రీ సత్యానందమహర్షులవారు ఇలా ప్రసంగిం చారు—"లోకసేవ అనే కర్మ, ఉపాసన అను యీరెండూ రెండుకండ్లు. ఇవిరెండూ అవసరం. కేవలం ధ్యానమూ పనికిరాదు నిష్కామకర్మ ఒక ప్రక్క వుండాలి. ధ్యానమూ తప్పక వుండాలి నేడు. ఇది శ్రీ మలయాళస్వాములవారి ఆశయం భగ వంతుడనే ఒకటి వుంచుకొని ప్రక్కన ఎన్ని సున్నలుంచుకున్నా వానికి విలువ పెరుగుతుంది. గాన, భగవంతుణ్ణి వదలకుండా ధ్యానిస్తూ - ఉపాసిస్తూ లోకసేవ చేయాలి. "ప్రతిబంధక వాహుళ్యవారణాయ ఆశ్రమో మతః" అన్నారు శ్రీ రమణ భగవానులు. సన్న్యాసం త్యాగమయం. గాన, దీనికి విలువ. శ్రీ మలయాళ స్వాములవారు సన్న్యాసులు. వారు సన్న్యాసులుగానే జీవించారు. ఆచరణచేశారు. శ్రీ మలయాలస్వాములవారి వలె నియమంగా వుంటే, వారి నియమాలను పాటిస్తే, వారి వద్ద శిక్షణపొందితే ప్రపంచాన్నే వూపగలరు. ఒకమారు శ్రీ స్వాములవారు నాతో "నాకు ఇంగ్లీషు వచ్చియుంటే విదేశాలకు పోయి వుండేవాడిని" అన్నారు శ్రీ మలయాళస్వాములవారు నూతన ఆధ్యాత్మిక జాగరణ చేశారు. వారు ఆధ్యాత్మిక విప్లవకర్త" వారికి ఆంగ్లమే వచ్చియుంటే నిజంగా వారు మరో వివేకానంద అయి ప్రపంచాన్ని ధార్మిక జాగరణతో ఒక వూపు వూపివుండేవారు.

పశువులకు జ్ఞానంలేదు. అవి తమ పొలం అని చూడవు. పరుల పొలం అనీ చూడవు. తన యజమాని పొలం అనీ చూడవు. ఎదురుగా ఏది వుంటే దాన్ని మేసి వేస్తాయి. కారణం వానికి జ్ఞానంలేదు. కానీ, మానవుడు అట్లుకాదు అజ్ఞాన మానవుని పశువుతో పోల్చడం సరిగాదు. పశువు బ్రతికినంతకాలం పొలం దున్నడం, బండి లాగడం, పాలివ్వడం, ఎరువు నివ్వడం ద్వారా సేవచేస్తుంది. చనిపోతే చర్మా న్నిచ్చి సేవ చేస్తుంది. కానీ అజ్ఞానమానవుడు బ్రతికినపుడూ వుపయోగంలేదు, చచ్చినా వుపయోగంలేదు. గాన వీనికంటె పశువు చాల మేలు. గాన యితనికి పశువుతో ఉపమానంసరిగాదు. శ్రీ మలయాళ స్వాములవారి మహిమ వలన [illegible]



శతజయన్తి యతి సమ్మేళనానికి విచ్చేయుచున్న మహామణ్డలేశ్వరులు మఠాధీశ్వరులు.




మహామండలేశ్వరులు పూజ్యశ్రీ ప్రకాశానందస్వాములవారు (హరిద్వార్) ఉపన్యసించుట
(మధ్యలో నున్నవారు)

జ్ఞానాన్ని పొంది నిజమైన మానవులైనారు సార్థక జన్ములైనారు. అట్టి మలయాళ స్వాములవారికి నా ఈ భాషణ ద్వారా శత జయన్తి సందర్భంగా నమస్కరించి విరమిస్తున్నాను. "

(కంచి, శ్రీరామకృష్ణమఠం) పూజ్యశ్రీ నందానందస్వాములవారు ఇలా ప్రసంగించినారు. - "అన్నతమ్ముళ్లారా! అక్కచెల్లెళ్లారా! ఇది మహా సుదినం. ఈ శతాబ్దంలో మహాపురుషులు దేశమంతటా జన్మించారు. ఈ 19 వ శతాబ్దం అన్నివిధాల దిగజారింది. ఈ సమయంలో అనేకమంది మహాత్ములు జన్మించారు. ధర్మాన్ని రక్షించారు. ఈ కాలంలో "ఒకే కులం, ఒకే జాతి, ఒకే దైవం" అనే సందేశాన్ని అందించిన మహానుభావుడు శ్రీ జ్యోతి రామలింగస్వామి, అదే సిద్ధాంతాన్ని కేరళలో శ్రీ నారాయణ గురు ప్రచారం చేశారు. ఇదే సిద్ధాంతాన్ని తెలుగుదేశంలో ప్రచారం చేశారు శ్రీ మలయాళస్వాములవారు. శ్రీ స్వామివారు కేరళలో జన్మించారు, వివేకానంద సమాధి అయ్యేసరికి స్వామివారికి 11 ఏండ్ల వయస్సు. శ్రీ స్వామివారు ఇల్లు వదిలేనాటికి 20 ఏండ్ల వయస్సు. శ్రీ స్వామివారు దేశమంతటా చుట్టి తిరుపతిని తపోస్థలంగా యెన్నుకున్నారు. గురుసేవ చేసి వారి ఆశీర్వాద బలంతో 29 వ వయస్సులో తిరుమల గోగర్భం తపస్సుకై వచ్చినారు. 12 ఏండ్లు గోగర్భములో ఘోర తపస్సు చేశారు వారికి దైవంపైన తీవ్ర వ్యాకులత కల్గింది. దైవదర్శన తపన వుండింది వారి చరిత్రలో చూడండి. "అతీత వైరాగ్యమఖండ బోధః ....కదాను మే సిద్ధ్యతి హే దయాళో!" అని వారు ఏడ్చేశారు. ఈ తపన సన్న్యాసికి వుండాలి. శ్రీవారు తాను తరించుటతో ఆగక జగద్ధితాయ - లోక కళ్యాణం కొఱకు పాటుపడ్డారు.

ఒక ముముక్షువు యొక్క ప్రశ్నకు శ్రీ మలయాళస్వాములవారిట్లు బదులిచ్చినారు. "నాకు ముక్తి కావాలనిలేదు. బ్రాహ్మణ జన్మ కావాలనిలేదు. సుందర రూపం కావాలనిలేదు. కానీ ప్రపంచంలోని సమస్త దుఃఖాలను పోగొట్టే శక్తి కావాలి. అవిచ్ఛిన్న దైవభక్తి - స్మరణ కావాలి" అని వారు ఇతరుల ఉద్ధరణకై అవతరించినారనడానికిదే చాలు. శ్రీ స్వాములవారు 12 ఏండ్ల తపస్సు అనంతరం 36 ఏండ్లు ఆంధ్రుల ఉద్ధరణకు పాటుపడ్డారు. మీ అందరిని తరింపజేయడానికి ప్రయాసబడ్డారు. వారి కృషి ఫలితం ఇచట కనిపిస్తూనే వుంది. మీరే దానికి సాక్ష్యం. దృష్టాంతం. శ్రీ మలయాళ స్వాములవారు గ్రామగ్రామానికి పోయి రా రండి! రా రండి! జనులారా! ఆత్మవల్లనే శక్తి వచ్చును. రా రండి! చూడండి!

లేవండి! లేవండి!!" అని వివేకానంద చెప్పినట్లు జనులను మేల్కొల్పి జాగృత పరచినారు. గ్రామ గ్రామం తిరిగి ధర్మప్రచారం చేశారు. శ్రీ స్వాములవారు అస్పృశ్యతను ఖండించినారు. మీరున్నూ దానిని అమలుపరచి, వారి క్రమశిక్షణను పాటిస్తూ వారి పేరును నిలబెట్టండి. నాకీ అవకాశమిచ్చిన కార్యకర్తలకు దన్యవాదాలు" శాంతి మంత్ర పఠనతో సమ్మేళనం సమాప్తమైంది.

ఈ శతజయంత్యుత్సవాల సందర్భంలో తిరుమల తిరుపతి దేవస్థానం వారు బ్రహ్మవిద్యా పాఠశాలకు, అందలి విద్యార్థినీ విద్యార్థుల వసతికి అనువైన భవనాలు నిర్మించి యివ్వాలని నిర్ణయించారు. ఈ నిర్ణయానుసారం తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తలమండలి అధ్యక్షులు శ్రీ వి కె. డి వి. సత్యనారాయణరాజు, యం. ఎల్. ఏ. గారు బ్రహ్మ విద్యాపాఠశాలకూ, వ్యాసాశ్రమ వ్యాసపీఠాధిపతులు పూజ్యశ్రీ విద్యానందస్వాముల వారు బ్రహ్మచారిణుల వసతి గృహానికీ శంకుస్థాపన, చేశారు.

28 వ తేది సాయంకాలం 4 గం॥లకు సాధు మాతల ప్రార్థనా గేయ గానంతో రెండవ యతి సమ్మేళనం ప్రారంభమైంది. శ్రీ కైలాసాశ్రమాధిపతులు కైలాస పీఠాధీశ్వర్ మహా మండలేశ్వర్ పూజ్యశ్రీ విద్యానందగిరి స్వామీజీ మహరాజ్ అధ్యక్షత వహించారు. తమ అధ్యక్షోపన్యాసంలో శ్రీవారు ధర్మప్రాధాన్యాన్ని, ధర్మాన్ని ఆచరించవలసిన ఆవశ్యకతను నొక్కి వక్కాణిస్తూ ఇలా ప్రసంగించారు-

"మానవుని సంఖ్య అనంతం. కానీ అందులో కొంతమందే గణనలోనికి వస్తారు: మానవుల కోర్కెలు అనంతం. కానీ వానిని నాల్గురకాలుగా విభజించారు—— ధర్మ అర్థ కామ మోక్షాలని. ఈ నాల్గు పురుషార్థాలల్లోనే మానవుని కోర్కెలన్నీ ఇమిడి వున్నాయి. ఇందులోనే ఆఖరుదగు పురుషార్థం - కోర్కె వలన మానవునికి పూర్ణత్వం సిద్ధిస్తుంది."

"వేద ప్రతిపాద్యో ధర్మః" అని సూత్రము. అంటే ధర్మము వేదప్రతిపాద్యము, వేదంలో చెప్పబడింది అని అర్థము. నేడు ధర్మాన్ని అనేక రకాలుగా చెప్తున్నారు. కానీ నేడు మీరు ధర్మం అంటే ఏమిటో దాని నిజ స్వరూపాన్ని మహాత్ములద్వారా తెలుసుకుంటారు, ధర్మమంటే పరమ ప్రయోజనమగు మోక్షమే, అర్థ కామాదులు కాదు అని వేదవ్యాసులవారన్నారు. ఇట్టి సమారోహాల్లో మీరు ధర్మమంటే ఏమిటని తెలుసుకోవాలి. ధర్మం మన ఇష్టప్రకారం కల్పితంగాదు. మరేమంటే వేదప్రతిపాద్యము, అర్థవంతము ప్రయోజన ప్రదము ధర్మము

శ్రీ మలయాళస్వామీజీ అనుసరించిన మధ్యే మార్గాన్ని అందరూ అనుసరిస్తే మన హిందూ ధర్మాన్ని విధర్మాన్నుండి కాపాడవచ్చు మన దేశంలో ధర్మాన్ని సుప్రతిష్ఠితం చేయవచ్చు. ఈ మార్గం బాగుంది అన్నారు" ఇప్పుడు పూజ్యశ్రీ మహామణ్డలేశ్వరులు హరిద్వార్ నుండి వచ్చిన సురత్‌గిరి పీఠాధీశ్వరులు శ్రీ బ్రహ్మానంద స్వామీజీ ప్రసంగిస్తారు.

పిదప సురత్‌గిరి ఆశ్రమాధిపతులు మహా మండలేశ్వర్ .పూజ్యశ్రీ బ్రహ్మానందస్వామీజీ మహరాజ్ ప్రసంగిస్తూ యిలా అన్నారు—

"మనం యీనాడు ఎవరి జయంతి జరుపుతున్నామో వారు ధర్మానికి, జ్ఞానానికీ ప్రతీకమైనవారు. సమానదృష్టి లేక సమాజంలో తక్కువగా చూడబడేవారిని గూడా సమదృష్టితో చూడమనీ, స్త్రీలను గౌరవించమనీ శ్రీ మలయాళస్వాములవారు ప్రబోధించారు. శ్రీ కాళహస్తిలో శివుడు, తిరుపతిలో బాలాజీ— వీరి మధ్య గురుదేవులు శైవ వైష్ణవ భేద నివారణకై మధ్యమ మార్గ బోధనకై శ్రీ వ్యాసాశ్రమం స్థాపించారు. వారు ఉదారభావ సంపన్నులు. వారి అడుగుజాడలలో పయనించి మనం ధన్యులం కావాలి.'

ధర్మం ఆచరణాత్మకం, విచారాత్మకం అని రెండు విధాలు. అందు విచారాత్మనా స్వరూపం మారదు. కానీ ఆచరణాత్మకం కాలాన్నిబట్టి మారుతూంటుంది. స్వరూపాత్మక ధర్మం విచారాత్మక ధర్మం సత్యస్వరూపం. గాన అది మారదు. ధర్మాన్ని గురించి మన్వాదులు నాల్గు భాగాలని తమ విచారాన్ని గ్రంథరూపంలో ప్రకటించినారు. అందు మొదటిది జ్ఞానవిభాగం, రెండవది రక్షణ విభాగం, మూడవది వ్యాపార విభాగం, నాల్గవది సేవా విభాగం, ఇందు జ్ఞానవిభాగం ముఖ్యమైనా అన్ని విభాగాలూ దేశానికి అంగాలు. దేశానికి (రాష్ట్రానికి) ఈ నాల్గూ అవసరమే, వీనినే బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులనే పేర్లతో పిలుస్తున్నారు. ధర్మం యొక్క ఈ నాల్గు విభాగాలూ సమంజసంగా, సమగ్రంగా వున్నపుడే సమాజం క్షేమంగా వుంటుంది. ఈ నాల్గింటిలో సమరసత లేకుండా తేడాలు వస్తే - భేదాలు వస్తే సమాజం క్షుబ్ధమైపోతుంది.

.... ఈ శరీరానికి తల మొదలగు నాల్గంగాలున్నాయి. అట్లే సమష్టికి ఈ నాల్గు అంగాలు. శరీరంలో ఏ అంగంలో తేడా వచ్చినా ఎట్లు శరీర కార్యం సక్రమంగా సుఖంగా నడువదో అట్లే సమిష్టిలో ఈ బ్రాహ్మణాది నాల్గు అంగాల్లో

తేడాలు వస్తే సమాజం దుఃఖమయమవుతూ ప్రపంచం బాగా నడువదు. అన్నీ సామంజస్యంతో వుంటేనే సమాజం సుఖంగా వుంటుంది.

మనకు తల జ్ఞాన ప్రధానం ఇచట విచారణ, నిర్ణయం జరుగుతుంది. నిర్ణయానంతరం ఆ నిర్ణయానుసారం కాళ్ళు, చేతులు వగైరా పనిచేస్తాయి. శరీరంలోని ఏ అంగంపై ఎవడైనా ఆక్రమణ చేస్తే వెంటనే మెదడులో నిర్ణయం జరుగుతుంది, నిర్ణయం తేలాక వెంటనే యితర అంగాలు శరీరం పైన జరిగే ఆక్రమణను ఎదుర్కొని శరీరాన్ని రక్షించ ప్రయత్నిస్తాయి చేతులు, కాళ్ళు. అట్లు అవి చేయనిచో శరీరంలో ఆఘాతం జరుగుతుంది. శరీరమంతా దుఃఖ భాజనమవుతుంది. అట్లే తల, చేతులు, ఉదరం, కాళ్ళు. బుద్ధితో విచారణ, ఆ నిర్ణయాన్ని అమలుచేసేది చేతులు, చేతులు ఆహారాన్ని లోపలేస్తాయి ఆ అన్నం పొట్టలో పోయి రసంగా మారి శరీరమంతా వ్యాపిస్తుంది. శరీరానికి బలం కలుగుతుంది ఆపైన కాళ్ళద్వారా నడుస్తాము. ఈ నాల్గుఅంగాలద్వారా ఆయాకార్యాలు జరిగినపుడే మానవుడు తన నిత్య జీవితాన్ని సుఖంగా గడుపుకుని శరీర ఔన్నత్యానికి అవకాశం కల్గుతుంది. అట్లే సమాజం అనే సమష్టికి జ్ఞానం, రక్షణ, సంపాదన సేవ అనే ధర్మాలు నాల్గు అంగాలు.

సమాజానికిగల నాల్గు అంగాలు-బుద్ధి ప్రధానంగాగలవారు డాక్టర్లు, పండితులు, ఉపాధ్యాయులు, సైంటిస్టులు. వీరు జ్ఞానవిభాగం. వీరినే బ్రాహ్మణులంటారు. అట్లే సైనికులు రక్షణ విభాగం. అట్లే వ్యాపారి వ్యవసాయం ద్వారా వస్తు సంపాదన చేసేవారు ఒక విభాగం, ఆపైన ఈ అన్నిపనులుచేసే కార్మికులు ఒక విభాగం ఈ నాల్గు విభాగాలు దేశానికి అంగాలు. ఈ నాల్గు అంగాలు ఏకత్వంతో పరస్పర స్నేహంతో అన్యోన్యంగా వుంటే యివి సరిగా వున్నందున సమాజం శాంతిగా వుంటుంది

అట్లుగాక జ్ఞానభాగం విజ్ఞానులు సరిగా తమ పనిచేయనిచో, రక్షణవిభాగం సహకరించనిచో, వ్యాపారి సామానులను సంగ్రహించి గోదాములలో నింపుకొని అందరికి పంచక బ్లాక్ ధరలు అడిగితే సంఘం తిరుగుబాటు చేస్తుంది. అపుడు సమష్టిలో అశాంతి కలుగుతుంది. దుఃఖం కలుగుతుంది. అట్లే కార్మికులు సహకరించనిచో సమష్టిలో విభేదాలు వస్తాయి అశాంతి గల్గుతుంది. అట్లుగాక నాల్గు విభాగాలు తమ తమ కర్తవ్యాలను సరిగా చేస్తూ ఒకరికొకరు సహకారంతో వుంటూ అన్యోన్యాశ్రయంగా వుంటూంటే సమాజం పరమశాంతిగా సుఖంగా వుంటుంది. మనం మితిమీరి తిని పొట్ట నింపుకుంటే పొట్ట చెడి అజీర్తి గలిగి విరోచనాలు



పూజ్యశ్రీ మాతా శారదా ప్రియానన్దవారి అధ్యక్షతన పూజ్యశ్రీ యోగినీమాతగారు ఉపన్యసించుచున్నారు.



పూజ్యశ్రీ చిదానన్ద స్వాములవారు అధ్యక్షోపన్యాసం చేయుట. ప్రక్కన శ్రీ వ్యాసాశ్రమ పీఠాధిపతులు పూజ్యశ్రీ విద్యానన్దస్వాములవారు, రామకృష్ణ మఠానికి చెందిన పూజ్యశ్రీ నందానందస్వాములవారు గలరు.

గలిగి శరీరమంతా అశాంతి మయమైనట్లు, ఈ నాల్గు విభాగాలు సమరుసంగా వుండనిచో, తమ ధర్మాన్ని తాము నిర్వర్తించనిచో దేశంలో విప్లవం వస్తుంది!.

నేడు మనం శతజయంతి నడిపే మహా పురుషుడు శ్రీ మలయాళస్వాముల వారు సంఘాన్ని చూచారు. నేటి సమాజ దుర్భర పరిస్థితులను చూచారు. సమాజంలో ఒక అంగమైన శూద్రుని పరిస్థితి చెడిపోయిందని గమనించారు. ఈ అంగం చెడి పోతే సంఘము, దేశం సరిగా నడువదని తలంచి ఈ నాల్గవ అంగం శూద్రునికిగూడ గౌరవ స్థానాన్నిచ్చారు వారికి ఆధ్యాత్మిక ఉన్నతిని గలుగజేశారు. బ్రాహ్మణ వర్గానికి నచ్చచెప్పి ఈ నాల్గవ అంగాన్ని సమాజంలో ఉద్ధరించారు. వారికి ధార్మిక ఆధ్యాత్మిక అధికారాన్నిచ్చి వారిని ఉద్ధరించారు. ఈ విధంగా సమాజాన్ని ఉద్ధరించారు సమాజశాన్తికి బాట వేశారు.

శ్రీ స్వామీజీవారి ఆచరణను చూడండి. వీరు తిరుపతిలో తపస్సు చేశారు. శక్తిని పొందారు. ఆ పైన ఆ చోటు వదలి ఈ ఆశ్రమాన్ని స్థాపించారు. విష్ణుక్షేత్రం తిరుపతి వదలి ఇటు శైవక్షేత్రం కాళహస్తుల మధ్యలో ఈ ఆశ్రమాన్ని స్థాపించారు అంటే ధర్మ విషయంలో శైవ వైష్ణవ భేదాలను వదలి మధ్య మార్గం సామరస్యంగా అనుసరించారు. ఇది దేశంలోని గొప్ప ఆశ్రమం. ఇచ్చట మహాత్ములు అనేక మంది గొప్ప గొప్ప వారు ఒకరు కాశీ నుండి, ఒకరు కలకత్తా నుండి, ఒకరు హరిద్వారం, ఒకరు బెంగుళూరు ఒకరు రామేశ్వరము ఇట్లనేక ప్రాంతాల నుండి వచ్చి ఇచట చేరడమే శ్రీ స్వామి వారి మహత్వానికి సాక్ష్యం.

శ్రీ స్వాములవారి అనుగ్రహం మీకందరికి కలుగుగాక అని ఆశిస్తూ శ్రీవారికి నా నమస్కృతులర్పిస్తూ విరమిస్తున్నాను అన్నారు బ్రహ్మానందస్వామీజీ.

పిమ్మట శ్రీ జగద్గురు ఆశ్రమాధిపతులు మహామండలేశ్వర్ పూజ్యశ్రీ ప్రకాశానంద స్వామిజీ మహారాజ్ తమ ప్రసంగాన్ని కొనసాగిస్తూ యిలా అన్నారు—

" 'ధర్మోరక్షతి రక్షితః' అని అంటున్నారు. ధర్మాన్ని తీసివేస్తే భారత దేశానికే అస్తిత్వమే లేదు. మన జాతికి తిరోగతిని ఆపాదించే ప్రాంతీయ వాదాలను,

భాషా భేదాలను దూరీకరించుకోవాలి. అందరం ఐక్యమై ధర్మరక్షణ చేసుకోవాలి సంకుచితత్వాన్ని మనం వదిలేస్తే మన ధర్మాన్ని రక్షించే మరొకదేశం ప్రపంచంలో లేదు. వైదికధర్మ ఛత్రచ్ఛాయలో మనం అభివృద్ధి పొందుదాం.

'ఆత్మనః ప్రతికూలాని పరేషాం న సమాచరేత్' అనేది ధర్మలక్షణం. ఇతరులు మనకు ఏది చేస్తే అప్రియంగా ఉంటుందో దానిని మనం యితరులకు చేయరాదు. ఈ ధర్మాన్ని పాటించి కృతకృత్యులం కావాలి.

దేశమంతా ధర్మం ఒకటే, శరీరంలో ఏ భాగానికి బాధగల్గినా శరీరమంతా బాధ. అట్లే దేశంలో ధర్మానికి ఎచట బాధగల్గినా దేశానికంతా గల్గినట్లే, గాన మనం ప్రాంత భేదం, జాతిభేదం వదలిపెట్టి ఏకమైననే మన ధర్మాన్ని, మనదేశాన్ని రక్షించుకోగలము. మనలో సంఘటన కావాలి, అట్లు మనం సంఘటితమైనపుడే మన ధర్మాన్ని రక్షించుకోగలము.

బ్రాహ్మణత్వాదులు కర్మగుణాలతోనే గాని, జన్మతోగాదు. ఈ నాల్గు మన సంఘానికి అభిన్న అంగాలు. మనం నాల్గు వర్గాలు ఏకంగా వుండాలి. చేతిలో ఒక వేలునరికినా చేతికి శోభలేనట్లు, ఆచేతితో భోజనాదికార్యం సరిగాచేయజాలనట్లు మనలో హరిజనునికి అవహేళన జరిగినా మనలోని ఒక అంగం అవహేళన జరిగినట్లే. ఇది మనకు శోభగాదు. గాన మనం అందురు ఏకంగా వుండాలి. మనందరి ధర్మం ఒకటే, మహాత్ముడు తన స్వార్థం కొఱకు ఇల్లును వదలడంలేదు. ఇంటింట ధర్మ ప్రచారం కొఱకు ఇల్లు వదులుతున్నాడు. ధర్మం సనాతనం. దాన్ని ఎవరూ నాశనం చేయలేరు. ధర్మ సమన్వయాన్ని, ధర్మ స్వరూపాన్ని తెలుపడానికి ఈ విధంగా అనేక మహాత్ములు ఒకేచోట చేరి సమ్మేళనం జరుపాలి. ఇచట శ్రీ మలయాళస్వామి వారి శతజయన్తి సందర్భంగా దేశం నలుమూలలనుండి ఇంతమంది పండిత మహాత్ములు ఒకచోట చేరడం చాలా ముదావహం. ఈ ప్రకారం దేశంలో అచటచటా ఇట్టి సమ్మేళనాలు జరిగితే మన ధర్మ రక్షణ సక్రమంగా జరుగుతుంది.

సాధువుల వద్ద వున్న బుద్ధి, సంపద, సమాజ ఉపకారానికి తోడ్పడుతుంది. సనాతన ధర్మం అంటే అవినాశి, శాశ్వతం, సర్వ వ్యాపక ధర్మం అని పేరులోనే వుంది. దీన్ని ఎవరూ నాశం చేయలేరు.

భారతీయ సంస్కృతి పరిపూర్ణం, సనాతనం, దీన్నిరక్షించేపని, విశ్వ వ్యాప్తం

చేసే పని, బాధ్యత మహాత్ములపైన వుంది. మనందరిపైన వుంది. ఈ వైదిక ధర్మం విశ్వకళ్యాణకారి ఏకాత్మతావాది. మొదట మనం హిందువులం. ఆపైననే క్షత్రియులం. మొదట హిందువు, ఆపైననే వైశ్యత్వం అనేది గుర్తుంచుకోండి. నాల్గువర్ణాలు సమాజంలో అభిన్న నాల్గు అంగాలు. మనం జగద్గురువులం, మనం విశ్వ గురువులం, మనం ఏకతను కాపాడగలము. ఆ సామర్థ్యము మనకుంది. మనం విశ్వశాన్తిని కలుగజేయగలం.

భగవంతుడు అన్నిటిని సహిస్తాడు గాని ధర్మగ్లాని కలిగితే సహించడు. గాబట్టే గీతలో "యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి" అన్నారు భగవానులు. నేడు జరిగే ధర్మగ్లానిని మనం సహించరాదు, ఇతర ధర్మాలు (ముస్లిం, క్రైస్తవాది ధర్మాలు) మన ధర్మ హ్రాసానికి పాటుపడుతున్నాయి. గాన మనం మహాత్ములంతా నడుం గట్టి ధర్మ జాగృతికి, ధర్మ రక్షణకు ప్రయత్నం చేయాలి. ఐక్యంగా సంఘటితంగా వుండాలి. భేదభావాలను దూరీకరించుకొని రాష్ట్రాన్ని రక్షించాలి. ధర్మం అంటే వైదికధర్మమే. ఆ ధర్మం సామాన్య ధర్మం విశేషధర్మం అని రెండు రకాలు. అది సనాతనం, విశ్వధర్మం, వాని ఛత్రఛాయలో అందరూ శాన్తిగా వుంటారు. గాన ఈ వైదిక ధర్మాన్ని మనం అందరు సంఘటితంగా వుండి శ్రీ మలయాళ స్వాములవారివలె రక్షించాలి, సంఘటితంచేయాలి. "సంఘేశక్తిః కలౌ యుగే"

అందరూ శ్రీ మలయాళస్వాముల వారి ఆశయాల ప్రకారం వారి చరణ పంథాలో భేద భావం వదలి సంఘటితంతో ధర్మ ప్రచారం చేస్తూ ధర్మోద్ధరణకు ప్రయత్నం చేయాలి అంటూ, అట్లు ధర్మరక్షణ మనం చేస్తే మన లను ఆధర్మం రక్షిస్తుందని చెప్తూ శ్రీ మలయాళస్వాముల వారి పాదాలకు ఓం నమో నారాయణ చెపుతూ "సంపుచ్ఛధ్వం, సంఘచ్ఛధ్వం గ్రామగ్రామాలల్లో ధర్మ ప్రచారాలు జరుగాలి, రాష్ట్ర అభ్యుదయానికి, నిశ్శ్రేయస్సుకు పాటు పడాలి" అంటూ నా వుపన్యాసాన్ని విరమిస్తున్నాను.

తర్వాత హైదరాబాదు శ్రీ రామకృష్ణ మఠాధ్యక్షులు పూజ్యశ్రీ రంగనాథానందస్వామీజీ ప్రసంగిస్తూ యిలా అన్నారు—

హిందూ సమాజం చాల బలవత్తరమైంది. కాబట్టే అది అనేక వేల సంవత్సరాల నుండి నిలబడి వుంది. దీన్ని బలపరచడానికి సాధనం ప్రతి గృహస్థుడు ఈ

ధర్మం మన భారతదేశంలో ఒక అంగమని భావన చేయాలి. మన దేశంలో గృహస్థులు నేను గృహస్థుణ్ని నేనేం చేయగలను అని తలంచుతారు అది తప్పు. మహాభారతం, మనుస్మృతి వగైరాల్లో గృహస్థ ప్రాధాన్యాన్ని గురించి చెప్పబడింది దీన్ని మనం తెలుసుకోవాలి. ఇతర మూడు ఆశ్రమాల వారికి ఆహారాదుల నిచ్చి బలాన్ని చేకూర్చేశక్తి, గృహస్థునిలో వుంది గాబట్టి అతడు శ్రేష్ఠుడని మనువు చెప్పాడు సన్యాస, బ్రహ్మచర్యాశ్రమస్థులు ఆర్జించరు, ఉత్పత్తి చేయరు గృహస్థుడే ఆర్జించి పైవారిని పోషించాలి గాబట్టి ఆతని బాధ్యత చాలా పెద్దది. దేశంలో తాను ఒక పౌరుడు. గాన ప్రతి గృహస్థుడు తాను కేవలం తన కుటుంబం వాడేనని పరిమితంగా తలంచక దేశంలో భాగంగా తలంచాలి. విశాల భావంతో మెలగాలి దేశపౌరుడుగా.

పరిమిత గృహస్థుడు, విశాల గృహస్థుడుగా, పౌరుడుగా దేశానికంతా చెందిన వాడుగా అభివృద్ధిచెందాలి మానసికంగా. సేవాభావాన్ని, ప్రేమ భావాన్ని కుటుంబ వరకే పరిమితం చేయక, దాన్ని విశాలం చేసి దేశానికంతా ఆ సేవా భావాన్ని, ప్రేమను పెంచాలి ఇది సుందరమైంది. కాబట్టి లక్షలాది గృహస్థులు కుటుంబ భావం నుండి పౌర భావంలోనికి వృద్ధి చెందాలి. అది ఆధ్యాత్మిక భావనచేతనే సాధ్యమౌతుంది. అజ్ఞానం, దారిద్ర్యం హీనత్వం అనే మన సమాజంలోని హేయభావాలు నశించాలంటే మనం కుటుంబ పరిమితి నుండి పౌరసత్వం వరకు అభివృద్ధి కావాలి.

ఆధ్యాత్మికంగా, ఎపుడైతే నీవు బలాన్ని గుంజుకొని పెరుగుతావో అపుడు నీకు శీలబలం గలుగుతుంది, వృద్ధి అవుతుంది. ఈ శీలబలం లేనందు చేతనే మనం దాస్య భావానికి లోనైనాము. కాబట్టి ఈ దినం మన సానుభూతిని సమాజం అంతటికి విస్తరింప జేయాలి. గాబట్టే వివేకానంద "వికాసమే జీవితం, సంకుచితమే మరణం" అన్నారు. ఇదిచాలా బాగుంది. వివేకానంద మైసూరు మహారాజుకు వ్రాస్తూ ఎవరు ఇతరుల కొఱకు జీవిస్తారో వారే జీవించిన వారు, మిగతా వారు బ్రతికివున్నా మరణించినట్లే అని వ్రాశారు. హిందూమతమేగాదు, ఏమతమైనా అభివృద్ధి ఆధునిక మానవుడు ఎదుర్కొనే సమస్యలను పరిష్కరించడంపైనే ఆధారపడి వుంది.

ఈ ఆధునిక యుగంలో లాభం పొందాలంటే భగవద్గీతవంటి వానిలోని ధర్మాలను విశాలభావంతో అర్థం చేసుకోవాల్సి వుంది. గీతను మనం గౌరవించాం, పూజించామేకాని దానిలో చెప్పినదానిని మనం అర్థంచేసుకోలేదు, ఆచరించలేదు. గాన ఉపయోగం జరుగలేదు పాలను నెత్తిన పెట్టుకొన్నంతమాత్రాన ఏ ప్రయోజనం లేదు. దాన్ని త్రాగిననే దానివలన ప్రయోజనం. అట్లే గీతను అర్థంచేసుకొని ఆచరణలోపెడితే గీతవలన ప్రయోజనం మనకు గల్గుతుంది. గీతలో యంత్ర యోగేశ్వరః కృష్ణో ... ధ్రువానీతిర్మతిర్మమ" సంజయుడు ఎచట యోగీశ్వరుడైన కృష్ణుడు, ధనుర్ధారి అర్జునుడుంటారో అచట ఆధ్యాత్మిక సంపద, నైతిక వృద్ధి వుంటుందన్నట్లు, రెండు శక్తిప్రవాహాలను ఇపుడు మనం సమన్వయంచేసుకోవాలి. ఒకటి కృష్ణుని ప్రతినిధి, రెండోది అర్జున ప్రతినిధి శక్తి అవి అంతర్ముఖమైన ఆత్మ చింతన, యోగకర్మ భారత-కుశలత. ఈ రెండింటిని మనం ఆచరణలో పెట్టాలి-అనుష్ఠానంలోపెట్టాలి ఈ రెంటిని మనం చేయనందున మనం సిరికి, భూతికి దూరమైనాము. ప్రజానీకంలో సగంమంది దరిద్రులు. చాలామంది విద్యావిహీనులు. ప్రతి పౌరులు దీన్ని గమనించాలి సనాతనులు దీన్ని గమనించాలి లక్ష్మి ధనదేవత, విద్యకు దేవత సరస్వతి. ఈ ఇద్దరు సోదరీమణులు. గాని మనలో ఒక దురభిప్రాయం "ఈ ఇద్దరూ ఒకచోట వుండరు" అనేది వుంది ఇది తప్పు. ఈ ఇద్దరూ అన్యన్యప్రీతితో ఒకటిగా వుంటారు అందు సరస్వతి అంటే జ్ఞానాభిమాని దేవత. జ్ఞానమును మానవ సమస్యాపరిష్కారానికి ఉపయోగిస్తే లక్ష్మి ధనం వెంటనే మన వద్దకువస్తుంది. మనం సరస్వతిని-జ్ఞానాన్ని అవహేళనచేసి ధనం (లక్ష్మి) వెనుక పరుగెత్తినాము. గాన మనం వెనుకబడ్డాము. ఈ దేవతల ఫోటో ఇంట్లో వుంచి వానిని పూజిస్తే చాలని మనం భావిస్తున్నాం. ఇది పొరబాటు. నిజమైన పూజ విద్య ద్వారా జ్ఞానాన్ని సంపాదించి దాన్ని లోకహితానికి ఉపయోగించడమే, దానివే ధనం మనకు లభిస్తుంది. ఇట్లు మనకు రెండూ లభిస్తవి. మన దారిద్ర్యంపోతుంది సుఖమూ కల్గుతుంది మనకు.

"గీతను మనం పూజించడం నేర్చుకొన్నామేగానీ గీతా ధర్మాలను ఆచరించడం నేర్చుకోలేదు. గీతను అమృతంతో పోల్చారు. ఆ అమృతాన్ని త్రాగిన వారే అమృతత్వ స్థితిని పొందుతారు. గౌరవంతో శిరస్సు మీద పెట్టుకొని పూజించినంతమాత్రాన అమృతత్వ స్థితి లభించదు. పరోపకార పరాయణత్వమే మహాత్ముల లక్షణం. భర్తృహరి చెప్పినట్లు స్వార్థం వీడి పరులకొరకు పాటుపడేవారు ఉత్త

ములు. స్వార్థముతోపాటు పరార్థాన్ని సాధించేవాళ్ళు మధ్యములు. పరహితాన్ని స్వార్థం కొరకు నశింపజేసేవాళ్ళు మానుష రాక్షసులు. నిరర్థకంగా పరహితాన్ని పాడుచేసేవారిని ఏమనాలో తెలియదు. శ్రీ మలయాళ స్వాములవారు ఉత్తమకోటికి చెందిన సజ్జనులు. వారు లోకం కొరకు పాటుపడి ధన్యజన్ములయ్యారు. గీతా ధర్మాన్ని తాము ఆచరించి ఇతరులచేత ఆచరింపజేశారు. వారి ప్రబోధాలను పాటించి మనం ధన్యులం కావాలి.."

పిమ్మట కల్యాణ దుర్గ భూమానందాశ్రమాధిపతులు పూజ్యశ్రీ భూమానంద భారతి స్వాములవారు ప్రసంగిస్తూ శ్రీ సద్గురు మలయాళ స్వాములవారి ఆధ్యాత్మిక సేవను ఉగ్గడించారు ఉపనిషత్ తత్త్వాన్ని వివరించారు.

తదుపరి 29-3-85 వ తేది ఉదయం 9 గం॥ లకు ప్రారంభమైన యతి సమ్మేళనానికి మహామండలేశ్వర్ పూజ్యశ్రీ బ్రహ్మానందస్వామిజీ మహరాజ్ అధ్యక్షత వహించారు. మహామణ్డలేశ్వర్ పూజ్యశ్రీ విద్యానందస్వామిజీ ప్రసంగిస్తూ గోరక్షణ కొరకై పాటుపడవలసిన ఆవశ్యకతను గురించి వివరించారు. మహా మండలేశ్వర్ పూజ్యశ్రీ గణేశానందస్వామీజీ మహరాజ్ ప్రసంగిస్తూ యిలా అన్నారు—

"మానవులు మానవత్వం వీడి దానవులైనప్పుడు గోరక్షణ సాధ్యంకాదు. మనస్సు మార్చుకోవాలి. గోహత్య జరిగే చోటనే గోవధ నిషేధార్థమైన నినాదాలు చేయాలి. గో శబ్దానికి ఇంద్రియాలని కూడ అర్థం. ఇంద్రియాలను విషయాల నుండి తప్పించడమే గోరక్ష. అలాగే మనస్సును ఆత్మాభిముఖం చేయడం గోరక్ష. అసంగానందస్వామిజీ తిరుమలలో తపస్సు చేసి నిష్ఠాగరిష్ఠులయ్యారు. వారికి శరీరాభిమానంలేదు. మనం కూడా నిరభిమానులమయినపుడే వారికి సరియైన శ్రద్ధాంజలి ఘటించిన వారమవుతాము. ఉత్తమ పదం అధిష్ఠించటానికి అభిమానం అడ్డు తగులుతుంది. అందుకే గీతలో—'నిర్మానమోహా జితసంగదోషాః' అని చెప్పబడింది

ఆపై గీతావాణి సంపాదకులు గండి భూమానందాశ్రమాధిపతులు పూజ్యశ్రీ రామకృష్ణానంద స్వాములవారు మాట్లాడుతూ యిలా అన్నారు—

"గుమ్మడి తీగ జన్మభూమికి దూరంగా వెళ్ళి ఫలిస్తుంది. అలాగే శ్రీ మలయాళస్వాములవారు కేరళావని నుండి దూరంగా వచ్చి ఇక్కడ తమ తపః ఫలాన్ని ప్రసాదించారు. ఉదార చరిత్రులు విశ్వకుటుంబులు. వారికి నీది నాది అనే భేదం

ఉండదు. గోదావరి మహారాష్ట్రంలో జన్మించి ఆంధ్రను సశ్యశ్యామలం చేసినట్లు స్వాములవారు కేరళలో జన్మించి ఆంధ్రను ఆధ్యాత్మికంగా ఫలప్రదం చేశారు. శ్రీవారి ఆదేశంతో 1948 లో బుద్ధచర్యకు అనువాదం చేశాను. బుద్ధుని కఠిన తపశ్చర్యను వింటూ వారు ఏడ్చేవారు. 'మృదూని కుసుమాదపి' అన్నట్లు మహాత్ముల హృదయాలు పువ్వులకంటే మెత్తగా వుంటాయి. ఎన్నాళ్ళు దగ్గర ఉన్నా మహాపురుషుల లోతు తెలుసుకోలేము. అదే వారి లక్షణం. బహుకాలం వెంట ఉన్నా లక్ష్మణుడికి రాముని తత్త్వం తెలియలేదు. సీతకోసం ఏడుస్తాడేమిటి? అని అనుకొనేవాడు.

శుష్క వేదాంతాన్ని పటాపంచలు చేయటానికి శ్రీవారు అవతరించారు. ఆత్మసంస్కర్తలే లోక సంస్కర్తలు కాగలరు. మనం ఋషి సంతానమేకాని కోతుల సంతానం కాము. మహాత్ముల పాద పంకజాలను ఆశ్రయించాలి. పశుప్రవృత్తిని తొలగించుకోవాలి. మహర్షుల కృషి అపారం. వారి కృషికి అనంత నమోవాకాలు."

పిమ్మట మధుర-బ్రహ్మానంద మఠాధిపతులు పూజ్యశ్రీ యోగానందగిరి స్వాములవారు—సంసారం దేశకాలాదులతో పరిచ్ఛిన్నమనీ, బ్రహ్మం అపరిచ్ఛిన్నమనీ, శ్రీ మలయాళస్వాములవారు దేశకాలాది పరిచ్ఛేదాలకు అతీతులైన బ్రహ్మస్వరూపులనీ వర్ణించారు.

నాటి సాయంకాలం 4 గం॥లకు శ్రీ శివానందాశ్రమాధిపతులు పూజ్యశ్రీ చిదానందస్వామీజీ మహరాజ్ వారి అధ్యక్షతన 4 వ యతి సమ్మేళనం ప్రారంభమయింది.

అధ్యక్ష స్వాములవారు తమ ప్రసంగంలో ఇలా అన్నారు—

"మనదేశం అపమార్గంలో పడి చెడిపోకుండా ఈ ఇరవయ్యో శతాబ్దంలో శ్రీ మలయాళ సద్గురుస్వాములవారు అవతరించి ఆధ్యాత్మిక చైతన్యాన్ని, ధార్మిక విప్లవాన్ని సాధించారు. ఈ శతజయంత్యుత్సవాలలో ఇంతమంది మహనీయులను ఆహ్వానించి ధార్మిక ప్రసంగాలు ఇప్పించడం చాలా అరుదైన విషయం. ఇది శ్రీవారికి సంతోష జనకమైనది. ఇది వారు స్థాపించిన సనాతన సభలాగా ఆనంద జనకంగా ఉన్నది."

పిమ్మట బోళాగిరి ఆశ్రమాధీశ్వరులు మహా మండలేశ్వర్ పూజ్యశ్రీ అభినవ

సచ్చిదానందస్వామీజీ మహారాజ్ ప్రసంగిస్తూ "బుద్ధితో విచారించాలి. సిద్ధాంత నిర్ణయము చేయాలి. మనుష్యేతర ప్రాణులు ఇలా చేయలేవు. జీవ బ్రహ్మైక్యానుభూతికి నిశ్శ్రేయసం అని పేరు దానిని శ్రీ మలయాళస్వామీజీ పొందారు" అని చెప్పారు.

మహా మండలేశ్వర్, పూజ్యశ్రీ బ్రహ్మానందస్వామీజీ మహారాజ్ (హరిద్వారం) గారు శ్రీ మళయాళస్వామి శతజయంతి సంచికను ఆవిష్కరించారు.

తదుపరి పూజ్యశ్రీ కారుణ్యానందగిరిస్యామీజీ ప్రసంగిస్తూ ఈ విధంగా అన్నారు—

"శ్రీ తరిగొండ వెంకమాంబ వంటి మహాతల్లుల పరితాప ఫలంగా శ్రీవారు మలయాళ దేశంలో స్త్రీ జనోద్ధరణకై అవతరించారు. వారు ఒక గంట చేసిన పరిశ్రమ మనం జీవితమంతా కూడా చేయలేము ఆసేతుహిమాచలం పర్యటించారు.

గోగర్భంలో కఠోర తపస్సు చేశారు. జ్ఞానజ్యోతి వెలగాలంటే విద్యా తపస్సులు రెండూ కావాలి. వారికి 'మలయాళస్వామి' అని నామకరణం చేసిన వారు ప్రజలే 'సద్గురువు' అని అన్నది కూడా వారే. శ్రీవారు తమ జీవితాన్ని లోకానికి ధారపోశారు. తపస్సు చేసి చేసి ఆత్మ సాక్షాత్కారం పొందారు. శుష్కవేదాంత తమో భాస్కరం, పూజా పంచరత్నమాల అనే రెండు గ్రంథాలు వ్రాసి గోగర్భంలో ఉన్నప్పుడే ప్రకటించారు: వాటిని ఎవరైనా ముద్రించుకోవచ్చు అని చెప్పారు. స్త్రీలకు ద్విజేతరులకు పరివ్రాజకాధికారం, బ్రహ్మ విద్యాధికారం లేదని వాదించే వారనేకులు కడపట శ్రీవారికి శరణాగతులయ్యారు

1948 లో చాతుర్మాస్య మహావ్రతం జరిగినపుడు ప్రజలే స్వామిని 'మహర్షి' యని వ్యవహరించారు. 'ముందుబెట్టినకాలు వెనుకకు తీయరాదు' ఒకరి చేతి క్రింద 'తమ చేయి పెట్టరాదు' అన్న రెండు వ్రతాలను వారు జీవితమంతా పాటించారు.

1936 లో శిష్యుల కొరకై వారు సన్యాసాశ్రమ స్వీకారం చేశారు. 'నా ఆశీర్వాదం నా వద్దనే ఉంటుంది. మీ సత్యమే మిమ్మల్ని కాపాడుతుంది.' అని చెప్పేవారు. 1935 లో శ్రీవారి అనుమతితో జీవకారుణ్య సంఘాన్ని స్థాపించాము.

1946 నుండి 1951 వరకు ఈ రాయలసీమ ప్రాంతంలో వర్షాలు లేవు.

వేదిక నలంకరించిన మహామణ్డలేశ్వరులు పూజ్యశ్రీ బ్రహ్మానందస్వాములవారు, పూజ్యశ్రీ గణేశానందస్వాములు, మహామణ్డలేశ్వరులు పూజ్యశ్రీ అభినవ సచ్చిదానందస్వాములవారుపన్యసించుచున్నారు.



యతి సమ్మేళనమునకు అధ్యక్షత వహించిన మహామణ్డలేశ్వరులు
పూజ్యశ్రీ బాలకృష్ణ యతీజీ మహరాజ్ గా రుపన్యసించుట.

తీవ్రమైన కాటకం సంభవించింది. అప్పుడు జీవకారుణ్య సంఘం ద్వారా ఎంతో సాంఘిక సేవ చేశాము కొన్నూరు భావనారాయణస్వామి దేవాలయంలో ఉపసభ జరుగు తున్నది. శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రిగారు మొదలైనవారు రాయలసీమలో తీవ్ర క్షామం గదా! మీరు వారి సేవ వదలి వేదాంత సభలు పెట్టారే? అని శ్రీవారిని ప్రశ్నించారు 'రాయలసీమలో సేవ చేస్తున్న జీవకారుణ్య సంఘం మా సంస్థలలో ఒక శాఖ' అని శ్రీవారు చెప్పగా వారు సాష్టాంగ నమస్కారం చేశారు.

1929 లో గూడూరు సనాతన సభలో శ్రీ రాజేశ్వరానందస్వామిగారు "మీరు కేరళలో ఎందుకు సేవ చేయరు?" అంటే సర్వేశ్వరుడు ఎక్కడ నన్ను ఉద్యోగానికి నియమించాడో అక్కడే పని చేయాలి గదా! అని శ్రీవారు సమాధానం చెప్పారు మరొక సందర్భంలో 600 సంవత్సరాలు ఆశ్రమం చక్కగా జరుగుతుంది. ఎంత ఖర్చుపెట్టినా వడ్డీ కూడా తరగదు" అని చెప్పారు. శ్రీవారి ప్రభావం అలాంటిది."

పిమ్మట మహా మండలేశ్వర్ పూజ్యశ్రీ కాశికానందస్వాములవారు(బొంబాయి) సంస్కృతంలో ప్రసంగిస్తూ 'శ్రీ మలయాళస్వాములవారు తాము తరించి ఇతరులను తరింపజేయడానికి ప్రయత్నించారు.

'కోఽర్థాన్ ప్రాప్య న గర్వితః' అన్న శ్లోకంలోని ప్రశ్నలకన్నింటికి సమాధానంగా "మలయాళస్వామి" అని చెప్పవచ్చు. ఎన్ని భవనాలున్నా వారు తమ కుటీరంలోనే నివసించారు" అంటూ శ్రీ సద్గురు స్వాములవారి గుణగణాలను ప్రశంసించారు.

పిదప శ్రీ సిద్ధారూఢ మఠాధిపతులు పూజ్యశ్రీ శివకుమార స్వామీజీ మహరాజ్ మాట్లాడుతూ జీవిత లక్ష్యమయిన భగవత్ప్రాప్తిని పొందటానికి ఆచరించవలసిన సాధనలను వివరించారు.

పూజ్యశ్రీ మాతా త్యాగీశానందపురి వారు కూడా ప్రసంగించారు పిమ్మట శాంతి మంత్రాలతో నాటి కార్యక్రమం పరిసమాప్తమయింది.

30-3-85 వ తేది ఉదయం 9 గం॥లకు ప్రారంభమయిన 5 వ యతి సమ్మేళనానికి మహా మండలేశ్వర్, పూజ్యశ్రీ కాశికానంద స్వామీజీ మహరాజ్ అధ్యక్షత వహించారు.

తమ అధ్యక్ష ప్రసంగంలో వారు "పూజ్యశ్రీ మలయాళ స్వాములవారి శత జయంత్యుత్సవం జరుగుతున్నది. ఈ రోజు వక్తలందరు శ్రీ స్వాములవారి జీవిత

విశేషాలను గురిచి ప్రసంగిస్తారు. ప్రవృత్తి నివృత్తి ధర్మాలను గురించి శ్రీస్వాముల వారు ఏమి చెప్పారో వక్తలు విశదీకరిస్తారు" అని చెప్పారు.

మహా మండలేశ్వర్ పూజ్యశ్రీ గణేశానందస్వామీజీ మహరాజ్ ప్రసంగిస్తూ ఇలా అన్నారు—

"శ్రీ మలయాళ స్వాములవారి ఆశయాలను సభలో చూస్తున్నాం. చెదలు పట్టని కర్రలాగా వారి పునాదులు గట్టిగా ఉన్నాయి. శ్రీవారి తపఃశక్తివల్ల యింత అభివృద్ధి జరిగింది.

'మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనామ్' అన్నట్లు మహాత్ములు ఏమి చేసినా త్రికరణశుద్ధిగా చేస్తారు. వారి సరళ స్వభావం తర్వాతి పీఠాధిపతులకు కూడా సంక్రమించింది. బ్రాహ్మణ హరిజన బాలురను శ్రీవారు సమభావంతో చూశారు. నేడు గ్రామ గ్రామాలలో సాధువులు సన్మానింపబడుతున్నారంటే శ్రీమల యాళ స్వాములవారే కారణం. వారు ఆంధ్ర శంకరాచార్యులు. సద్గురు బోధనలను ప్రచారం చేసేవాళ్ళే నిజమైన శిష్యులు. గౌడపాద బోధనలను శంకరాచార్యులు ప్రచారము చేశారు. అసంగానందులు కూడా అద్వైత తత్త్వాన్నే నొక్కివక్కాణించారు. స్వామి నిర్భయంగా ధర్మప్రచారం చేశారు. 'ఆచారః ప్రథమో ధర్మః', 'ఆచార హీనం న పునంతి వేదాః." అన్నట్లు ఆచారానికి ఎంతో ప్రాధాన్యమున్నది శ్రీ సద్గురు స్వాములవారు ఎంతో సదాచార సంపన్నులు, అనుష్ఠాన గరిష్ఠులు. ఆధునిక విజ్ఞాన సంపన్నులకు కూడా సదాచారం, ఆత్మచింత అత్యవసరం."

పూజ్యశ్రీ శివకుమార స్వామీజీ మహరాజ్ ప్రసంగిస్తూ "అహంకార రహితులే సత్పురుషులు. అసంగానందులు నిరహంకారులు, భగవత్స్వరూపులు, దయా హృదయులు. వారికి నా నమోవాకాలు" అని అన్నారు,

పూజ్యమాతా శ్రీ శారదా ప్రియానందజీ (చిన్మయారణ్యం) మాట్లాడుతూ ఇలా అన్నారు."

"1885 లో శ్రీవారు జన్మించారు. ఆ కాలంలో ఎన్నో లక్షల మంది జన్మించి ఉంటారు, కాని అందరికీ శతజయంతి జరపడంలేదు. ఒక్క శ్రీ వారికే జరుపుతున్నాం. ఎందుకు? వారు అసంగానందులు కాబట్టి. 'మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే' అన్నట్లు వేలకొలది ప్రజలలో ఏ ఒక్కరో అసంగానందులు అవుతారు. తక్కిన వారంతా సంగంవల్ల కలిగే క్షణికానందం అనుభవించే వారే.

శాశ్వతానందం ఇదమిత్థమని చెప్పటానికి వీలులేదు. గాఢసుషుప్తిలో అట్టి ఆనందం కలుగుతుంది. కష్టాల్లో కూడా గాఢనిద్ర కలిగితే ఆనందమే. ఆ స్థితిలో జీవుడొక్కడే ఉన్నాడు కాబట్టి అలాంటి ఆనందం కలుగుతున్నది. శ్రీ సద్గురుస్వాములవారు అసంగానందానికై గోగర్భంలో బహుకాలం తీవ్ర తపస్సు చేశారు. తపసిద్ధి పొంది అసంగానందులయ్యారు. అందుకే వారి శతజయంత్యుత్సవాలను జరుపుకొంటున్నాం."

పిమ్మట పూజ్యశ్రీ శాశ్వతానందస్వామీజీ మహరాజ్ (కాశీ) ప్రసంగిస్తూ "కర్మ - జ్ఞాన - భక్తి - వైరాగ్యాదుల సంగమమే శ్రీ మలయాళ స్వాములవారు" అని వర్ణించారు.

తదుపరి శ్రీ సుబ్బయ్యస్వామి మఠాధిపతులు (మద్రాసు) పూజ్యశ్రీ విద్యానందగిరిస్వామి ప్రసంగిస్తూ ఇలా అన్నారు—

"శ్రీవారి ఆచారం - శీలం చూస్తే చాలా సంతోషం కలుగుతుంది. వారికి గోగర్భంలో తపోవేళ ఎన్నో కష్టాలు వచ్చాయి. అయినా 'దుఃఖేష్వనుద్విగ్నమనాః' అన్నట్లు ఉద్వేగ రహితులై ప్రవర్తించారు.

తపస్సిద్ధి కలిగిన తర్వాత ఆశ్రమం నిర్మించారు. సంస్కృత విద్యాప్రచారం చేశారు. అందరికీ సంస్కృత పఠనావకాశం కలిగించారు. 'సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్' అన్నట్లు అందరినీ పరమాత్మ స్వరూపులుగా భావించారు. కోయిలూర్ మఠసాంప్రదాయాన్ని వ్యాసాశ్రమంలో ప్రవేశపెట్టారు. అక్కడినుండి వచ్చేవారికి చక్కని ఉపచారం చేసేవారు. జాతి లింగాదిభేదం చూడక సమదృష్టి కలిగి వుండేవారు. కోయిలూర్ మఠానికి, వ్యాసాశ్రమానికి సన్నిహిత సంబంధం ఏర్పడింది."

నాటి సాయంత్రం 4 గం॥ లకు అరవయతి సమ్మేళనం మహామండలేశ్వర్ పూజ్యశ్రీ స్వామి బాలకృష్ణయతీజీ మహరాజ్ వారి అధ్యక్షతన ప్రారంభమయింది. మొదట శ్రీ వ్యాసాశ్రమ పీఠాధిపతులు శ్రీ విద్యానందస్వాముల వారిని కొన్ని మాటలు చెప్పవలసినదిగా అధ్యక్షులు కోరారు.

శ్రీ విద్యానందస్వాములవారు తమ ప్రసంగంలో ఇలా అన్నారు—

"పరిపూర్ణ పరబ్రహ్మస్వరూపులగు పూజ్య మహాత్ములారా! ప్రియాత్మ బంధువులారా! శ్రీ సద్గురు స్వాములవారిం శతజయంతీ సందర్భంలో భారతావనిని అంతా కలపడం మంచిదని ఉత్తర దేశంనుండి మండలేశ్వరులను, దక్షిణ దేశంనుండి మఠాధిపతులను, ఇతర ప్రాంతాలనుండి పెక్కుమంది సాధుపుంగవులను ఆహ్వానించడం జరిగింది. మొత్తం భారతదేశం ఏకం కావాలన్న దృష్టితో ఈ పని చేయడమైనది. పూజ్యులు మండలేశ్వరులు పూర్వమే వ్యాసాశ్రమ విద్యార్థుల ద్వారా ఈ సంస్థతో సంబంధం కలిగి వున్న వారు. ఇప్పుడా సంబంధం చక్కగా ప్రకటిత మయింది. శివపూజా ధురంధరులు, పూజా విషయంలో మంచి నిష్ఠాపరులు, ఇతర ప్రదేశాలకు మాములుగా వెళ్ళనివారు కాశీనివాసులు అయిన శ్రీ బాలకృష్ణయతీజీ మహరాజ్ వారు, ఇంకా అనేక మహాత్ములు బాంబే, హృషీకేశ్, హరిద్వార్, కలకత్తా, ఢిల్లీ మొదలైన ప్రాంతాల నుండి వచ్చారు. ఇది చాలా సంతోషించతగ్గ విషయం. ముఖ్యంగా ప్రస్తుత సభాధ్యక్షులైన స్వాములవారికి చెందిన విద్యాసంస్థలోనే వ్యాసాశ్రమ విద్యార్థులు ఉన్నత విద్యను అభ్యసిస్తున్నారు. అట్టివారి అధ్యక్షత క్రింద ఈ కార్యక్రమం జరగడం ముదావహం.

పిదప అధ్యక్ష స్వాములవారు ప్రసంగిస్తూ ఈ విధంగా చెప్పారు—

"భారతభూమి జంబూద్వీపంలోని భరత ఖండాంతర్గతమైనది. ఇదితపోభూమి. యోగభూమి, తత్త్వజ్ఞులైన మహాపురుషులు ఈ దేశంలో అవతరించారు. వారిలో అసంగానందస్వాములు ఒకరు.

జీవుడు పరమశాంతిని కోరుతాడు. స్వతః అతడు సుఖస్వరూపుడు. అందువల్ల సుఖమే అభిలషిస్తాడు. నదులు సముద్రంలోనికే ఎందుకు పయనిస్తాయి? అవి అందులోనుంచే పుట్టాయి గనుక. ఈ మాయామయమైన సంసారాన్ని దాటాలంటే భగవంతుని శరణు పొందాలి. ఈ శతజయంతీ సందర్భంలో సుందరము, విశాలమైన వ్యాసాశ్రమంలో జనతా జనార్దనుడు ఉపస్థితుడయ్యాడు. అసంగానంద స్వాములు శ్రోత్రియ బ్రహ్మనిష్ఠులు. ఇట్టి గురువులను శరణుకోరాలి. శ్రీవారు భౌతికంగా లేకపోయినా జ్ఞానస్వరూపులై సర్వాంతర్యామిగా భాసిస్తున్నారు."

తర్వాత శ్రీ శుకబ్రహ్మాశ్రమాధిపతులు పూజ్యశ్రీ విద్యా ప్రకాశానంద స్వాములవారు రచించిన 'శ్రీ మలయాళ మహర్షి' అన్న గ్రంథాన్ని గీతావాణి



శ్రీ వ్యాసాశ్రమ పీఠాధిపతులు పూజ్యశ్రీ విద్యానన్దస్వాములవారు అధ్యక్షోపన్యాసం చేయుట.



శతజయంతిలో శ్రీవారి జన్మదినాన అధిష్ఠాన మందిరంలో పూజ

సంపాదకులు పూజ్యశ్రీ రామకృష్ణానంద స్వాములవారు ఆవిష్కరించి ఇలా అన్నారు—

"పూజ్యులు శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములు శ్రీవారి జీవితాన్ని సంక్షిప్తంగా వ్రాశారు. శ్రీవారి జీవితాన్ని ఎన్నో విధాల వ్రాయవలసిందే. రామ చరితాన్ని ఎందరో వ్రాశారుకదా! క్రాంతి పురుషులైన శ్రీ మలయాళ సద్గురు స్వాములవారిని ఎన్ని విధాలనైనా కీర్తించవచ్చు శ్రీవారి చరిత్రను శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారు, శ్రీవారు నాగనార్యులవారు, తదితరులు కూడా వ్రాశారు. శ్రీవారి సహజమైన ఛలోక్తులు శ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాములవారి రచనలో పొందుపరచ బడ్డాయి. చెత్త గ్రంథాలు చదివి భ్రష్టం కావద్దు. మంచి గ్రంథాలు చదవండి మహాత్ముల సంగమం దుర్లభం. రామాయణం ఉంటే రాముడున్నట్లే. ఈ గ్రంథం ఉంటే శ్రీ స్వాములవారున్నట్లే."

ఆపైె పూజ్యశ్రీ విద్యాప్రకాశానందస్వాములవారు మాట్లాడుతూ యిలా అన్నారు—

"నాల్గు మాసాల క్రిందట శతజయంతీ సంఘ కార్యదర్శి శ్రీ గోపాల్‌గారు '12 సం॥లు శ్రీవారివద్ద ఉన్న మీకు శ్రీవారిని గురించి ఎన్నో విషయాలు తెలిసి ఉంటాయి. 100 పేజీలు గ్రంథం వ్రాయండి" అని సూచించారు. శ్రీవారి చరిత్ర వ్రాయాలనే సంకల్పం నాకూ చాలా కాలంగా ఉన్నది. కానీ అది కార్యరూపం దాల్చలేదు. ఇప్పుడు వారి సూచనలవల్ల దీన్ని వ్రాయడం జరిగింది. మహర్షి అనునది ఒక బిరుదం. పరిపూర్ణ యోగ్యత కలవారికందరికీ యీ బిరుదం సిద్ధిస్తుంది. అనేకులు శ్రీవారిని గురించి మాట్లాడుతున్నారు. శ్రీవారి ముఖ్యబోధ 'మనస్సులో దుష్ప్రవృత్తులు లేకుండా ఉండాలి' అనేది. శీలపోషణమే భగవత్ప్రాప్తికి సాధనం. చిన్న చిన్న విషయాలలో కూడా శ్రీస్వాములవారు జాగ్రత్తగా ఉండేవారు. చిన్న కార్యాలను పెద్ద బుద్ధితో చేయాలి. సాధారణమైన పనులను అసాధారణంగా ఆచరించే వారు గొప్పవారు. 'గుడ్డ క్రింద తగులబనట్లు నడువరాదు' అని నాకు శ్రీవారు ఒకసారి చెప్పారు.

దారిలో రాయి కనబడితే తీసివేయండి. నీళ్ళలో చీమ పడితే రక్షించండి. చిన్న చిన్న విషయాలలోనే గొప్ప వేదాంతం యిమిడి ఉంటుంది. 100 పుటలు గల యీ గ్రంథంలో నేను నేర్చిన పాఠాలు, శ్రీవారి గుణగణాలు వ్రాశాను.

గురుసేవ చేయాలి. శ్రీవారు శ్రీ శివలింగ గురువులను సేవించారు. శ్రీ శంకరులు గోవింద భగవత్పాదులను ఆశ్రయించారు. శ్రీరాముడు వశిష్ఠుని భజించాడు. శ్రద్ధగలవారికే జ్ఞానం లభిస్తుంది. జ్ఞానం ఉంటేనే పరమశాంతి సిద్ధిస్తుంది. గురువుపట్ల మనకున్న భావమునుబట్టే సిద్ధి కలుగుతుంది."

పిమ్మట పూజ్యశ్రీ దేవానలవజీ మహరాజ్ (హృషీకేశ్) సభాసదులందరిచేత చక్కగా సంకీర్తన చేయించారు.

ఆపై పూజ్యశ్రీ మాధవ చైతన్య భారతీస్వామిజీ మాట్లాడుతూ శ్రీవారు జాతి భేద నిర్మూలనకై 'లోకోద్ధారకం' అన్న గ్రంథం వ్రాశారనీ, మన భారతదేశ హీనస్థితికి జాతి భేదమే కారణమనీ, మనుష్యత్వమే జాతిగాని, జాతిభేదాలు వేరే లేవనీ నొక్కి నొక్కి వక్కాణించారు.

కాశీ హిందూ విశ్వవిద్యాలయాచార్యులు శ్రీ త్రినాథశర్మగారు అసంగానందులవారి తపోనిష్ఠను గూర్చి ఆధ్యాత్మిక సేవలనుగూర్చి వివరించారు. శాంతి మంత్రాలతో 6వ యతి సమ్మేళనం సమాప్తమయింది.

31—3—85వ తేది ఉదయం 9 గం॥లకు ఏడవ యతి సమ్మేళనం ప్రారంభమయింది. ఈ సమావేశానికి అధ్యక్షత వహిస్తూ శ్రీ వ్యాసాశ్రమ వ్యాస పీఠాధిపతులు పూజ్య శ్రీ విద్యానందస్వాములవారు యిలా అన్నారు—

"పరిపూర్ణ పరబ్రహ్మ స్వరూపులైన పూజ్యపాద మహామండలేశ్వరులారా! సాధుసత్తములారా! ప్రియాత్మ బంధువులారా! శ్రీ సద్గురు స్వాములవారి శత జయింతీ మహోత్సవాలలో నాల్గవ దినం ప్రాతః కార్యక్రమంలో వున్నాము. శ్రీవారు దేశానికి చేసిన మేలేమిటో గ్రహించాలి! వారు నడచిన దారిలో మనం నడవాలి!

"మీరెలా గొప్పవారయ్యారో చెప్పండి! మేము గూడా అలాగేచేసి గొప్పవారం కాగల్గుతాము." అని శ్రీవారిని అడిగినవారికి సమాధానంగా వారు "పూజా పంచరత్నమాలలో ఆ విషయమంతా వ్రాసి వున్నాము. గ్రహించుకోండి!" అని చెప్పారు" ఆ గ్రంథంలో అన్ని విషయాలూ వున్నాయి. అలా నడచినవారు తప్పక గొప్పవారుకాగలరు.

శ్రీవారు యెన్నో వుపదేశ వాక్యాలు చెప్పారు. "పురోఽభివృద్ధికోరువారు పూర్వవృత్తాంతం మరువరాదు" అన్నది అందులో ఒకటి దీనిలో యెంతో విస్తృత మైన అర్థం యిమిడి వున్నది. ఏ వుద్దేశంతో యిల్లు వదలి యిక్కడికి వచ్చామో దాన్ని మరువరాదు. అక్కడ అశాంతికి గురై శాంతిని కోరి యిక్కడికి వచ్చారు పూర్వస్థితిని గుర్తుకు దెచ్చుకొని యిక్కడ శాంతితో జీవించటానికి తగిన సాధన చేయాలి.

"మేము బ్రాహ్మణాది వర్ణాలకు చెందినవారము. మేము స్త్రీలము, మేము పురుషులము" అని అందరూ అనుకొంటున్నారు. ఇది నిజమైన పూర్వవృత్తాంతం కాదు. 'యతోవా ఇమాని భూతాని జాయంతే' ఇత్యాదిగా శ్రుతి బ్రహ్మంనుండే ప్రాణులు జన్మించారని చెబుతున్నది. మనుష్యమాత్రులు ఈ రహస్యం గ్రహించాలి. బ్రహ్మప్రాప్తికి తగిన కర్మజ్ఞాన యోగాలను అనుష్ఠించాలి. అందరూ అలా చేసి బ్రహ్మానందముతో విరాజిల్లుదురుగాక !!!"

అపై మహామణ్డలేశ్వరులు పూజ్య శ్రీమదభినవ సచ్చిదానందస్వామీజీ మహారాజ్ (కలకత్తా) ప్రసంగిస్తూ "సమస్తం వాసుదేవుడే అని తెలుసుకొన్నవాడే మహాత్ముడు. శ్రీ అసంగానందస్వామీజీ అలా తెలుసుకొన్నవారే" అని చెప్పారు.

విజ్ఞానాశ్రమాధిపతులు శ్రీ పూర్ణానందస్వాములవారు (తాటిపర్తి) తమ ప్రసంగంలో యిలా అన్నారు—

"శ్రీ సద్గురు మలయాళస్వాములవారి శత జయంతి అద్భుతంగా జరుగుతున్నది వారి దివ్య ఘోషాలలో 'జ్ఞానమతము వ్యాపకమగుగాక!' అనేది ఒకటి." జ్ఞానా దేవతు కైవల్యం' అన్నట్లు ఆత్మరాజ్యప్రాప్తికి జ్ఞానమే ముఖ్య సాధనం. గాంధీగారు స్వరాజ్య లబ్ధికై పోరాటం జరిపారు. శ్రీ స్వాములవారు స్వారాజ్యలబ్ధికై కృషిచేశారు. వారి సమదృష్టి ఆశ్చర్యకరం. పందులకు గూడా చక్కని ఆహారం పెట్టించిన దయామయులువారు" అన్నారు.

తర్వాత అఖిలాంధ్ర సాధు పరిషదధ్యక్షులు శ్రీ సర్వేశ్వరానందస్వాములవారు రెండు నిముషాలు గురునామ స్మరణచేసి "గురుదేవుడు బోధకుడు, చోదకుడు, మోదకుడు" అన్న అంశంపై ప్రసంగించారు.

శ్రీ సదానంద బ్రహ్మచారిగారు రచించిన 'శ్రీ మలయాళస్వామి మహిమ్నః స్తోత్రం' అన్న గ్రంథాన్ని దివ్యజీవన సంఘాధ్యక్షులు పూజ్య శ్రీ చిదానంద స్వాములవారు (ఋషీకేశ) ఆవిష్కరించారు.

పిమ్మట 1957 లో చిత్తూరులో శ్రీ సద్గురు స్వాములవారు గావించిన ఉపన్యాసం టేపురికార్డును సభాసదులకు వినిపించడం జరిగింది. 'దైవభావంతో ప్రార్థనాపూర్వకంగా భోజనం చెయ్యాలి' అన్న అంశం మీద శ్రీ స్వాములవారి దివ్యప్రబోధం విని భక్తులందరూ అమితానందం పొందారు

శ్రీ నిర్విశేష శివానందస్వాములవారు ప్రసంగిస్తూ—"శ్రీవారు తాము ఏ ఆత్మసుఖాన్ని పొందారో, ఆ సుఖాన్ని అందరికీ అందజేయాలి అని పాటుపడ్డారు. ఇతరులను తరింపజేయడమే వారి వుద్దేశం. ఆంధ్రావనికి జ్ఞాన భిక్ష పెట్టడానికే వారు అవతరించారు" అని చెప్పారు.

శ్రీ నిత్యబోధానంద స్వాములవారు మాట్లాడుతూ "చాతుర్మాస్యాలలోనూ, సనాతన సభలలోనూ పది సంవత్సరాల కాలం శ్రీ మలయాళ స్వాముల వారికి సేవ చేసే భాగ్యం నాకు లభించింది. శ్రీవారు ఏమి చేసినా అందులో యేదో వైలక్షణ్యం కనిపించేది శ్రద్ధతో వారిని పరిశీలించాను. ముందు ధర్మజిజ్ఞాస, తర్వాత బ్రహ్మజిజ్ఞాస అందరిచేతా వారు చేయించారు. ఇప్పుడు శ్రీవారు భౌతిక శరీరంతో లేక పోయినా ఆశ్రమరూపేణా, ఇక్కడ చేరిన ప్రజారూపేణా విశ్వవ్యాప్తమై కన్పిస్తున్నారు. వారు దయాసముద్రులు, ప్రేమ స్వరూపులు" అని చెప్పారు.

నాటి సాయంకాలం 4 గంటలకు ప్రారంభమైన ఎనిమిదవ సమ్మేళనానికి శ్రీ చిన్మయమిషన్. చిన్మయారణ్యాధ్యక్షురాలు శ్రీ శారదా ప్రియానందజీవారు అధ్యక్షత వహించారు. శ్రీమతి జె. అన్నపూర్ణగారి ప్రార్థనతో కార్యక్రమం ప్రారంభమయింది.

శ్రీ శారదా ప్రియానందగారు తమ అధ్యక్షోపన్యాసం కొనసాగిస్తూ యిలా అన్నారు—

"ఇక్కడ 3 : 1 నిష్పత్తిలో సమావేశమయిన స్త్రీ-పురుష భక్తమండలిని చూస్తే స్త్రీల అభివృద్ధి పట్ల శ్రీవారి కృషి యెంతటిదో బోధపడుతుంది హిందూ ధర్మంవల్ల సమాజం ఎలా బాగుపడుతుందో శ్రీవారు చక్కగా బోధించారు, నేను ఆంధ్రదేశంలో చిన్న చిన్న గ్రామాలకు వెళుతూ వుంటాను అక్కడ శ్రీస్వాముల వారి శిష్యులైన నారీ మణులు ఎందరో కనిపిస్తూ వుంటారు. వారిలో అనేకులు నేడు శ్రీ స్వాములవారిని గూర్చి ప్రసంగిస్తారు "

పిదప శ్రీ యోగినీ మాతాజీ (విశ్వనాధ మఠం, చింతలపూడి) ప్రసంగిస్తూ చెప్పిన మాటలివి :—



1.4.85 వ తేది యతి సమ్మేళనానికి అధ్యక్షత వహించిన పూజ్యశ్రీ రామకృష్ణానంద స్వాములవా రుపన్యసించుట.
కుడిప్రక్కన శ్రీ సిద్ధారూఢస్వామి మఠాధిపతులు పూజ్యశ్రీ శివకుమార స్వాములవారున్నారు.



"నా గురు దేవుడు" గ్రంథావిష్కరణానంతరము
పూజ్యశ్రీ దయానందస్వాములవా రుపన్యసించుచున్నారు.

"వేదిక నధిష్ఠించిన మహనీయులకు నమస్కారం. 'సహస్రశీర్షా' అన్నట్లు అసంఖ్యాకంగా ఇక్కడ చేరివున్న భక్తులకు వందనాలు.

పరమ పవిత్రమైన జ్ఞానవాహిని ఇక్కడ ప్రవహిస్తున్నది. పంద్రెండు సంవత్సరాల కొకసారి గంగా గోదావరీ పుష్కరాలు వస్తాయి. పుష్కరాల్లో స్నానం చేస్తే మూడు వందలా అరవై నదులలో స్నానం చేసిన ఫలం కలుగుతుందంటారు. ఇది మహాజ్ఞాన పుష్కరిణి ఐదు రోజులపాటు కొనసాగుతున్నది. మహామండలేశ్వరులు సాధు సత్తములు, వేలకొలది భక్తులు ఇక్కడ సమావేశమయినారు.

'చక్రపాణిని ప్రకటించు చదువు చదువు' అని ప్రహ్లాదుడన్నాడు. చావు బ్రదుకులను గూర్చి చెప్పే చదువే నిజమైన చదువు.

శ్రీ మలయాళ యతీంద్రులవారు స్త్రీ పురుష భేదం లేకుండా అందరూ తత్త్వం వినాలని మదాలస, సులభ, చూడాల, మొదలైన మహిళామణుల చరిత్రలను ఉదహరించే వారు. ఆకలి గల వారందరూ అన్నాని కధికారులే జిజ్ఞాస గలవారందరూ జ్ఞానదానాని కర్హులే. ఇందులో కులజాత్యాశ్రమాదిభేదాలతో నిమిత్తం లేదు. జిజ్ఞాస లేని వానికి ఇందులో అర్హతలేదు. మోక్షాపేక్షగల వారికందరికీ అధికారమున్నది.

రాజవిద్య, రాజగుహ్యమైన బ్రహ్మవిద్యను శ్రీవారు సులభశైలిలో చిన్న చిన్న ఉపమానాలతో, ఉపదేశాలతో బోధించారు. అట్టి మహనీయుల శతజయంత్యుత్సవాలకు హరిద్వారం, కాశీ మొదలైన పుణ్యక్షేత్రాల నుండి మహాత్ములు వచ్చారు. 'సాధూనాం దర్శనం పుణ్యం' అంటారు. ఈ పుణ్యవాహినిలో మునకవేసి వెళ్దామని నేనూ వచ్చాను ఈ "ఏర్పాట్లు చేసిన మహనీయులకు, కార్యకర్తలకు వందనాలు."

పిమ్మట శ్రీ ప్రణవమాతాజీ (రాజమండ్రి సాధుస్త్రీల మఠం అధ్యక్షురాలు) వారు ప్రసంగిస్తూ— శ్రీవారు ఆచరించి ప్రచారం చేసిన నియమాలను మనం పాటిస్తే అసంగత్వం సిద్ధిస్తుంది. వారు నిరాడంబర యతిచక్రవర్తులు. వారు చెప్పినట్లు చేయడమే వారి పూజ కాని మరేమికాదు. పదిమాటలు చెప్పేదానికన్న ఒక్క మాట చేసి చూపడమే ధర్మం" అని ప్రబోధించారు.

శ్రీసాధు శాంతిబాయమ్మగారు ఉపన్యసిస్తూ ఇలా అన్నారు—

"శ్రీ గురుదేవులు అవతరించిన పుణ్యదినాన సాధు సమ్మేళనం పెట్టు కొన్నాము. ఇది బ్రహ్మాండమైన సభ. మహాత్ములంతా ఇక్కడ చేరారు.

సాధుసాంగత్యంవల్ల పాపాలే కాదు, పాపబుద్ధి కూడా పోతుంది! నీటికోపడి చచ్చిన జంతువును తీసి వేయాలి. దానినలాగే వుంచి నీరు మాత్రం తీసిపేస్తే లాభం లేదు. పాపాలతోపాటు పాపబుద్ధిని కూడా తొలిగించాలి. త్రివిధ పాపాలను మహనీయులు పోగొడతారు. "జీవితమంతా నియమబద్ధంగా గడపవలెనన్న దశనుండే మానవత్వం ప్రారంభమగును" అని శ్రీవారు చెప్పేవారు కాలాన్ని సద్వినియోగం చేసుకోవాలని గూడ వారు పదే పదే ఉపదేశించేవారు కాబట్టి మంచి నియమాలతో జీవితకాలాన్ని సద్వినియోగం చేసుకోవాలి. మహిళా లోకాన్ని ఉద్ధరించాలన్న దృష్టితో శ్రీ గురుదేవులు కన్యాగురుకులం యేర్పాటు చేశారు. మదాలసాది నారీమణుల చరిత్రల నుదహరించి వారి లాగా తయారు కావాలని ఉద్బోధించే వారు."

శ్రీ స్వామి సిద్ధేశ్వరానందులవారు తమ ప్రసంగంలో ఇలా అన్నారు—

"అందరూ మహానుభావులే. అందరికీ వందనాలు మహాత్ముల పుట్టుక పవిత్రము. మరణమూ పవిత్రమే శ్రీ సద్గురు స్వాములవారు వైరాగ్య- శాంతి- సత్యాదులనే ఆయుధాలతో ధర్మరాజ్యం సంపాదించారు జాతి లింగాల భేదాలు పాటించకుండా అందరికీ స్వరాజ్యంలో స్థానం కల్పించారు. ఆ దైవశక్తే ఇంతమంది నిక్కడకు రప్పించింది."

శ్రీ చోడే వెంకటరమణమ్మగారు :—

"స్త్రీలోకాన్ని బ్రాహ్మణేతరవర్గాన్ని పరిరక్షించటానికై అవతరించినవారు శ్రీవారు. వారికి స్త్రీలపై ఎంతో అనుగ్రహం." "కీర్తిః శ్రీ ర్వాక్చనారీణాం స్మృతి ర్మేధా ధృతిః క్షమా" అన్నట్లు స్త్రీలకు సహజమైన ఏడు సల్లక్షణాలను రక్షించుకోనాలి" అన్నారు

శ్రీ వేణ్యానందగిరి స్వాములవారు (శ్రీనివాసాశ్రమాధిపతులు, కర్ణాటక)—

"ఈ ఉపాధి శ్రీవారి అనుగ్రహానికి పాత్రమయింది. వారి సందర్శనంతో మాకు స్ఫూర్తి కలిగేది. వారి పాదస్పర్శతో వసుంధర పుణ్యవతి అయింది. "తీర్థాని తీర్థ కుర్వంతి, క్షేత్రాణి క్షేత్రీకుర్వంతి" అన్నట్లు తీర్థాలకు తీర్థత్వాన్ని, క్షేత్రాలకు క్షేత్రత్వాన్ని చేకూర్చగల మహాత్ములు వారు. "మణౌ వజ్రసముత్కీర్ణే సూత్రస్యే వాస్తి మే గతిః" అన్న విధంగా మహాత్ముల మార్గాన్ని అనుసరిస్తే మోక్షధామం చేరుకోవచ్చు. గురువుని అనుగ్రహం లేకపోతే గమ్యం చేరలేము. సద్గురునాథుడు మనలను అనుగ్రహించుగాక!

శ్రీ వివేకానందాదేవిగారు :—

"ఏ మహాతల్లి తపః ప్రభావంవల్ల మనం యిక్కడ చేరగలిగామో, అట్టి కేరళమాతకు నా నమస్కారం. శ్రీ సద్గురు దేవుల క్రమశిక్షణ చూచి చిన్నప్పుడు 'ఏమి యింత కఠినంగా వుంటారు?' అనుకునేవారం. తర్వాత వారి శిక్షణలోని అంతర్యం అర్థమయింది. వారు మన కోసం అవతరించి జీవించారు. వారు చూపిన బాటలో నడవటం ద్వారానే వారి ఋణం మనం తీర్చుకోవాలి.

ఇది హేతువాద యుగం. మనమెందుకు యీ లోకంలోకి వచ్చామో, తెలుసుకొని ఆచరించాలి. అందుకే శ్రీవారు బ్రహ్మచారులు గృహస్థులు మొదలైన చతుర్వాశ్రమస్థులకు వారి వారి ధర్మాలేవో నిర్దేశించారు ముఖ్యముగా కౌశికుడు ధర్మవ్యాధుడు మొదలైనవారి కథలు మాటిమాటికీ చెప్పి శ్రీవారు స్త్రీలలోనూ, వెనుకబడిన వర్గాలలోనూ ఆత్మవిశ్వాసం కల్గించారు.

స్త్రీలకు భగవానుడు సహనాది గుణాలను ప్రసాదించాడు. వాటిని వృద్ధిచేసుకోవాలి, చదివించాలి. సన్మార్గంలో నడవాలి, నడిపించాలి. క్షేత్రం మంచిదికాకపోతే విత్తనాలు ఫలించవు. 'స్త్రీలు విద్యావంతులై వారి సమస్యలను వారే చక్కదిద్దుకోవాలి' అని శ్రీ వివేకానందస్వామి చెప్పారు. స్త్రీలలో శాంతి లేకపోతే మరొక ప్రపంచయుద్ధం సంభవించవచ్చు. కాబట్టి శాంతి కావాలి. సీతాదేవిలాగా ఆత్మనివేదన చేసుకోవాలి. శ్రీ సద్గురుదేవులు చూపిన బాటలో నడవాలి. వేరొక మార్గం లేదు."

కుమారి రాజరాజేశ్వరిగారు :—

"శ్రీవారు వ్యాసాశ్రమం స్థాపించడంవల్ల ఆత్మవిద్యలో బహుముఖ ప్రజ్ఞా పాటవం ఆర్జించుకొన్నారు, బ్రాహ్మణేతరులకు, స్త్రీలకు సంస్కృత విద్యాలయాలలో ప్రవేశంలేని రోజుల్లో శ్రీ స్వాములవారు తమ తపోబలముతో వారికి ప్రవేశం కలిగించారు. ఈనాడు గురవనుగ్రహంవల్ల సంస్కృత విద్యలో నిష్ణాతులై అనేకులు వివిధ సంస్థల్లో పనిచేస్తున్నారు. జిజ్ఞాస గలవారెల్లరు ఇట్టి క్షేత్రాలకు విచ్చేసి ఆత్మానందం అనుభవింతురుగాక !"

శ్రీ నిర్విషయానందస్వాములవారు :—

"ఆత్మీయులారా ! ఈ శతజయంతి ఉత్సవాలు శ్రీ సద్గురు స్మరణకై ఏర్పాటయ్యాయి. ఈ సందర్భంలో ఎంతో ఖర్చు అయింది. దీన్ని ఖర్చుగా మనం భావించరాదు. గురువులు పరమాత్మ స్వరూపులు. పరమానంద భరితులు వారి సంస్మరణతో బుద్ధి దోషాలు తొలగిపోతాయి.

శ్రీవారి చెంత నేను చిన్నతనంలోనే చేరాను. ఏ పాఠశాలలోనూ నేను చదవలేదు. అయినా గురుదేవుని అనుగ్రహంతో అనేక గ్రంథాలు వ్రాయగలిగాను గురువనగా పరమాత్మ, ఆయనను స్మరిస్తే ప్రపంచం విస్మృతి ఏర్పడి పరమ శాంతి పొందగలము."

శ్రీ పి. లలితాదేవిగారు :—

"సాక్షాత్తు వ్యాసభగవానులైన శ్రీవారికి నా మనస్సులు శ్రీవారిని గూర్చి అనేకులు తమ తమ అనుభవాలు చెప్పారు. నా అనుభవం నేను చెబుతాను

ఇదొక కుంభమేళాలాగా ఉన్నది. శారీరకంగా శ్రమపడుతున్నా భక్తులు నిశ్శబ్దంగా ఉపన్యాసాలు వింటున్నారు. వినడమేకాదు, మననం చేయాలి. అందరూ శ్రీవారి వచనాలు విన్నవారే. అనుష్ఠానమే ప్రధానము

శ్రీ స్వాములవారు 'సోమరులకెక్కడా మోక్షంలేదని. ఘోషింగారు. పురోభివృద్ధి కోరువారు పూర్వవృత్తం మరువరాదు' అని బోధించారు. పాపచింతన పోగొట్టుకోవాలి. మాత్సర్యం వదిల్తే ఇతర దుర్గుణాలు తమంతతామే వదిలిపోతాయి.



ఆఖరు యతిసమ్మేళనానికి అధ్యక్షత వహించిన పూజ్యశ్రీ విద్యాప్రకాశానందస్వాములవారు గ్రంథావిష్కరణ చేసినపిదప ఉపన్యసించుచున్నారు. ప్రక్కన శ్రీ వ్యాసాశ్రమ పీఠాధిపతులు, శ్రీ శివానందాశ్రమాధిపతులు ఆసీనులై యున్నారు.



మహామణ్డలేశ్వరులకు సన్మానం చేయుట.

ఆశ్రమానికి వచ్చినవారు వదలిపెట్టవలసినవి వదలండి! శ్రీవారి ఉపదేశ వచనాలను తీసుకుపోండి! ఎందుకంటే పథ్యం ముఖ్యమని శ్రీ స్వాములవారు చెప్పేవారు. అందరం గురుదేవుని బిడ్డలమే గృహస్థాశ్రమంలోనే అన్నీ సాధించవచ్చు. గీతాపారాయణాములు చేస్తూనే వున్నాము. ఆచరణ తక్కువ అని నా అభిప్రాయం. దానికి ప్రయత్నించాలి.

శ్రీ పి. దక్షిణామూర్తిగారు :—

లోకోద్ధారకులైన శ్రీవారి శత జయంత్యుత్సవాలను పురస్కరించుకొని సమావేశమైన భక్తులందరూ జీవిత లక్ష్య సాధనకై ప్రయత్నింతురుగాక !

'విద్యాతపోభ్యాం పూతాత్మా' అనే శ్రీవారి ఉపదేశం. జీవిత లక్ష్యసిద్ధికి విద్యాతపస్సులు రెండూ అవసరమే. తాపత్రయం నుండి విడుదల పొందాలనే త్రీవేచ్ఛ కల్గినప్పుడే కైవల్యప్రాప్తి సుకృత విశేషంవల్ల మనకు సద్గురువు లభించాడు. 'కిందుర్లభం?" అంటే 'సద్గురురేవ' అని శంకరులన్నారు. అంత దుర్లభమైనది మనకు లభించింది.

శ్రీవారి ప్రసంగాలను సామాన్యులు గూడా చదువుకోవచ్చు. జ్ఞానప్రవాహరూపమైన ప్రయాగ క్షేత్రమిది. 'అన్యక్షేత్రే కృతం పాపం పుణ్యక్షేత్రే వినశ్యతి' అన్నట్లు ఇతరత్ర మనకంటిన దోషాలు ఇక్కడ తొలగిపోతాయి. ఆత్మతత్త్వాన్ని గ్రహించి, అనుష్ఠించి దివ్యానుభూతి పొందాలి. అపుడే మన జన్మ సార్థకమవుతుంది

పిదప కుమారి కృష్ణకుమారిగారు మాట్లాడుతూ కన్యా గురుకుల స్థాపన ద్వారా స్త్రీలలో బాల్యం నుండే ఆధ్యాత్మిక శక్తిని పెంపొందించటానికి శ్రీ సద్గురు స్వాములవారు చేసిన కృషిని వివరించారు.

కుమారి రాజేశ్వరి ప్రసంగిస్తూ శ్రీవారి నామస్మరణవల్ల మనసు తదాకారాకారిత మవుతుందనీ, మహా గురువులు అజ్ఞానం తొలగిస్తారనీ అన్నారు.

శాంతి మంత్రాలతో ఎనిమిదవ యతిసమ్మేళనం నాటి రాత్రి ఎనిమిది గంటలకు పరిసమాప్త మయింది.

1-4-85 వ తేది ఉదయం 9 గం॥లకు తొమ్మిదవ ధర్మ సమ్మేళనం గీతా వాణి సంపాదకులు పూజ్యశ్రీ రామకృష్ణానందస్వాములవారి అధ్యక్షతన ప్రారంభ మయింది. శ్రీ స్వాములవారు తమ అధ్యక్షోపన్యాసంలో ఇలా అన్నారు—

"మేడపై వున్న తల్లి క్రిందికి దిగి వంగి పిల్లవాణ్ణి తీసుకుపోయినట్లు మహ నీయులు అజ్ఞాన కూపంలో పడినవారిని ఉద్ధరించడానికి దిగివస్తారు. అలాంటి వారే అవతారపురుషులు. సత్పురుషుల అవతరణమే. సమాజానికి పుష్టి, విభూతి, విశేషై శ్వర్యం. పుట్టేటప్పుడు తల్లక్రిందులుగా పుట్టినా లోకంలో జీవించేటప్పుడు ఊర్ధ్వ దృష్టి కలిగి వుండాలి "కోఽహం? కోఽహం?—నేనెవరు? నేనెవరు?" అని ఆత్మ విచారణ కలిగి వుండాలి. ఆత్మాన్వేషణ అందరికీ అందదు. ఈగ నిప్పు మీద వాలదు. మనస్సు పరమాత్మపై వాలదు. వాలితే 'యద్గత్వా ననివర్తన్తే' అన్నట్లు మళ్ళీ పునరావృత్తి వుండదు.

కృష్ణుడిది నల్లరంగు. అది పట్టుకొంటే వదలదు అందువల్ల భగవత్ప్రాప్తికై ప్రాకులాడాలి.

'స్వయంతీర్ణః పరాంస్తారయతి' అన్నట్లు శ్రీ మలయాళ స్వాములవారి వంటి మహనీయులు తాము తరించి ఇతరులని తరింప జేస్తారు. శ్రీవారికి సన్నిహితంగా వుండే భాగ్యం నాకు కలిగింది. వారు అనుష్టానానికే ప్రాధాన్యం ఇచ్చే వారు. బకా సుర సంప్రదాయం పనికిరాదు, భారతీయ సంప్రదాయం కావాలి అని చెప్పేవారు. ఈ దినం అనేకులు మాట్లాడాలి. అందువల్ల రెండు నిముషాలు మించకుండా ఒక్కొ క్కరూ మాట్లాడాలని కార్యకర్తలు కోరుతున్నారు. ఇంతకుముందు ఉపన్యసించిన వారు కొంత ఎక్కువ సమయం తీసుకోవచ్చు."

అఖిలాంధ్ర సాధుపరిషత్తు అధ్యక్షులు శ్రీ సర్వేశ్వరానందస్వాములవారు :—

"శ్రీవారు తపస్వి, యశస్వి తపసా కిల్బిషంహన్తి - తపస్సుతో పాపాప హారం చేసినవారు. దయాసాగరులు గురుదేవులకు మంగళం వారి దీవనలో సాధుపరి షత్తు వర్ధిల్లునుగాక!"

శ్రీ దయానందస్వాములవారు :— (గాగిళ్ళాపురం)

"శ్రీ సద్గురుస్వాములవారి కృపవల్ల ఈ సభ మహోజ్జ్వలంగా జరుగుతున్నది శ్రీవారు స్థూల దేహానికి ఆస్తి ఇచ్చిపోయారు. ఆశ్రమం స్థిరాస్తి, గోవులు, గేదెలు చరాస్తి అలాగే సూక్ష్మ దేహానికి కూడా "ఆత్మావాఽరే ద్రష్టవ్యః శ్రోతవ్యః మంతవ్యః నిదిధ్యాసితవ్యః" అని ప్రబోధ రూపమైన ఆస్తిని అనుగ్రహించారు. దాని వల్ల పొందగలిగిన ఆత్మజ్ఞానరూపమైన స్థిరాస్తిని ఏ కొద్ది మందో పొందారు. మనం శ్రీవారి అనుగ్రహానికి పాత్రులమై స్థిరాస్తిని పొందుదుము గాక!"

తర్వాత శ్రీ దేవానందస్వాములవారు (హృషికేశ్) కొంతసేపు సంకీర్తన చేయించారు. తపోజ్ఞానశక్తి సంపన్నులైన శ్రీ సద్గురు స్వాములవారిని సందర్శించి వారి ప్రబోధాలు శ్రవణంచేసి అనేకులు ధన్యులయ్యారని చెప్పారు శ్రీ ప్రబోధానంద స్వాములవారు (మండూరు):-

"గురువుసాక్షాత్పరబ్రహ్మమే. కృతజ్ఞతగల్గి వివేకంతో గురుసేవ చేయాలి. "యావజ్జీవం త్రయస్సేవ్యా వేదాంతో గురురీశ్వరః" అన్నట్లు గురుసేవ బ్రతికినంత కాలం చేయాలి. నాకు శ్రీవారే మంత్రోపదేశం చేశారు.

'అసంగోహ్యాయం పురుషః' అని శ్రుతి. అసంగానందస్వామీజీ కూడా పరమాత్మ స్వరూపులే. 12 సంవత్సరాలు గోగర్భంలో తపస్సు చేసి ఆంధ్రావనిలో సంచరించి తమ దివ్య ప్రబోధంతో ఎంతో మార్పుచేశారు. ఒక చిన్న కుటీరంలోనే నివసించేవారు. వారికి భోగాలులేవు, అసంగత్వాన్ని అనుభవానికి తెచ్చుకొని ఆచరించి చూపిన పుణ్యమూర్తులు వారు. మంత్రోపదేశంతో నన్ను కృతార్థుని గావించిన శ్రీ గురుదేవులకు కృతజ్ఞతాపూర్వక ప్రణామాలు."

శ్రీ ప్రసన్నానందస్వాములవారు (గండిపాళెం):-

"సర్వజ్ఞుడైన సర్వేశ్వరునికి నా నమస్కారాలు. మూతి పుట్టకముందే మేత పెట్టిన పరమాత్మకు వందనాలు. గీతపై అందరికీ ఆసక్తి పుట్టించిన శ్రీ సద్గురు స్వాములవారికి ప్రణామాలు. మహర్షి అనగా వారికే చెల్లు. బుద్ధుని అహింసా వైరాగ్యాలు, రమణమహర్షి జ్ఞానం మొదలైన శుభగుణాలన్నీ మేళవించిన సద్గురు మూర్తి శ్రీవారు. 'సర్వజీవులను ప్రేమించాలి, ఎవరిపట్లా ద్వేషం తగదు' అనేది వారి ప్రబోధ సారాంశం."

పిదప శ్రీ విరజానంద స్వాములవారు శ్రీ సద్గురు స్తుతిపరమైన పద్యాలు శ్రావ్యంగా పఠించి శ్రోతలను ఆనందింపజేశారు.

శ్రీ చిన్మయానందస్వాములవారు (షాద్ నగర్):

"అతీతవైరాగ్యం, అఖండజ్ఞానం, సమాధినిష్ఠ సర్వభూత సమభావం—అనే నాలుగు అంశాలు శ్రీవారి జీవితలక్ష్యాలు, వాటిని వారు తీవ్ర తపస్సుద్వారా సాధించారు. వారు పరిపూర్ణ సిద్ధపురుషులు."

శ్రీ బ్రహ్మానందస్వాములవారు (కేశవదాసుపాళెం):-

"యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః" అని గ్రహించిన మహామనీషి శ్రీవారు. స్త్రీ విద్యావ్యాప్తికై వారు కృషి చేశారు. అందరూ బ్రాహ్మణత్వాన్ని సాధించాలనేదే వారి ఆశయం. క్రిందివారిని పైకెత్తడమే మహాత్ముల పని. అందరూ బాగుపడాలనేదే వారి కాంక్ష."

ఆ పైన ఆంగ్లంలో ప్రసంగించిన శ్రీ దయానంద సరస్వతీస్వాములవారు [హృషీకేశ్] కోరికలు లేకుండడమే సుఖహేతువనీ, ఆనందం జీవుని సహజలక్షణ మనీ, అందుకే మానవుడు దుఃఖాతీతస్థితిని అభిలషిస్తున్నాడనీ ప్రబోధించారు.

తర్వాత 10-30 గం॥ల నుండి మధ్యాహ్నం 1 గంటవరకు వేదఘోషల మధ్య రుద్రాభిషేకం అధిష్ఠానమందిరంలో జరిగింది. సహస్రనామార్చన హోమం మొదలైన కార్యక్రమాలు విద్యుక్తంగా నిర్వర్తింపబడ్డాయి. భక్తులందరూ ఆనందంతో తిలకించారు.

దేవతలు దివినుండి ఈ మహోత్సవాలు చూచి హర్షబాష్పాలు రాల్చారా అన్నట్లు నాటి మధ్యాహ్నం ఆశ్రమ ప్రాంగణంలో చిరు జల్లులు పడ్డాయి. మధ్యాహ్నం 3 గం॥ లకు బ్రహ్మచారుల నివాస నిలయానికి తిరుమల తిరుపతి దేవస్థానముల కార్య నిర్వహణాధికారి శ్రీ యస్ లక్ష్మినారాయణగారు శంకుస్థాపన చేశారు.

పిదప 3-40 ని॥ లకు పదవ ధర్మసమ్మేళనం శ్రీకాళహస్తి శుకబ్రహ్మాశ్రమాధిపతులు శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారి అధ్యక్షతన ప్రారంభమయింది.

మొదట శ్రీ వ్యాసాశ్రమ పీఠాధిపతులు శ్రీ విద్యానందస్వాములవారు ప్రసంగిస్తూ యిలా అన్నారు—

"పరిపూర్ణ పరబ్రహ్మస్వరూపులైన పూజ్య మహాత్ములారా! ప్రియాత్మ బంధువులారా! శ్రీవారి శతజయంత్యుత్సవాలు ఏదో జరుగుతాయి అనుకొన్నాం. కాని భగవంతుని అనుగ్రహం వల్ల చాలా గొప్పగా జరిగాయి. శ్రీ సద్గురు స్వాములవారి తపఃకాలంనుండీ శ్రీ వేంకటేశ్వరుల అనుగ్రహం వుండనే వున్నది. తపః కాలంలో ఒకసారి ధారాపాతంగా వర్షం కురిస్తే గోగర్భక్షేత్రంలోని కాలువ శ్రీవారు దాటడానికి వీలుగాకుండా ప్రవహించింది. మూడు రోజులు వారికి భోజనం లేదు అప్పుడు శ్రీ వేంకటేశ్వరస్వామి ఒక భక్తునికి కలలో కనిపించి తట్టి లేపి అతనిద్వారా భోజనం పంపించాడు. ఈ విధమైన భగవదనుగ్రహం శ్రీవారిపై నాటి నుండి గమనిస్తూనే వున్నాము.

ఈ జయంత్యుత్సవ కార్యక్రమాలలో గూడా వేదిక, విద్యుద్దీపాలు, నీళ్ళ సరఫరా, మైకులు మొదలైన ఏర్పాట్లు ఏడుకొండలవాని అనుగ్రహంవల్లనే ఏర్పాటయ్యాయి. తిరుమల తిరుపతి దేవస్థానంవారు పూనుకోవడంవల్ల ఇదంతా ఇంత చక్కగా జరిగింది. దేవస్థానం కార్య నిర్వహణాధికారి శ్రీ యస్. లక్ష్మీనారాయణగారు బోర్డుసభ్యులు శ్రీ పి. వెంకటేశ్వర్లుగారు ఉత్సవాలకు ముందు వచ్చి చూచి ఈ యేర్పాట్లన్నీ చేయించారు. పైగా ఏబదివేల రూపాయలు విరాళంగూడా యిచ్చారు. అందువల్ల సభాకార్యక్రమం శుభావహంగా జరిగింది."

తరువాత దేవస్థానం కార్యనిర్వహణాధికారి శ్రీ యస్. లక్ష్మీనారాయణగారు మాట్లాడుతూ యిలా చెప్పారు- "శ్రీ స్వాములవారికి, యతీంద్రులకూ వందనాలు. ఇక్కడ మంచి పని జరుగుతున్నదని నేరుగావచ్చి చూచి గ్రహించాము. ఆశ్రమానికి చేసే సహాయం హిందూ ధర్మరక్షణకు దోహదం జేస్తుందన్న భావంతోనే బ్రహ్మ విద్యా పాఠశాలకు భవన నిర్మాణం చేయాలని నిర్ణయం చేశాము. మా గార్డెన్ సూపరింటెండెంటును పంపి పూలచెట్లు నాటించి ప్రకృతి సౌందర్యం పెంచడానికి

కూడా తోడ్పడాలనే అభిప్రాయం కలిగింది. మహాత్మాగాంధీగారిలాగా ధర్మంగా, నిజాయితీగా ఉండాలనే ఆదర్శంకల వ్యక్తులు తగ్గిపోతున్నారు. స్వాతంత్ర్య సిద్ధికి పిమ్మట త్యాగతత్త్వం అంతరించిపోతున్నది. ఋజుప్రవర్తనకల వ్యక్తులను తయారుచేసే సంస్థలలో ఈ ఆశ్రమం ఒకటి కాబట్టి హిందూధర్మ రక్షణలో ఒక భాగంగా దేవస్థానం ఆశ్రమానికి సాయం చేస్తున్నది."

తర్వాత ప్రసంగించిన శ్రీ అశేషానందస్వాములవారి ఉపన్యాస సారాంశమిది :-

"భగవదనుగ్రహంతో శ్రీ మలయాళస్వాములవారి శత జయంత్యుత్సవాలు జరుగుతున్నాయి. శ్రీకాళహస్తి శివక్షేత్రం, తిరుపతి విష్ణుక్షేత్రం. ఈ రెండు క్షేత్రాల మధ్య యిది గురుక్షేత్రం. శివ కేశవులకు భేదంలేదు. అందుకే "శివాయ విష్ణు రూపాయ శివ రూపాయ విష్ణవే" అని అంటున్నాము. ఈ అభేదతత్త్వాన్ని బోధించే గురుదేవుడు అవసరం. అట్టివారే శ్రీ సద్గురు స్వాములవారు. మూర్తి ద్వేషం పనికిరాదు.

మద్భక్తః శంకరద్వేషీ

మద్ద్వేషీ శంకర ప్రియః ।

తావుభౌ నరకం యాతో

యావచ్చంద్రా దివాకరౌ ॥

అన్నట్లు మూర్తిద్వేషులు నరకం పాలవుతారు. ఆ ద్వేషాన్ని యీ సద్గురు క్షేత్రములో వదిలేయండి !

ఈ పవిత్ర క్షేత్రం వైకుంఠమా అన్నట్లున్నది. అందుకు కారణం శ్రీవారి తపస్సు 'విద్యాతపోభ్యాం పూతాత్మా' అన్నది శ్రీవారి ముఖ్య లక్ష్యం. తపస్సు ఆసుర సంపదను నశింపజేస్తుంది. విద్య విజ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. విత్య నార్జిం

చండి! తపస్సు చేసుకోండి! నేను వెంకటగిరి నుండి ఆశ్రమానికి వచ్చి శ్రీవారి అనుగ్రహానికి పాత్రమైనాము. విషయ వాసనలను వివేక వైరాగ్యాలతో తొల గించి ప్రశాంత మనసులైనవారికి ఆనందం సిద్ధిస్తుంది."

శ్రీ నందానంద స్వాములవారు :—

"మనది త్యాగభూమి. ఇతర దేశాలలో మాటలేగాని అనుష్ఠానంలేదు. మాట్లా డటం మతం కాదు. చిలుకలు, మిషన్‌లు గూడా మాట్లాడుతాయి. మన భావన నను సరించే మనం తయారవుతాము. బలహీనుడ ననుకొంటే బలహీనుడే. బలవంతుడ ననుకొంటే బలవంతుడే. కాన, ఉత్తమ భావనతో ఉత్తమ వ్యక్తులుగా తయారు కావాలి."

శ్రీ విద్యాప్రకాశానందస్వాములవారు :—

"ఐదు దినాలనుండి ఆధ్యాత్మిక కార్యక్రమం జరుగుతున్నది. అందరి మనస్సు భక్తిరసామృతంలో మునిగింది. ఈ ఉత్సవాలలో నేడు చాలా ముఖ్య దినం. శ్రీవారు అవతరించిన దినమిదే. మహనీయులు అమూల్య విషయాలు అనేకం చెప్పారు. వాటిని అనుష్ఠానంలో పెట్టి ఆనందం పొందాలి. అందరి హృద యాలలోనూ భగవానుడున్నాడు. అయినా. అందరికీ దర్శనం కావటంలేదు. అందుకు కారణం హృదయగత దోషాలే. అవి తొలగిపోవాలి.

భక్తిలో వ్యాపారభావం పనికిరాదు. పుట్టడమే ఒక రోగం. అదే భవరోగం. అదిలేని వారు లేరు. ఈ భవబాధ తొలగటానికి సద్గురువులు దొరకరు. బుద్ధునిలాగా శ్రీ సద్గురు స్వాములవారు శ్రమపడి విజయం పొంది తమ అనుభూతిని లోకానికి ధారపోశారు. ఈ ఉత్సవాలకు దేవస్థానం సహకారం లభించింది. శ్రీ వేంకటేశ్వర సంబంధం ఇంకా తెగలేదు."

శ్రీ నిర్మలానంద స్వాములవారు :—

"గృహస్థులు, స్త్రీలు తరించే మార్గాన్ని శ్రీవారు చూపారు. చిన్నపిల్లలు గూడా బాగుపడటానికి తగిన బోధలు చేసేవారు. ఆహార విహారాలలో నియమం పాటించమని బోధించేవారు. వారి బోధలు సదా శిరోధార్యాలు."

శ్రీ ప్రణవానంద స్వాములవారు (కారంచేడు) :—

"ధర్మజ్యోతి నందించే మహాభాగ్యం కలిగిన మనం ధన్యులం స్వయంగా తరించి ఇతరులను తరింపజేసిన సిద్ధమూర్తి శ్రీ సద్గురు దేవులు. 'కిందుర్లభం సద్గురురస్తి లోకే" అన్నట్లు సద్గురువే లోకంలో దుర్లభ వస్తువు. ఆయన లభిస్తే సంసార సముద్రాన్ని సుఖంగా తరించవచ్చు. ఇలాంటి మహాపురుషులవల్లనే ఈ దేశానికి విశిష్టత సిద్ధించింది."

శ్రీ దయానంద స్వామీజీ (ఋషీకేశ్) తమ ఆంగ్ల ప్రసంగంలో ఇలా అన్నారు:—

"ఎన్నో మతాలు పుట్టాయి, ఎన్నో మతాలు నశించాయి. కాని సనాతన ధర్మానికి జనన మరణాలు లేవు. 'సనాతనస్య ఈశ్వరస్య ధర్మః- సనాతన ధర్మః' అని కానీ దీనికి విగ్రహ వాక్యం చెప్పవచ్చు. ఆద్యంతాలు లేని ధర్మమిది ఇది ఆలానికి లోబడదు. శాశ్వత సత్యాలపై శాధారపడి యున్నది. ఈ మతము ఎందరో మహాత్ములను సృష్టించింది. రాముడు, కృష్ణుడు, వ్యాసుడు. శంకరుడు మొదలైన వారందరు ఈ మత సంప్రదాయానికి చెందిన మహనీయులే. ఒక వ్యక్తి తనలోని శక్తిని ఇతరులను పంపిణీ చేయాలి. మహాత్ముడు ఇతరులను గూడ మహాత్ములను చేయగలడు. అలాంటి మహాత్ములే గురువులు. 'గు శబ్దస్త్వంధకారఃస్యాత్ - రు శబ్ద స్తన్ని రోధకః' అన్నట్లు అజ్ఞానాంధాకారాన్ని తొలగించేవారే గురువులు. హరిహర బ్రహ్మలుసత్త్వాది గుణాలతో గౌరవం పొందారు. కాని, గురువులు గుణాతీతులై గౌరవానికి పాత్రులయ్యారు, గురువు భగవంతుని కంటె తక్కువకాడు.

పిమ్మట శ్రీ విమలానంద స్వాములవారు రచించిన 'నా గురుదేవుడు' అన్న గ్రంథాన్ని శ్రీ దయానందస్వామిజీ ఆవిష్కరించాడు.



శ్రీ వ్యాసాశ్రమ కార్యదర్శి శతజయన్తి సంఘాధ్యక్షులు నగు పూజ్యశ్రీ గోవిందానందగిరి స్వాములవారికి
సంయుక్త కార్యదర్శి అసంగానంద సరస్వతి స్వామిగారు సన్మానం చేయుట.



శతజయన్త్యుత్సవ సమ్మేళనంలో పాల్గొనిన మహిళా మాతలు

తరువాత దివ్యజీవన సంఘాధ్యక్షులు శ్రీ చిదానంద స్వాములవారు ఆంగ్ల ములో ప్రసంగిస్తూ యీ విధంగా ఉద్బోధించారు :—

"అమృత స్వరూపులారా! శ్రీ సద్గురు స్వాములవారు ఒక ఆధ్యాత్మిక విభూతి. వారు తపోనిధులు. నిరాడంబరమూర్తులు. ఆధ్యాత్మిక తేజస్వరూపులు.

మనస్సుపై, ఇంద్రియాలపై విజయము సాధించిన మహాయోగి, మహా సంయమి, జ్ఞానమూర్తి శ్రీ సద్గురు స్వాములవారు, వారి జయంతీ తిథి అయిన యీ పవిత్ర సందర్భములో వారి చరణ కమలాలకు నా ప్రణామాలు అంద జేస్తున్నాను.

ఇరువదవ శతాబ్దములో, ఆధ్యాత్మికానుభూతి నశించిపోయే తరుణంలో, భౌతికవాదం, నాస్తికత పెచ్చు పెరిగిన రోజుల్లో భారత వర్షములో త్యాగ తపో విరక్తి విధులైన మహనీయులు అనేకు లవతరించారు. శ్రీ మలయాళస్వాములు దయాస్వరూపులు. నిరంకారులు. అలాంటివారుండడం వలననే లోకంలో ఇంకా దైవ విశ్వాసం నిలబడి వున్నది. ఇట్టి పుణ్యాత్ముల వద్ద భగవంతుని విషయంలో కలిగే సందేహాలన్నీ తొలగిపోతాయి.

శ్రీ వారు ఈ ప్రాంతమంతటా ఆధ్యాత్మిక తేజస్సును విస్తరింపజేశారు. వారి తపశ్చర్య అభూత పూర్వం. ఇక్కడ ప్రవేశించగానే అది మన అనుభవానికి వస్తున్నది. ఈ ప్రదేశమంతా జ్ఞానం, త్యాగం, తపస్సు, యోగనిష్ఠ, సాధన వ్యాపించి ఉన్నాయి. వారి త్యాగ తపస్సులు మిమ్ములనందరినీ ధన్యులను చేయు గాక! ఈ ప్రార్థనతో కార్యకర్తలకు నేను కృతజ్ఞతలు చెల్లిస్తున్నాను."

పై ఆంగ్ల ప్రసంగాలు రెంటింటినీ శ్రీ సముద్రాల లక్ష్మణయ్య తెలుగులో అనువదించారు.

పిమ్మట మహామండలేశ్వరులు శ్రీ అభినవ సచ్చిదానందజీ మహరాజ్. శ్రీ గణేశానందజీ మహరాజ్, శ్రీ కాశికానందజీ మహరాజ్- వీరు నలుగురూ సంగ్రహంగా ప్రసంగిస్తూ శ్రీ సద్గురు స్వాములవారికి తమ శ్రద్ధాంజలి ఘటించారు.

శ్రీ రామకృష్ణానంద స్వాములవారు (ఎల్లంపల్లి) ప్రసంగిస్తూ యిలా అన్నారు :—

"శ్రీ వారు తపః కాలములో సాధించిన తపోధనం వడ్డీ ఇప్పుడందరికీ విని యోగపడుతున్నది. 'విద్య చాలదు తపస్సు కూడ చేసినపుడే ధన్యుడవవుతావు' అని శ్రీ విమలానందస్వామికి వ్రాసిన లేఖలో శ్రీవారు తెలిపి వున్నారు. వారి జీవిత చరిత్రలో అనేక ఘటాల నుండి మనం గ్రహించవలసిన విషయాలు ఎన్నో ఉన్నాయి."

తదుపరి శ్రీ అసంగానంద సరస్వతీ స్వాములవారు అంతవరకూ జరిగిన జయంత్యుత్సవ కార్యక్రమాల నన్నిటినీ సంగ్రహంగా సమీక్షించారు. శ్రీ సముద్రాల లక్ష్మణయ్య సభా నిర్వహణలో సహకరించన మహాత్ములకు కార్యకర్తలకు, దాతలకు ఎల్లరికి కృతజ్ఞతలు తెలిపారు. శ్రీ బ్రహ్మచారి గోపాల్‌గారు యేర్పాట్లలో ఏవైనా లోటుపాట్లుంటే క్షమించమని కోరుతూ అందరికీ ధన్యవాదాలు సమర్పించారు.

ఉత్సవ సమాప్తి సందర్భంలో మహాత్ములకు సాధువులకు తగురీతి సమ్మానాలు జరిగాయి. తమ ముగింపు మాటలలో పూజ్యశ్రీ విద్యానందస్వాములవారు ఈ విధంగా అన్నారు :—

"గురుడు ఈశ్వరుడు ఒకేసారి కలిసి వస్తే గురువుకే నమస్కారమని కబీరు అన్నారు. అసలు ఈశ్వర ప్రాప్తిని కలిగించేది గురువేకదా! గురుదేవుడు త్రిమూర్త్యాత్మకుడు. ఈశ్వరుడు అదృశ్య స్వరూపుడు. గురువు దృశ్యస్వరూపుడు.

మన సద్గురుదేవుల జయంత్యుత్సవాలు ఐదు రోజులు అఖండంగా జరిగాయి. శ్రీ వేంకటేశ్వరస్వామి అనుగ్రహంవల్ల ఏ లోటు లేకుండా కార్యక్రమాలు నిర్విఘ్నంగా కొనసాగాయి. ఇందుకు సద్గురు సంకల్పబలమే మూలం.

"అందరూ సత్కర్మనిష్ఠులై, భగవద్భక్తులై, ఆత్మజ్ఞాన సంపన్నులై బ్రహ్మానందముతో విరాజిల్లుదురు గాక!"

శాంతి మంత్రాలతో, విజయ ఘోషలతో, కార్యక్రమం సాంగమంగళంగా పరిసమాప్తమయింది. నాటి రాత్రి కూర్మతీర్థ మనబడే వ్యాసాశ్రమ పుష్కరిణిలో తెప్పోత్సవం జరిగింది.

క్రీ. శ. 2001 లో జరుగనున్న శ్రీ వ్యాసాశ్రమ వజ్రోత్సవ వైభవానికి ఉవ్విళ్ళూరుతూ అసంఖ్యాకంగా ఆశ్రమంలో చేరిన జనవాహిని, ఏప్రిల్ ఒకటో తేది సాయం సమయం నుండి పాయలు పాయలుగా చీలి స్వగృహోన్ముఖమయింది.

"లోకాస్సమస్తా స్సుఖినోభవంతు"

ఓం తత్సత్ ఓం

# ఓమ్ నమో భగవతే శ్రీ మలయాళ యతీన్ద్రాయ

30-1-86 తేది మధ్యాహ్నం జరిగిన సర్వసభ్య సమావేశమునకు యాభైమూడుమంది సభ్యులు హాజరైరి. అందు—

1. 19.5 మార్చినెలాఖరు వరకు జరిగిన జమా ఖర్చుల ఆడిట్ రిపోర్టును కార్యదర్శి గోపాల్ గారు అందరిముందుంచగా సబ్జెట్ వారీగా ఖర్చుల నన్నింటిని సర్వసభ్య సమావేశము ఆమోదించినది.

2. 1985 ఏప్రిల్ నెల మొదటి నుండి 30-11-85 వరకైన జమా ఖర్చులను ఆడిట్ రిపోర్టు సభ్యుల ముందు కార్యదర్శి వుంచగా సదరు జమా ఖర్చులను సర్వసభ్య సమావేశం ఆమోదించినది.

(3) 1985 డిశంబరు మొదటి తేదీ నుండి జనవరి 30 తేదీ వరకైన జమాఖర్చులను సర్వసభ్య సమావేశం ఆమోదించినది.

సర్వసభ్య సమావేశము సాయంకాలము ఆరు గంటలకు ముగిసినది. సమావేశము ముగిసిన పిదప కార్యదర్శి గోపాల్ గారు తన కార్యదర్శి పదవికి రాజీనామా నిచ్చిరి.

ఓమ్ తత్ సత్ ఓమ్.

## Sri Sadguru Maharshi Malayala Swamulavari Satha Jayanthyustava Sangam Yerpedu : Chittoor District

### Receipts and Payments Account For the Year Ending 31-3-1984 :

| RECEIPTS | Rs. Ps. | PAYMENTS | Rs. Ps. |
|---|---|---|---|
| To Opening Balance of Cash : | | By Investments | |
| Cash on hand. | 5,889-25 | F.D. in Vysya Bank | 3,25,000-00 |
| Bank. | 11,706-30 | " Publication of | |
| " Subscriptions from | | Papers. | 35,117-25 |
| Members. | 3,29,395-00 | " Publication of | |
| " Interest. | 7,648-05 | Books. | 1,593-00 |
| " F.D. Matured | | " Postage. | 204-00 |
| Vysya Bank : | 1,00,000-00 | " Van maintenance. | 21,232-00 |

## Balance Sheet As On 31-3-1983 :

| LIABILITIES | Rs. Ps. | ASSETS | | Rs. Ps. |
|---|---|---|---|---|
| Corpus Fund | | Cash on hand. | | 5,889-25 |
| Life Membership fees. | 1,24,403.00 | Cash at Banks : | | |
| | | Andhra Bank. | 4090.60 | |
| | | Vysya Bank. | 5253.70 | |
| | | Lakshmi Vilas Bank. | 1362.00 | |
| | | Canara Bank. | 1000.00 | |
| | | | ——— | 11,706-30 |
| | | Fixed deposit Vysya Bank | | 1,00,000-00 |
| | | Excess of Expenditure over Income. | | 6,807-45 |
| Total : | 1,24,403-00 | Total : | | 1,24,403-00 |

Srivyasasramam
Dt. 19-2-84.

As Per Books Of Account Produced.

*(Sd.)* **S. GOVINDASWAMY**
*President* (Seal)

*(Sd)* **B. GOPAL**
*Secretary* (Seal)

*(Sd.)* నామా యెరుకలయ్య
*Treasurer* (Seal)

*(Sd.)* **VEERA RAGHAVAN**
*For GUPTHA & GOPI* (Seal)
*Chartered Accountants*

**Sri Sadguru Maharshi Malayala Swamulavari**
**Satha Jayanthyustava Sangam**
**Yerpedu : Chittoor Dt.,**

## Income and Expenditure Account As On 31-3-1983

| EXPENDITURE | Rs. Ps. | INCOME | Rs. Ps. |
|---|---|---|---|
| To Travelling, Stationery & Contingencies. | 8,118-75 | Interest accrued. | 1,477-30 |
| | | Excess of Expenditure Over Income | 6,807-45 |
| ,, Registration fees. | 50-00 | | |
| ,, Donations. | 116-00 | | |
| Total : | 8,284-75 | Total ' | 8,284-75 |

**Sri Sadguru Maharshi Malayala Swamulavari Satha Jayanthuastava Sangam : Yerpedu : Chittoor Dt.,**

**Receipts And Payments Account From 6-3-82 to 31-3-83**

| RECEIPTS | Rs. Ps. | PAYMENTS | Rs. Ps |
|---|---|---|---|
| To Life Membership fee | 1,24,403-00 | By Stationery. | 8,118-75 |
| "Interest accured. | 1,477-30 | ,, Registration fee. | 50-00 |
| | | ,, Donations. | 116-00 |
| | | ,, Fixed deposits | 1,00,000-00 |
| | | ,, Cash on hand. | 5,889-25 |
| | | ,, Andhra Bank | 4,090-60 |
| | | ,, Lakshmi vilas Bank. | 1,362-00 |
| | | ,, Canara Bank. | 1,000-00 |
| | | ,, Vysya Bank. | 5,253-70 |
| Total : | 1,25,880-30 | Total : | 1,25,880-30 |

Srivyasasramam
19-2-1984.

As Per Books Of Account Produced.

*(Sd.)* **S. GOVINDASWAMY**
*President* (Seal)

*(Sd.)* **B. GOPAL**
*Secretary* (Seal)

*(Sd)* నామా మొరుకలయ్య
*Treasurer* (Seal)

*(Sd.)* **VEERA RAGHAVAN**
*GUPTHA & GOPI* (Seal)
*Chartered Accountants*

| | | | |
|---|---|---|---|
| | | „ Conveyance. | 2,775-55 |
| | | „ Publication of Printing. | 1,555-80 |
| | | „ Miscellaneous Expenses. | 265-30 |
| | | „ Closing Balance of Cash | |
| | | Cash on hand | 436-40 |
| | | Bank. | 66,459-30 |
| TOTAL : | 4,54,638 60 | TOTAL : | 4,54,638-60 |

AS PER BOOKS PRODUCED.

(*Sd.*) **S. GOVINDASWAMY**
*President* (Seal)

(*Sd.*) **B. GOPAL**
*Secretary* (Seal)

(*Sd.*) నామా యెరుకలయ్య
*Treasurer* (Seal)

(*Sd.*) **V. VEERARAGHAVAN**
For *GUPTA & GOPI* (Seal)
*Chartered Accountants*

**Sri Sadguru Maharshi Malayala Swamulavari**
**Satha Jayanthyustava Sangam, Yerpedu : Chittor District**

**Income and Expenditure Account As On 31-3-1984**

| EXPENDITURE | Rs. Ps. | INCOME | Rs. Ps. |
|---|---|---|---|
| To Publication of Papers. | 35,117-25 | By Interest. | 7,648-05 |
| „ Publication of Books. | 1,593-00 | „ Excess of | |
| „ Postage. | 204-00 | Expenditure | |
| „ Van Maintenance. | 21,232-00 | Over Income. | 55,094-85 |
| „ Conveyance charges. | 2,775-55 | | |
| „ Publication & Printing. | 1,555-80 | | |
| „ Miscellaneous Expenses. | 265-30 | | |
| TOTAL : | 62.742-90 | TOTAL : | 62,742-90 |

AS PER BOOKS PRODUCED

(*Sd.*) **S. GOVINDASWAMY**
*President* (Seal)

(*Sd.*) నామా యెరుకలయ్య
*Treasurer* (Seal)

(*Sd.*) **B. GOPAL**
*Secretary* (Seal)

(*Sd.*) **V. VEERARAGHAVAN**
For *GUPTA & GOPI* (Seal)
*Chartered Accountants*

## Sri Sadguru Maharshi Malayala Swamulavari Satha Jayanthyustava Sangam Yerpedu : Chittoor District .,

### Balance Sheet As On 31 st March, 1984

| LIABILITIES | Rs Ps. | ASSETS | Rs. Ps. |
|---|---|---|---|
| Corpus Fund | 1,24,403-00 | Cash On hand. | 436-40 |
| Add : Corpus | | Cash at Banks : | 66,459-30 |
| Membership | | F. D. in Vysya | |
| fees. | 3,29,395-00 | Bank. | 3,25,000-00 |
| | 4,53,798-00 | Excess of | |
| | | Expenditure Over | |
| | | Income | |
| | | As per last | |
| | | Balance | |
| | | Sheet 6807-45 | |
| | | Add : | |
| | | For the | |
| | | year. 55094-85 | |
| | | | 61,902-30 |
| Total : | 4,53,798-00 | Total : | 4,53,798-00 |

N.B :- Interest accrued and due is not taken into account.

Srivyasasramam
19-2-1984.

As Per Books Of Account Produced.

(*Sd.*) **S. GOVINDASWAMY**
*President* (Seal)

(*Sd.*) **B. GOPAL**
*Secretary* (Seal)

(*Sd*) నామా యొరుకలయ్య
*Treasurer* (Seal)

(*Sd.*) **VEERA RAGHAVAN**
*GUPTHA & GOPI* (Seal)
*Chartered Accountants*

**Sri Sadguru Maharshi Malayala Swamulavari**
**Satha Jayanthyustava Sangam**
**Yerpedu: Chittoor District.,**

## Bank Reconciliation :

| | | Rs. Ps. |
|---|---|---|
| Bank balance as per cash book. | | 66,459-35 |
| ADD: Cheque issued but not presented payment. | 93-00 | |
| Mail transfer in Canara Bank. | 10-00 | |
| | ------ | 103-00 |
| | | 66,562-35 |
| LESS: Cheques deposited but not cleared in the Banks. | 2,433-00 | 2,433-00 |
| Balance as per Pass Books : | | 64,129 35 |

## Sri Sadguru Maharshi Malayala Swamulavari Sathajayanthusava Sangam : Yerpedu :
## Receipts and Payments Account For The Year Ending 31-3-1935

| RECEIPTS | Rs. Ps. | PAYMENTS | | Rs. Ps |
|---|---|---|---|---|
| To OPENING BALANCE : | | By PRINTING OF PUBLICATIONS : | | |
| Cash | 436 40 | | | |
| Bank | 66,459 30 | Cost of Paper | 1,52,353 92 | |
| ,, Subscriptions from | | Block making Charges. | 23,740 01 | |
| Members towards membership fees | 12,22,794 60 | Binding Charges. | 375 00 | |
| | | Printing Charges. | 1,27,005 62 | |
| ,, BUILDING FUND ACCOUNT | | Lorry freights. | 1,535 65 | |
| Cottage Construction Fund. | 4,79,700 00 | Translation charges. | 1,983 50 | |
| | | | ------------ | 3,06,993 70 |
| Gogarbha Tapovana Mandiram Construction Fund | 57,756 00 | EXPENSES : | | |
| ,, Smirithi Mandiram Sthupam Construction Fnud. | 12,396 00 | Postage | | 4,495 30 |
| | | Pooja & Panyarams | | 8,101 35 |
| ,, OTHER FUNDS : | | Printing & Stationery | | 1,076 26 |
| Hospital Fund | 2,000 00 | Motor Van Maintenance | | 17,842 01 |
| ,, Brahmavidya Patasala Fund. | 1,000 00 | Salaries to Staff | | 600 00 |

| | | |
|---|---|---|
| ,, | S. V. High School | 602 00 |
| ,, | Pooja & Biksha Fund. | 10,016 00 |
| ,, | Govardanagiri Swamy Fund | 7,000 00 |
| ,, | Kasi Students Fnud. | 10,000 00 |
| ,, | Sadguru Nityaradhana Fund. | 13,519 00 |
| ,, | Gogarbha Thapovana Nithyaradhana Fund. | 22,608 00 |
| ,, | Fund for Providing Water facilities- | 1,00,000 00 |
| ,, | OTHER RECEIPTS : | |
| | Miscellaneous Publication Sales | 1,232 50 |
| ,, | Bikshas' Collcetions | 24,437 00 |
| ,, | Delegates fees collected. | 1,03,153 00 |

| | | |
|---|---|---|
| | Pandal expenses | 61,688 50 |
| | Other miscellaneous expenses. | 37,356 00 |
| | Conveyance and other transport charges. | 26,608 35 |
| | Sadhu Satkarams etc... | 17,757 00 |
| | Arrangements and facilities to devotees. | 17,378 10 |
| | Meals and other expenses to devotees. | 2,54,867 13 |
| | Conveyance and travelling expenses to Visitors. | 12,084 44 |
| | Repairs & Renewal to Building | 28,298 00 |
| | Repairs and Cleansing charger for tanks. | 5,355 50 |
| ,, | BUILDING AND OTHER CONSTRUCTION: | |
| | Sadguru Janmasthala Mandiram Construction | 39,116 00 |

| | | | | |
|---|---|---|---|---|
| ,, | Interest received. | 29,884 69 | ,, Cottage & Building constructions | 4,17,164 00 |
| ,: | Investments matured. | 3,25,000 00 | ,, Water facilities and Tap connections | 19,949 68 |
| | | | ,, Stage construction | 8,086 00 |
| | | | ,, Expenses towards estimate and design of Smirithi Mandiram- | 1,000 00 |
| | | | ,, Investments during the year | 21,900 00 |
| | | | ,, CLOSING BALANCE : | |
| | | | Cash | 8, 934 81 |
| | | | Bank Balance | 11,73,341 45 |
| | TOTOL : | 24,89,994-49 | TOTAL : | 24,89,994-49 |

Srivyasasramam 11-1-1986.

(Sd.) S. GOVINDASWAMY
*President* (Seal)

(Sd) నామా యెరుకలయ్య
*Treasurer* (Seal)

As Extracted from Books Of Account

(Sd.) VEERA RAGHAVAN
*GUPTA & GOPI* (Seal)
*Chartered Accountants*

(Sd.) B. GOPAL
*Secretary* (Seal)

**Sri Sadguru Maharshi Malayala Swamulavari**
**Satha Jayanthyustava Sangam, Yerpedu : Chittor District**

## Income and Expenditure Account For the Year Ending31st March, 1985:

| EXPENDITURE | | Rs. Ps. | INCOME | Rs. Ps. |
|---|---|---|---|---|
| To Meals arrangements to Devotees | | 2,54,867.13 | By Biksha | 24,437 00 |
| ,, PUBLICANTION - PRINTING | | | ,, Interest Receipts | 29,884 69 |
| Cost of paper | 1,52,353 92 | | ,, Misc. Publication Sales | 1,232 50 |
| Block making Charges | 23,740 01 | | ,, Dejigates fees Collection | 1,03,153 00 |
| Building Charges | 375 00 | | ,, Value of Un-printed Publication | 3,06,993 70 |
| Printing Charges | 1,27,005 62 | | ,, Excess of Expnenditure over income | 3,06,502 75 |
| Lorry Friegnt | 1,535 65 | | | |
| Translation Charges | 1,983 50 | | | |
| | | 3,06,993 70 | | |
| ,, Postage | | 4,495 30 | | |
| ,, Pooja Dravyams | | 8,101 35 | | |
| ,, Stationery | | 1,076 26 | | |
| ,, Motor Van Maintenance | | 17,842 01 | | |
| ,, Salaries to Staff | | 600 00 | | |
| ,, Pendal Expenses | | 61,688 50 | | |

| | | | | |
|---|---|---|---|---|
| ,, | Misc. Expenses | 37,356 00 | | |
| ,, | Conveyance and Transport Charges | 26,608 35 | | |
| ,, | Sadhu Sathkarams | 17,757 00 | | |
| ,, | Facilities and other arrangements to Devotees | 17,378 10 | | |
| ,, | Conveyance and Travelling Expenses to Visitors and Devotees | 12,084 44 | | |
| ,, | Cleaning and Repair to Water Tank | 5,355 50 | | |
| | TOTAL | 7,72,203 64 | TOTAL | 7,72,203 64 |

AS PER BOOKS PRODUCED

(*Sd.*) **S. GOVINDASWAMY**
*President* (Seal)
(*Sd.*) నామా యెరుకలయ్య
*Treasurer* (Seal)

(*Sd.*) **V. VEERARAGHAVAN**
For *GUPTA & GOPI* (Seal)
*Chartered Accountants*
(*Sd.*) **B. GOPAL**
*Secretary* (Seal)

## Sri Sadguru Maharshi Malayala Swamulavari
## Satha Jayanthyustava Sangam
## Sri Vyasasaramam : Yerpedu :

### Balance Sheet As On 31 st March, 1985 :

| LIABILITIES | | Rs. Ps. | ASSETS | | Rs. Ps. |
|---|---|---|---|---|---|
| **Corpus Fund :** | | | | | |
| As per Last year Balance Sheet | 4,53,798 00 | | | | |
| During the year | 12,22,794 60 | | | | |
| | | 16,76,592 60 | Cash on Hand | 8,934 11 | |
| **Building Funds :** | | | ,, Bank | 11,73,341 54 | |
| | | | | | 11,82, 276,35 |
| Cottage Construction fund | | 4,79,700 00 | Investments during the year | | 21,900 00 |
| Gogharbha Thapovana Mandiram Constructions Fund | | 57,756 00 | **Building Contractions :** | | |
| Smirithi Mandiram Sthupam Construction Fund | | 12,396 00 | Cottage & Buildings | | 4,45,462 82 |
| | | | Sadguru Janmasthala Mandiram | | 39,116 00 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| **Other Funds:** | | Water Facilites | | | 19,949 68 |
| Hospital Fund | 2000 00 | Stage Consturctions | | | 8,086 00 |
| Brahmavidya Patasala Fund | 1,000 00 | Shrinithi Mandiram Construction | | | 1,000 00 |
| S. V. High School Fund | 612 00 | Closing Value of Un-printed publication: | | | 3,06,993 70 |
| Pooja & Biksha Fund | 10,016 00 | **Excess of Expenditure Over Income:** | | | |
| Govindanandagiri Swamy Fund | 7,000 00 | As per last year Balance Sheet | 61,902 30 | | |
| Kasi Students Fund | 10,000 00 | Add. for the year | 3,06,502 75 | | |
| Sadguru Nittyaradhana Fund | 13,519 00 | | | | 3,68,405 05 |
| Gogarbha Thapavana Nittyaradhanam Fund | 22,608 00 | | | | |
| Fund for Providing Water Facility to the Ashram | 1,00,000 00 | | | | |
| TOTAL | 23,93,189 60 | TOTAL: | | | 23,93,189 60 |

As Extracted from Books of Accounts

*For GUPTA & GOPI*
CHARTERED ACCOUNTANTS

(Sd) S. GOVINDASWAMI
President (Seal)

True Copy

(Sd.) V. VEERA RAGHAVAN
Patner

**Sri Sadguru Maharshi Malayala Swamulavari Satha Jayanthyustava Sangam**

**Sri Vyasasram**

**Bank Reconciliation Statement As On 31st March, 1985 :**

| | | | Rs. Ps. |
|---|---|---|---|
| Balance as per Cash Book | | | 11,73,341 54 |
| ADD : Cheque issued but not presented, | | | |
| Cheque No. 175814 | Rs. 1,000-00 | | |
| ,, 175817 | Rs. 6,000-00 | | |
| ,, 175818 | Rs. 10,000-00 | | |
| ,, 175820 | Rs. 6,000-00 | | |
| ,, 175819 | Rs. 10,000-00 | | |
| Excess of rupees in Bank pass Book. | Rs. 1,000-00 | | |
| | 34,000-00 | | |
| | | | 34,000 00 |
| Balance as per pass book | | | 12,07,341 54 |

BALANCE OF BANK S. B. ACCOUNT :

| | Rs. Ps. |
|---|---|
| Co-operative Town Bank, Sri Kalahasti | 5,78,711 00 |
| Vysya Bank, Sri Kalahasti | 1,29,669 00 |
| Vysya Bank, Chittoor | 2,10.493 19 |
| Andhra Bank, Yerpedu | 2,88,468 35 |
| Total : | 12,07,341 54 |

STATEMENT OF INVESTMENTS

| S.No. | Number & Date | | Amount Rs. P. | Rate | Months |
|---|---|---|---|---|---|
| 1. | 4483 | 17-1-84 | 2,000 00 | 12% | 120 |
| 2. | 4496 | 8-1-85 | 2,900 00 | 12% | 120 |
| 3, | 4502 | 19-1-85 | 10,000 00 | 12% | 120 |
| 4. | 4506 | 13-2-85 | 7,000 00 | 12% | Permanent |
| | | Total : | 21,900 00 | | |

At Extracted from Books of Accounts.

For GUPTA & GOPI
CHARTERED ACCOUNTANTS

(Sd) V. VEERARAGHAVAN
Partner

'True Copy'

## Sri Sadguru Maharshi Malayala Swamulavari
## Satha Jayanthyustava Sangam, Yerpedu : Chittor District
## Receipts and Payments Account For the Period 30-11-1985

| RECEIPTS | Rs. Ps. | PAYMENTS | | Rs. Ps. |
|---|---|---|---|---|
| To Opening Balance : | | By **Printing of Publications :** | | |
| Cash | 8,934-81 | | | |
| Bank | 11,73,341-54 | Cost of Paper | 10,594-00 | |
| „ Subscriptions from Members, | | Printing charges | 1,02,899-69 | |
| towards membership Fund | 18,977-75 | Lorry Freights | 3,724-00 | |
| „ **Building Fund :** | | | | 1,17,217-69 |
| Cottage construction fund | 78,000-00 | „ **Expenses :** | | |
| Gogarbha Thapovana Mandiram | | Postage | | 1,157-20 |
| Fund | 13,505-00 | Stationery | | 206-80 |
| „ Smirithi Mandiram Sthupam | | Motor Van Maintenance | | 1,130-82 |
| Construction Fund | 150-00 | Salaries to Staff | | 2,125-00 |
| „ **Other Funds :** | | Other Miscellaneous Charges | | 16,030-88 |
| Janmasthala Nityaradhana Fund | 4,217-00 | Conveyance and Other transport | | |
| „ Gogarbha Tapovana | | Charges | | 8,833-74 |
| Construction Receipt | 50-00 | Sadhu Sathkarams | | 23,650-85 |
| „ Interest | 36,294-45 | Meals arrangement to Devotees | | 31,358-60 |

| | | | |
|---|---|---|---|
| „ Loan from Sri Ramachandra Rao | 15,000-00 | Facilities to Devotees and Other expenses | 31,568-47 |
| „ Investments matured | 5,80,000-00 | Investments during the period | 8,93,132-00 |
| „ Delegate fee | 50-00 | White Washing and Reparis | 400-00 |
| „ Publication Sales | 3,550-75 | „ **Building Construction Expenses :** | |
| | | Cottage building construction | 1,23,855-90 |
| | | Providing of Furnitures and other items to Hospital | 22,534-31 |
| | | Audit expenses | 400-00 |
| | | „ Providing of Furnitures to Library | 6,855-00 |
| | | „ **Closing Balance :** | |
| | | Cash | 7,19 -92 |
| | | Bank | 6,49,414-92 |
| TOTAL | 19,37,071-30 | TOTAL | 19,37,071-30 |

As Extracted from Books of Accounts & Note

(*Sd.*) **S. GOVINDASWAMY**
*President* (Seal)

*Sd.*) నామా యెరుకలయ్య
*Treasurer* (Seal)

(*Sd.*) **V. VEERARAGHAVAN**
For *GUPTA & GOPI* (Seal)
*Chartered Accountants*

(*Sd.*) **B. GOPAL**
*Secretary* (Seal)

## Sri Sadguru Maharshi Malayala Swamulavari Satha Jayanthyustava Sangam : Yerpedu :

### Income and Expenditure Account As On 30th November, 1985 :

| EXPENDITURE | Rs. Ps. | | INCOME | Rs. Ps. |
|---|---|---|---|---|
| Free Distributtion of books | 1,51,944 64 | By | Interest received | 36,294 45 |
| Distributed to Ashramam | 62,025 00 | ,, | Delegates fees | 50 00 |
| Postage | 1,157 20 | ,, | Excess of expenditure over income | 2,94,086 75 |
| Stationery | 206 80 | | | |
| Motor Van Maintenance | 1,130 02 | | | |
| Salaries to Staff | 2,125 00 | | | |
| Other miscellaneous charges | 16,030 88 | | | |
| Conveyance and other Transport charges | 8,833 74 | | | |
| Sadhu Sathkarams | 23,650 85 | | | |
| Meals arrangement to Devotees | 31,358 60 | | | |
| Facilities to Devotees and other expenses | 31,568 47 | | | |
| Audit Fees | 400 00 | | | |
| TOTAL : | 3,30,431 20 | | TOTAL : | 3,30,431 20 |

Srivyasasramam 11-1-1986.

As Extracted from Books Of Accounts & Note.

*(Sd.)* **S. GOVINDASWAMY**
*President* (Seal)

*(Sd)* నామా మొరుకలయ్య
*Treasurer* (Seal)

*(Sd.)* **V. VEERA RAGHAVAN**
*GUPTA & GOPI* (Seal)
*Chartered Accountants*

*(Sd.)* **B. GOPAL**
*Secretary* (Seal)

సంఘ పబ్లికేషన్ కమిటీ **సమావేశము 27-5-84** తేది ఆదివారం రాత్రి 8 గంటలకు శ్రీ వ్యాసాశ్రమములో జరుగనున్నది.

అందు :— 1. ఆంగ్ల గ్రంథములకు పేరు నిర్ణయం.
2. యథార్థ భారతి పేర్ల నిర్ణయం.
3. తమిళం శ్రీవారి రచనల ముద్రణ & చరిత్ర రచన నిర్ణయం.
4. Pocket books నిర్ణయం.

మొదలగు అంశములు చర్చించి నిర్ణయించవలెను. కావున దయ యుంచి సభ్యులెల్లరూ సదరు సమావేశానికి హాజరు కాగోరుచున్నాను.

ఇట్లు

శ్రీ వ్యాసాశ్రమము (సం) B. గోపాల్ 20-5-84
సెక్రటరీ సీల్

సర్క్యులరు చుచినాము :—

1. అసంగానంద (సం)
2. బి. నరసింహారెడ్డి ,,
3. బి. వి. రమణయ్య ,,
4. ఏ. వెంకటప్పయ్య ,,



# ఓమ్ నమో భగవతే శ్రీ మలయాళ యతీన్ద్రాయ

27-5-84 వ తేది ఆదివారం రాత్రి 8 గంటలకు శ్రీ వ్యాసాశ్రమములో శ్రీ సద్గురు మహర్షి మలయాళ స్వాములవారి శత

జయంత్యుత్సవ సంఘ పబ్లికేషను కమిటీ సమావేశము శ్రీ అసంగా నందస్వాముల వారి అధ్యక్షతన జరిగినది. అందు ఈ క్రింది విషయములు చర్చించి నిర్ణయింపబడినది.

1. విషయము :—

ఆంగ్ల గ్రంథము రేపర్

నిర్ణయము :—

తీర్మానము :—

శుష్క వేదాంతతమో భాస్కరం ఆంగ్లానువాదము. True Knowledge అను పేరగల గ్రంథమునకు క్యాలికో బైండు చేయవలెనా లేక థిక్ ఆర్టు కార్డు బోర్డుపై శ్రీవారి వర్ణచిత్రము ముద్రించి బైండు చేసి దానిపై ప్లాస్టిక్ జాకెటు వేయవలెనా? అని శ్రీ బ్రహ్మచారి గోపాల్‌గారు ప్రతిపాదించారు. త్రివర్ణ చిత్రముతో థిక్ రేపరు ఆర్టుకార్డు బోర్డు ప్రింటుచేసి దానిపైన ప్లాస్టిక్ జాకెడ్ వేసిన బాగుండునని క్యాలికో బైండు దానిపైన జాకెట్ కంటె ఖర్చు తక్కువని శ్రీ నరసింహారెడ్డిగారు ప్రతిపాదించగా ఏకగ్రీవంగా ఆమోదించిరి.

"True Knowledge" అను గ్రంథమునకు ముఖచిత్రముగా గోగర్భములోని శ్రీవారి కలర్ ఫోటోనుగాని లేక బిల్వవృక్షపు ఫోటోనుగాని వేయుట మంచిదని అందరూ ఏకగ్రీవంగా తీర్మానించిరి.

2. విషయము :—

యథార్థ భారతి 12మాసముల రేపర్ త్రివర్ణ చిత్రముల నిర్ణయం

తీర్మానము :—

శతాబ్ది సంవత్సర సంచికల (యథార్థ భారతి) ప్రతి నెల రేపరు ఏప్రిల్ to ఏప్రిల్ శ్రీవారి చిత్రములు ఏమీ నెలకు ఏది వేయవలెనని

నిర్ణయింపుడని శ్రీ గోపాల్ గారు ప్రతిపాదించగా '84 ఏప్రిల్, మే, జూన్ నెల పత్రికలకు యిప్పుడు వేసిన త్రివర్ణ చిత్రములను ఆమోదించుచు, 84 జూలైకు శ్రీస్వాములవారి గోగర్భగుహాలో ధ్యానము, ఆగష్టులో శ్రీస్వాములవారు కుర్చీలో కూర్చుండియున్నది, సెప్టెంబరులో శ్రీవారు బిల్వవృక్షము క్రింద [సన్యాసాశ్రమ స్వీకారానంతరం] కూర్చుండి యున్నది, అక్టోబరులో శ్రీవారు గాంధీతో కూడ ఉన్నది, నవంబరులో చాతుర్మాస్యదీక్షది, డిసెంబరులో ఆశ్రమభోజనశాలలో నున్నది. జనవరిలో శ్రీవారు కేవకుంభకములో కూర్చుండి యున్నది, ఫిబ్రవరిలో కఱ్ఱ పట్టుకొని నిల్చుండి యున్నది. మార్చిలో బెడ్ మీద పండుకొని యున్నది, ఏప్రిల్ లో అధిష్టానమందిర విగ్రహమును వేసిన బాగుండునని శ్రీ అసంగానందస్వాములవారు ప్రతిపాదించగా అందరూ ఏకగ్రీవముగా ఆమోదించిరి.

3. విషయము :—

తమిళములో శ్రీవారి జీవితచరిత్ర ముద్రణ.

తీర్మానము :—

తమిళభాషలో, హిందీలో, కన్నడములో, మళయాళములో సుమారు నూరు పేజీలు యుండినట్లు శ్రీవారి జీవిత చరిత్ర వ్రాయించి ముద్రించిన బాగుండునని శ్రీ అసంగానందస్వాములవారు ప్రతిపాదించగా అందరు ఏకగ్రీవముగా అమోదించిరి.

4. విషయము :-

పాకెట్టు Books నిర్ణయము.

తీర్మానము :—

1/16 డిమ్మీ సైజులో 1. విగ్రహారాధన, 2. దేవతీర్చన 3. శీలము, 4. దైవమహిమ మొదలగు చిన్న గ్రంథములను శత

జయంతి సీరియల్స్‌గా వెంటనే ఒక్కొక్కటి అయిదు వేల కాపీలకు తగ్గకుండా ముద్రింపజేయవలయుననియు, పునర్వివాహము, బీజాంకుర న్యాయము, గురువు అవసరమా? మొదలగు పెద్ద వ్యాసములను 1/8 Crown సైజులో ఒక్కొక్కటి 5 వేల కాపీలకు తగ్గకుండా ముద్రింప జేయవలయుననియు శ్రీ గోపాల్ గారు ప్రతిపాదించగా, అందుల కందరు, ఏకగ్రీవముగా ఆమోదించిరి.

5. విషయము :—

మద్రాసు "శ్రీ కృష్ణాచిత్రా ప్రింటర్సు" కొటేషన్ పరిశీలన.

తీర్మానము :—

శ్రీ కృష్ణాచిత్రా ప్రింటర్సు వారి కొటేషన్ తెలుగు 1/8 డెమ్మీ కంపోసింగ్ పేజీ 1 కి రూ. 8. డబుల్ క్రవున్ 1/16 కంపోసింగ్ పేజి 1 కి రూ. తమిళము డెమ్మీ 1/8 పేజి 1 కి రూ. 9-00 డబుల్ క్రవును 1/16 పేజి 1 కి 7-00. రూ యిచ్చిన కొటేషను ఇది వరలో 2-11-83 వ తేది జరిగిన పబ్లికేషను కమిటీ మీటింగులో నిర్ణయించిన రేటుకు అనుకూలముగానే యున్నందున ఈ ప్రెస్సుకు, ముద్రణకు యిచ్చుటకు అందరూ ఏకగ్రీవముగా ఆమోదించిరి.

(సం.) 1. అసంగానంద
సమావేశ అధ్యక్షులు
,, 2. బి. వి. రమణయ్య
,, 3. బి. నరసింహారెడ్డి
,, 4. ఆలపాటి వెంకటప్పయ్య
,, 5. బి. గోపాల్
27-5-84

ఓమ్

# ఓమ్ నమో భగవతే శ్రీ మలయాళ యతీన్ద్రాయ

శ్రీ సద్గురు మహర్షి మలయాళ స్వాములవారి శతజయంత్యుత్సవ సంఘ సర్వసభ్య సమావేశము 8-7-1984 తేది ఆషాడ శుద్ధ దశమి ఆదివారము ఉదయం 9-30 గంటలకు శ్రీ వ్యాసాశ్రమములో సంఘాధ్యక్షులగు శ్రీ గోవిందానందగిరిస్వాముల వారి అధ్యక్షతన [సర్వసభ్యసమావేశము] జరిగినది. అందు ఇందు సంతకము చేసిన వారందరు హాజరైరి.

కార్యదర్శి తుది నివేదికలో 22-3-81 వ తేదీన సంఘము ప్రారంభించిన మొదలు నేటివరకు జరిగిన కార్యకలాపాల రిపోర్టు సభ్యులందిరికి చదివి వినిపించిరి. ఆరిపోర్టులో నేటివరకు చేరిన

| | | |
|---|---|---|
| మహా రాజపోషక సభ్యులు | — | 10 |
| రాజ పోషకులు | — | 8 |
| పోషకులు | — | 187 |
| సాధారణ సభ్యులు | — | 308 |
| మొత్తము | — | 513 |

513 గురు చేరినట్లు తెలిపిరి. రూముల నిర్మాణమునకుగాను (వారివారి పేర్లతో) పదహారుమంది పైకము పంపిరనియు, అందు ఇర్వురు పూర్తిగా చెల్లించినట్లును, మిగతావారు పార్ట్ పేమెంటు చేసినట్లును తెలిపిరి.

II ఈ రోజువరకు Bank లలో Fixed Deposit లో

| | | |
|---|---|---|
| | F D లలో | 3,25,000-00 |
| Andhra Bank | S. B. Account లో | 83,666-00 |
| Vysya Bank | S. B. Account లో | 55,246-78 |
| Canara Bank | S. B. Account లో | 6287-80 |
| Laxmi Vilas Bank | S. B. Account లో | 52-50 |
| | బాంకులలో విలువయున్న మొత్తము రూ. | 4,70,253-08 |

అనియు

III 1-4-83 నుండి 31-3-84 వరకు అయిన ఖర్చుల వివరము :

| | |
|---|---|
| పబ్లికేషన్స్ | 38.266-00 |
| Van రిపేర్ | 21,232-00 |
| Postage | 204-00 |
| **తదితర ఖర్చులు** | 3040-55 |
| మొత్తం ఖర్చు రూ. | 63,027-00 |

అనియు

1984 ఏప్రిల్ 1 వ తేదినుంచి యిప్పటివరకు

పబ్లికేషన్స్ కొరకు రూ. 32,000-00

గదుల నిర్మాణము కొరకు 30,668-00

ఖర్చు పెట్టబడినది అనియు తెలిపిరి. దీని నందరు ఆమోదించిరి.

గ్రంథ ముద్రణ :

తెలుగులో "లోకోద్ధారకులు శ్రీ మళయాళస్వాములవారు" అను బుక్ లెట్ ముద్రణ పూర్తి అయి విడుదల చేయబడినది. ఆంగ్లములో ముద్రణ పూర్తి అయి విడుదలకు సిద్ధముగా నున్నది. శుష్క-

వేదాంత తమో భాస్కరము, స్వబోధ సుధాకరము, ఆంగ్లములో ముద్రణ పూర్తి అయినవి. లోకోద్ధారకము ఈశ్వర కృప ఇంగ్లీషులో ముద్రణ ప్రారంభింపబడినది. హిందీలో శుష్క వేదాంతతమో భాస్కరము ముద్రణ పూర్తి కావచ్చినది. తెలుగులో శ్రీవారి రచన ఓంకార గ్రంధము ముద్రణ ప్రారంభింపబడినది. మొదలగు విషయములు సెక్రటరిగారు తెలియజేసిరి. మరియు గోగర్భ తపోవనమున నిర్మాణమునకు T. T. D. (వారు) మేనేజిమెంట్ కమిటీవారు తమ తీర్మానము Dated 19 - 3 - 84 లో తమ ఆమోదములను తెలియజేసిరని తెలిపిరి.

శతజయంతి కార్యక్రమమునకు 26-2-84 వ తేదీ సర్వ సభ్య సమావేశ నాలుగవ తీర్మానం ప్రకారం అందు పేర్కొనిన మహాత్ములకు ఆహ్వానములు పంపబడినవనియు ఋషీకేశ్ కైలాసాశ్రమములో మండలేశ్వర్ శ్రీశ్రీశ్రీ విద్యానందగిరిస్వాములవారు శ్రీ గిరీశానందా శ్రమాధిపతులు, శ్రీమహామండలేశ్వరు శ్రీశ్రీశ్రీ బ్రహ్మనందస్వాములవారు వచ్చుటకు తమ సమ్మతిని తెలియజేసినట్లు తెలిపిరి.

1984 మార్చి 31 వ వరకు వచ్చిన జమా ఖర్చుల ఆడిట్ రిపోర్టు సభికుల ముందు ఉంచడమైనది. అది యేకగ్రీవముగా ఆమోదించబడినది.

1, తీర్మానము :

1985 ఏప్రిల్ 10 వ తేదీ నుంచి శ్రీశ్రీశ్రీ విష్ణు దేవానంద సరస్వతీస్వాములవారి శతజయంతి ఉత్సవాలు ప్రారంభింపబడతాయని ఆచార్య మండలేశ్వరులు శ్రీశ్రీశ్రీ విద్యానందగిరిస్వాములవారు తెలియజేసినందున, వారు, వారితోపాటు తదితర మహామండలేశ్వరులు మన శతజయంతి ఉత్సవములో పాల్గొనుటకు వీలుండునట్లు

శ్రీవారి శతజయంతి ఉత్సవములు క్రోధన సంవత్సర చైత్ర శుద్ధ సప్తమితో ప్రారంభించి ఏకాదశి (జన్మదినము)తో ఐదు రోజులు నిర్వహించి పూర్తి చేయునట్లు నిర్ణయిస్తూ గత సర్వ సభ్య సమావేశ నిర్ణయములను మార్పుచేయబడినది.

2. విషయము :-

సద్గురు స్మృతి స్థూప ప్లాన్ ఆమోదము.

తీర్మానము :-

మదరాసు శిల్పవాస్తు యింజనీర్ శ్రీ యాదవ్‌గారు తయారు చేసిన సద్గురు స్మృతి స్థూప ప్లాన్ నమూనా సభ్యులందరికి చూపించబడినది. దానికి ఐదు లక్షల రూపాయలకు పైగా తొమ్మిదిలక్షల రూపాయలకు తగ్గకుండ ఖర్చు కాగలదని యింజనీరుగారు తెలిపిరని కార్యదర్శిగారు సభికులకు తెలయజేయగా అందరు ఆ ప్లాన్ బాగున్నదని అంగీకరించి యేకగ్రీవముగా ఆమోదించిరి.

విషయము :—

గోగర్భములో తపోవన నిర్మాణము ఏ పద్ధతిలో ఉండవలెను? యెంత ఖర్చు పెట్టవలెను?

3. తీర్మానము : —

గోగర్భములో నిర్మింపదలచిన తపోవనము శ్రీ వ్యాసాశ్రమ అధిష్ఠాన మందిర ముఖ్యహాలు (మధ్యహాలు) మాదిరిగా 18 × 27 అడుగులలో కొలతలకు తగ్గకుండ నిర్మించవలయుననియు, ఆర్థిక వసతిని బట్టి ప్రక్కన అచట ఉండు సాధువునకు వచ్చిపోవు అతిథులకు నాలుగు రూములకు రెండు బ్లాకులు అనగా ఒక్కొక్క బ్లాకు రెండు రూముల వంతున నిర్మించవలయునని ఏకగ్రీవముగా తీర్మానించడమైనది.

4. విషయము :-

శ్రీవారి జన్మస్థలములో నిర్మాణము:-

తీర్మానము :—

శ్రీవార్ల జన్మస్థలములో గెస్టుహౌస్ (సాధుకుటీర్) నిర్మాణమునకు అచటి స్థానిక కమిటీవారు పంపిన ప్లాన్ & ఎస్టిమేషన్ ఆమోదించడమైనది. సదరు స్థలమును శ్రీ వ్యాసాశ్రమము పేరిట దాన పత్రమును వ్రాసి రిజిష్టర్ చేసి యిచ్చుటకు వారు సమ్మతించినందున సదరు రిజిష్ట్రేషన్ చేసి యిచ్చిన వెంటనే నిర్మాణమునకు అగు పైకమును వారికి యిచ్చి వారినే నిర్మాణమును చేయవలసినదిగా కోరుచూ ఏకగ్రీవముగా తీర్మానించడమైనది.

మధ్యాహ్నము పన్నెండు గంటలైనందున భోజన నిమిత్తం సమావేశం మధ్యాహ్నం 2-30 గంటలకు వాయిదా వేయబడినది.

మధ్యాహ్నం భోజనానంతరం మరల సర్వసభ్యసమావేశము గం॥ 2-45 నిముషాలకు ప్రారంభమైనది. శ్రీ గోవిందస్వాముల వారు అధ్యక్షత వహించిరి. అందు క్రింది తీర్మానములు చేయబడినవి.

విషయము :—

క్లెప్టెన్ ఆనందరాజుగారు సభల కార్యక్రమమును ఐదు రోజులకు బదులుగా మూడు రోజులలోనే ముగించవలయునను ప్రతిపాదనను నిర్ణయించుట.

5. తీర్మానము :-

శతజయంతి కార్యక్రమములు మరల జరుపుటకు అవకాశములు మన జీవితములో రావు. కాబట్టి అందరు సర్వవిధముల సంపూర్ణ సహకారము సేవలు చేసి ఐదు రోజులు జరుపుటకు నిశ్చయించబడినది.

విషయము :-

బడ్జెట్.

6. తీర్మానము :-

ఈ క్రింది ఉదహరించబడిన రీతిగా శతజయంతికి పైకమును వసూలుచేసి ఖర్చుపెట్టుటకు తీర్మానించడమైనది.

| | | ఖర్చు |
|---|---|---|
| A. | గోగర్భ నిర్మాణం | రు. 2,00,000 |
| B. | జన్మస్థలములో | 38,000 |
| C. | స్మృతిమందిర స్థూపము | 10,00,000 |
| D. | జనరల్ షెడ్ | 1,00,000 |
| E. | టెంకాయ కీతులతో రూములు | 25,000 |
| F. | సమాధి మందిరము రంగులు | 50,000 |
| C. | ఆశ్రమము వెల్లవేతలు | 25,000 |
| H. | మంచినీటి సౌకర్యము | 75,000 |
| I. | విద్యుద్దీపాలు – జనరేటర్ | 40,000 |
| J. | భోజన వసతులు | 3,00,000 |
| K. | మహాత్ములకు ఛార్జీలు – సన్మానము (యాభై వేలు) | 50,000 |
| L. | గ్రంథ ముద్రణ (తెలుగు-ఇంగ్లీషు-హిందీ) | 3,00,000 |
| M. | లాకెట్సు వగైరా | 50,000 |
| N. | కాలెండర్సు | 10,000 |
| O. | ప్యాకెట్–కాలెండర్ | 5,000 |
| P. | హాఫ్‌సెట్ – ఫోటోలు (త్రైకలర్) | 25,000 |
| Q. | హాస్పిటల్ ఎక్విప్‌మెంట్సు & Fund | 2,00,000 |
| R. | విశేష సంచికలు | 1,00,000 |
| S. | సన్మాన సంచిక | 5000 |
| T. | గ్రంథాలయం | 1,00,000 |

మొత్తము ఇరవై ఆరు లక్షలతొంభై ఎనిమిది వేలు 26,98,000

విషయము :—

శతజయంతి సంచికలో దాతల ఫోటోల ముద్రణ.

7. తీర్మానము :—

| | |
|---|---|
| మహారాజ పోషకులకు | ఫుల్ పేజీ |
| రాజ పోషకులకు | అర్థ పేజీ |
| వెయ్యినూటపదహారు | పాతిక పేజి |
| ఐదు వందల పదహారు | 1/6 పేజీ ఫోటోలు |

ముద్రించుటకు తీర్మానించడమైనది.

విషయము :—

సద్గురు మంత్రజపము (లిఖితజపము)

తీర్మానం :—

'ఓం నమో భగవతే శ్రీ మలయాళ యతీంద్రాయ' అను సద్గురు దివ్యనామ మంత్రమును వ్రాయుటకు తీసిన పుస్తకములు నోట్ బుక్స్ అచ్చు వేయించి సప్లై చేయుటకు [ఒక కోటి వ్రాయించుటకు] తీర్మానించబడినది.

8. విషయము :—

నూటపదహారుకు తక్కువ మొత్తాలు ఇచ్చే దాతల ద్రవ్యం యెలా స్వీకరించాలి.

8. తీర్మానం :—

నూటపదహారు రూపాయలకు తక్కువ పైకము తీసికొనవచ్చుననియు అయితే యిరవై ఐదు రూపాయలకు తక్కువ మొత్తాలను స్వీకరించరాదని సదరు మొత్తమునకు సద్గురు స్థూప నిర్మాణము క్రింద రసీదు యివ్వవచ్చుననియు ఏకగ్రీవముగా తీర్మానించడమైనది.

9. తీర్మానము :—

బడ్జెట్ యిరవై ఏడు లక్షల రూపాయల ఖర్చు అవసరమని

తీర్మానించినందున సదరు పైకమును వెంటనే వసూలు చేయుటకు ప్రతి జిల్లాలో తిరుగుటకుగాను లోగడ యెన్నుకొనిన ఆయా జిల్లాల సభ్యులు తీవ్ర కృషి చేయవలసినదిగా విజ్ఞప్తి చేస్తూ తీర్మానించడమైనది.

(సం) 1. S. గోవిందస్వామి
అధ్యక్షులు

" 2. B. గోపాల్
కార్యదర్శి 8-7-84

3. అసంగానంద
4. కె. కృష్ణమూర్తి
5. ... . .......
6. ........ .. .......
7. నాగళ్ళ లింగమూర్తి
8. కోపూరి చిన వెంకట్రామయ్య
9. శృంగవరపు వేణుగోపాలరావు
10. టి....... ... . .
11. నామా ఏరుకలయ్య
12. జి. లక్ష్మీనారాయణ
13. .. ......... . .
14. కె. జి. కృష్ణమూర్తి
15. టి. సుబ్బయ్యశెట్టి
16. పరబ్రహ్మానందస్వామి వ్రాలు
17. ఇ. జగన్నాధరెడ్డి
18. వి. రామయ్య
19. పబ్బతి వెంకటసుబ్బయ్య
20. ఇ. వెంకటరమణప్ప
21. ..................
22. ............. ....
23. చిట్టూరి సూర్యకాంతం
24. శృంగవరపు సావిత్రమ్మ
25. పాలడుగు అన్నపూర్ణమ్మ
26. ముప్పాళ్ళ శేషమ్మ
27. బొప్పన సీతారామయ్య
28. సాధు విరక్తిబాయి
29. కె. వసంతమ్మ
30. ఎడ్ల దమయంతి
31. అరుగొండ రామచంద్రయ్య
32. బి. సుబ్రహ్మణ్యం
33. ....... ........
34. వై. ఉపేంద్రనాథ్
35. సి. రామచంద్రారెడ్డి
36. ఆనంద్ రాజ్
37. పి. కుమారస్వామి
38. పి. రామంంద్రన్
39. పాలకూరి వెంకట్రామన్
40. వేముల సోమయ్య నెల్లకుదురు
41. అప్పలూరి రత్తాయమ్మ
42. వి. ఆర్. వెంకట్రామన్

43. ఆలపాటి వెంకటప్పయ్య వ్రాలు
44. ఎస్. నారాయణచరణం
45. కె. ఎ. కుమార్‌సింగ్ (కేరళ)
46. చలిగాడి జ్వాలాకృష్ణయ్య
47. అనుమాలశెట్టి సుబ్బరామయ్య
48. సన్నారెడ్డి సుందరరామిరెడ్డి
49. రాజశేఖరానందగిరి
50. స్వామి శ్రద్ధానంద
51. మాధవానందస్వామి
52. నెల్లూరు పుల్లమ్మ
53. రామకృష్ణానందస్వామి
54. ఎ. ఎస్. క్రిష్ణయ్యశెట్టి
55. ఎ. రంగనాధ్
56. నేరెళ్ళ వీరయ్య
57. గాధంశెట్టి సుబ్రమణ్యం
58. తాటెంపూడి నాగాచ్యుతమ్మ
59. టి. పరమేశ్వరమ్మ
60. టి. తిరుపతయ్య
61. జాస్తి వసుంధరాదేవి
62. ఈడ్పుగంటి సీతారామమ్మ
63. కడియాల అన్నపూర్ణమ్మ
64. పార్లపల్లి కాంతమ్మ
65. తుమ్మల క్రిష్ణమ్మ
66. అక్కినేని నారాయణమ్మ వ్రాలు
67. ఎ. జయమ్మగారు.
68. పేలాల లక్ష్మమ్మ
69. యం. వెంకటసుబ్బమ్మ
70. ఎ. పద్మావతమ్మ
71. చోడే వెంకటరమణమ్మ
72. కళ్ళత్తూరు శ్రీదేవమ్మ
73. దొడ్ల చెల్లెమ్మ
74. ఎ. కుప్పమ్మ
75. గంటా నరసింహులు
76. కొండా వెంకటరెడ్డి
77. సాధు రామకోటి
78. పొన్నేరి పద్మావతమ్మ
79. శాంతమ్మ
80. లక్ష్మమ్మ
81. శ్రీ ప్రశాంతానందగిరి
82. ఈదర వెంకటసుబ్బమ్మ
83. ఎ. స్వర్ణలతమ్మ
84. వైనంబాక హైమావతమ్మ
85. ఐ. యశోదమ్మ
86. పి. జానకమ్మ
87. కె. రమాదేవి
88. సాధు నారాయణస్వామి
89. సావిత్రమ్మ
90. పోశవరం సుబ్బమ్మ
91. ఎన్. కుప్పమ్మ
92. రుద్రపాటి వెంకటనరసింహరాజు
93. రుద్రరాజు సూర్యకాంతమ్మ వ్రాలు
94. కడుంపల్లి కృష్ణారెడ్డి
95. శ్రీ నారాయణానందగిరిస్వాములు
96. పొక్కాళి పద్మావతమ్మ
97. టి. రామయ్యశెట్టి
98. చింతా బాలమ్మ
99. కేశవులుశెట్టి
100. ఎస్. లక్ష్మయ్య
101. మాతా సచ్చిదానంద
102. కోకా అండాళమ్మ

ఓం

శ్రీ వ్యాసాశ్రమము
15-8-84

శ్రీ సద్గురు మహర్షి మలయాళస్వాములవారి శత జయంత్యుత్సవ సంఘ పబ్లికేషన్ కమిటి సమావేశము. 2-9-84 వ తేది ఆదివారము ఉదయము 10 గంటలకు శ్రీ వ్యాసాశ్రమములో జరుగును.

అందు— (1) శ్రీ గోవిందస్వాములవారి సన్మాన సంచిక యెన్ని కాపీలు ముద్రించాలి?

(2) శత జయంతి సంచిక యెన్ని కాపీలు ముద్రించాలి? నిర్ణయించుట.

(3) ఇంతవరకు జరిగిన ముద్రణను గురించిన సమీక్ష, తదితరములు.

కావున సభ్యులెల్లరు తప్పక హాజరు కాగోరుచున్నాను.

ఇట్లు
బి. గోపాల్
కార్యదర్శి

శ్రీ వ్యాసాశ్రమము
15-8-84

సర్క్యులర్ చూచినాము :-

1. ఆలపాటి వెంకటప్పయ్య
2. బి. వి. నరసింహారావు
3. అసంగానంద



# ఓమ్ నమో భగవతే శ్రీ మలయాళ యతీన్ద్రాయ

1984 సం॥ము సెప్టెంబరు నెల 2 వ తేది ఆదివారం ఉదయము 10 గం॥లకు శ్రీ వ్యాసాశ్రమములో శతజయంత్యుత్సవ పబ్లికేషన్ కమిటి సమావేశము శ్రీశ్రీశ్రీ విద్యానందస్వాములవారి అధ్యక్షతన జరుపబడినది. అందు యీ విషయాలు చర్చించబడినవి.

1. విషయము :-

శ్రీ గోవిందానందగిరిస్వాముల వారి సన్మాన సంచిక యెన్ని కాపీలు ముద్రించవలెను?

తీర్మానము :-

ఒక వెయ్యి కాపీలు ముద్రించిన బాగుండునని శ్రీ గోపాల్ గారు ప్రతిపాదించగా అందరు ఏకగ్రీవముగా ఆమోదించిరి.

2. విషయము :-

శ్రీ శతజయంతి స్మారక సంచిక యెన్ని కాపీలు ముద్రించవలె నను విషయము నిర్ణయించుట.

తీర్మానము :-

3 వేలు ముద్రించిన బాగుండునని, శ్రీ స్వామి అసంగానంద సరస్వతిగారు ప్రతిపాదించగా, శ్రీ గోపాల్ గారు సాధారణ సభ్యులు

మొదలు మహారాజ పోషకుల వరకు అందరికి ఒక్కొక్క ప్రతి ఉచితముగా యివ్వవలసియుండును కాబట్టి అందరికొరకై రెండు వేల కాపీలు తప్పని సరిగా కావలసియుండును- మిగతావి ఉత్సవాలలో అమ్మకమునకు, ముఖ్య అతిథులకు యిచ్చుటకు వెయ్యి కాపీలు చాల వనియు కావున ఐదు వేల కాపీలు వేసిన బాగుండునని తెలుపగా శ్రీ నరసింహారెడ్డిగారు శ్రీ వెంకటప్పయ్యగారు 5 వేల కాపీలు అవసరము వుండవచ్చునని తెలుపగా ముందు వెనుకలు చర్చించిన మీదట 5 వేల కాపీలు వేయుటకు ఏకగ్రీవముగా తీర్మానించిరి.

3 విషయము :—

ఇంతవరకు జరిగిన ముద్రణ సమీక్షం.

కార్యదర్శిగారు యింతవరకు ముద్రణ అయిన వాటిని వివరిస్తూ "లోకోద్ధారకులు శ్రీ మలయాళస్వాములవారు" తెలుగు 15 వేల కాపీలు, ఇంగ్లీషులో 5 వేల కాపీలు ముద్రణ అయినవనియు, సెంటనరీ స్టాంపులు (50 వేలు) ముద్రణ అయినవనియు, ఇంగ్లీషులో "శుష్క వేదాంతతమో భాస్కరము," "స్వబోధసుదాకరము," ముద్రణ పూర్తి అయినవనియు, "ఈశ్వరకృప," "లోకోద్ధారకము," ముద్రణలో యున్నవనియు, తెలుగులో "నా గురుదేవుడు" ముద్రణ పూర్తి గావచ్చినదనియు, "ఓంకారం" ముద్రణ మదరాసులో జరుగుచున్నదనియు తెలియజేసిరి— లోకోద్ధారకులు శ్రీ మలయాళ స్వాముల వారు అను ప్రచురణకు మలయాళ అనువాదము సిద్ధమైనదనియు, కన్నడము, తమిళము, హిందీ భాషలలోనికి అనువాదము జరుగుచున్నదనియు తెలిపిరి. శ్రీ సద్గురు స్వాములవారి జీవితచరిత్ర సంగ్రహాముగా వంద పేజీలలో క్రౌన్ 1/8 సైజులో అన్ని భాషలలో ముద్రించిన బాగుండుననియు కార్యదర్శిగారు ప్రతిపాదన

చేయగా అందరూ అందులకు అంగీకరించి దానికి తగిన ఏర్పాట్లు చేయుటకు కార్యదర్శిగారికి అధికారమిచ్చిరి.

(సం) 1. విద్యానందస్వామి,
సమావేశ అధ్యక్షులు
" 2. బి. గోపాల్
" 3. బి. నరసింహారెడ్డి
" ఆలపాటి వెంకటప్పయ్య
" 5. అసంగానంద

ఓం

# ఓమ్ నమో భగవతే శ్రీ మలయాళ యతీన్ద్రాయ

30-9-84 వ తేదీ ఆదివారము పదిగంటలకు శ్రీసద్గురు మహర్షి మలయాళ స్వాములవారి శతజయంత్యుత్సవ సంఘ కార్యనిర్వాహక వర్గ (సంఘు) సమావేశం శ్రీ గోవిందస్వాములవారి అధ్యక్షతన శ్రీ వ్యాసాశ్రమములో జరిగినది. అందు ఈ క్రింది తీర్మానాలు చేయబడినవి.

1. తీర్మానం :—

విశ్వయతి సమ్మేళనమునకు వచ్చు యతులకు చార్జీలు, సన్మానములు, T. T. D. హిందూ ధర్మరక్షణ సంస్థ నుండి అడిగిన బాగుండునని శ్రీ బ్రహ్మచారి గోపాల్‌గారు ప్రతిపాదించగా దానికి బదులు సదరు శతజయంత్యుత్సవాలకు పందిళ్ళు, సభ పందిళ్ళు, వాని అలంకరణ, మైకులు, ఎలక్ట్రిక్ లైట్లు, వాటర్ సప్లయి చేసే టాంకు లారీలు T. T. D. హిందూ ధర్మరక్షణ సంస్థ నుండి కోరవలెననియు,

అక్లే సదరు ఉత్సవాన్ని వీడియో తీయమని, సదరు వీడియో కాపీలను రెండింటిని శ్రీ వ్యాసాశ్రమాని కివ్వమని కోరవలెననియు, అక్లే సదరు ఉత్సవానికి వచ్చు ప్రతినిధులకుగాను T. T. D. వారే తిరుపతి లోని మూడవ సత్రములో 50 గదులను ఆ ఐదు రోజులు ఫ్రీగా ఇవ్వమనియు, కోరిన బాగుండునని శ్రీ కె. రాధాక్రిష్ణయ్యగారు ప్రతిపాదించగా దానికందఱు ఏకగ్రీవంగా ఆమోదించిరి. దానిని వలయు ప్రయత్నాన్ని చేయు అధికారమును కార్యనిర్వాహకవర్గ సభ్యులు శ్రీ పి. వెంకటేశ్వర్లుగారికి యిచ్చి ఆ పనిని వారికప్పజెప్పడమైనది.

2. తీర్మానం :—

శతజయంతికి వలయు వడ్లు, పప్పులు, వగైరా సరకులు కొనుగోలు చేయుటకు ఒక 'కొనుగోలు కమిటీని' ఏర్పాటు చేయవలెనని కార్యదర్శి శ్రీ గోపాల్ గారు ప్రతిపాదించగా అందుకు 1. చలువాది జ్వాలాకృష్ణయ్యగారు 2. అయితా సుబ్బరాయులుగారు, 3. సాధు రామకోటిస్వామిగారు 4 శతజయంతి కార్యదర్శి బి. గోపాల్ గారు 5. కె. జి. కృష్ణమూర్తిగారిని నియమిస్తూ అవసరమైతే యెవరినైనా కో ఆప్టు చేసే అధికారం కార్యదర్శిగారికి ఇవ్వడమైనది. నాలుగువందల బస్తాల బియ్యం కావాలి. కాన 800 బస్తాలు వడ్లు కొనిన బాగుండునని శ్రీ పి. వెంకటేశ్వర్లుగారు ప్రతిపాదించగా అందరూ ఆమోదించిరి.

3. తీర్మానం :—

కేరళ శ్రీవారి జన్మస్థలములో జరుగు నిర్మాణమునకు శతజయంతి సంఘము యిచ్చు పైకము ఖర్చు పెట్టుటకు శతజయంతి సంఘ సభ్యులగు కుమారసింగ్, వేలప్పన్ లకు అధికారం ఇవ్వడమైనది.

4. తీర్మానం :—

మహామండలేశ్వరులను, మఠాధిపతులను ఆహ్వానించుటకు

కార్యదర్శి బ్రహ్మచారి గోపాల్ నేరుగా వెళ్ళి ఆహ్వానించవలసినదిగా తీర్మానించడమైనది.

5. తీర్మానం :—

27-3-84 వ తేది శ్రీవారి ఆంగ్ల తేది జన్మదినం గాన ఆరోజు శతజయంతి ప్రారంభిస్తే బాగుండునని పూజ్య శ్రీ చిదానందస్వాముల వారు తెలిపినట్లు శ్రీ అసంగానందస్వాములవారు ప్రతిపాదించగా ఆరోజు అనగా 27-3-84 వ తేదీ సాయంకాలం శ్రీవారి స్టాంపులను ప్రభుత్వం ముద్రిస్తే వాని విడుదల రూపంలో కార్యక్రమము నాడు పెట్టాలని తీర్మానించిరి.

6. తీర్మానం :—

ఇంతవరకు వసూలైన పైకము మొత్తము యెనిమిది లక్షలు దాటలేదు కాన విశేషంగా ప్రయత్నించి అందుకని యిక వరుసగా వసూళ్ళ కమిటీ అన్ని జిల్లాలు తిరుగవలెనని కోరడమైనది.

7. తీర్మానం :—

విశేష సంచికలను 5000 కాపీలను ముద్రించవలయుననియు తీర్మానించడమైనది.

8. తీర్మానం :

శ్రీవారి పోస్టల్ స్టాంపు ముద్రణ విషయములో తగు ప్రయత్నం చేయు అధికారము శ్రీ పి రామచంద్రారెడ్డితోటి, కె. రాధాకృష్ణయ్యగారికిన్ని అప్పగించడమైనది.

(సం) S. గోవిందస్వామి
ప్రెసిడెంట్
బి. గోపాల్
కార్యదర్శి సీలు

హాజరైనవారు :—

3. విద్యానందస్వామి
4. కె. రాధాకృష్ణయ్య
5. అరుగొండ రామచంద్రయ్య
వేగుళ్ళ జానకిరామయ్య
6 చిట్టూరి సత్యనారాయణ
7. ఎస్. లక్ష్మణయ్య
8. గుజ్జ భూమయ్య
9. దయానందస్వామి
10. పి. వెంకటేశ్వర్లు
సాధు రామకోటిస్వామి
బి. నరసింహారెడ్డి
ఆలపాటి వెంకటప్పయ్యగారు
పి సామ్రాజ్యము
11. అసంగానంద
12. చోడే వెంకటరమణమ్మ
కోశా ఆండాలమ్మ
ముపాళ్ళ శేషమ్మ
13. కె. కృష్ణమూర్తి
14. వై. ఉపేంద్రనాథ్
15. రామచంద్రరెడ్డి
16. గాదంశెట్టి సుబ్రమణ్యం
17. పి. కుమారస్వామి
18. ఎ. జి. కృష్ణయ్యశెట్టి
19. కె. జి. కృష్ణమూర్తి
20. ఎస్. లక్ష్మణమ్మ
21. నామా ఎరుకలయ్య
22. బొప్పన సీతారామమ్మ
23. పి. అన్నపూర్ణమ్మ
24. ఎ. వివేకానందదేవి
25. తులసి వెంకటసుబ్బయ్య
26. పి. ఎస్. చంద్రశేఖర్
27. పెంటపాటి లలితాదేవి
28. ప్రణవానందస్వామి
29. గంగాలక్ష్మి నారాయణ



# ఓమ్ నమో భగవతే శ్రీ మలయాళ యతీన్ద్రాయ

12-10-84వ తేదీ శుక్రవారం ఉదయం 10 గం॥ లకు శత జయన్త్యుత్సవ కొనుగోలు కమిటీ సమావేశము నెల్లూరు అన్నదాన సమాజమునందు బ్రహ్మచారి గోపాల్‌గారి అధ్యక్షతన జరిగినది అందు—

(1) 30-9-84 వ తేదీ జరిగిన కార్యనిర్వాహకవర్గ సమావేశము లోని రెండవ తీర్మానం ప్రకారం కొనుగోలు సంఘంలో వేగుళ్ళ జానకిరామయ్యగారిని కూడ సభ్యులుగా కోఆప్టు చేసికోవడమైనది.

(2) వడ్లు ధరలు త్వరలో పెరుగు అవకాశం హెచ్చుగా నున్నందున వెంటనే మంచి వడ్లు చూచి కొనుగోలు చేయడం అవసర మని శ్రీ అయితా సుబ్బరాయులుగారు ప్రతిపాదించగా దానికందరు ఏకగ్రీవంగా ఆమోదించి, రైతులవద్ద, మిల్లులో, ధాన్యపు కొట్లలోను సన్న మొలగొలుకుల ధరలు వెంటనే కొటేషన్ తీసుక రావలసినదిగా శ్రీసాధు రామ కోటారెడ్డిగారిని కోరడమైనది. 21-10-84 వ తేదీ ఆదివారం ధాన్యం కొనుగోలు నిర్ణయ నిమిత్తం శ్రీవ్యాసాశ్రమములో కమిటీ సమావేశం కావలయుననియు ఆ లోపల ధాన్యం శాంపిల్స్, కొటేషన్లు (ధరలు) తేవలయుననియు తీర్మానించడమైనది.

(సం) బి. గోపాల్

12-11-84

„ అయితా సుబ్బరాయులు

„ కె. జి. కృష్ణమూర్తి

„ సాధురామకోటరెడ్డి

ఓమ్

# ఓమ్ నమో భగవతే శ్రీ మలయాళ యతీన్ద్రాయ

21-10-84 వ తేదీ ఆదివారం శతజయంత్యుత్సవ సంఘ కొను గోలు కమిటీ సమావేశం మధ్యాహ్నం 4 గం॥ లకు శ్రీవ్యాసాశ్రమంలో జరిగినది. శ్రీ వేగుళ్ళ జానకిరామయ్యగారు, శ్రీ బి. గోపాల్ గారు

హాజరైరి కూటము లేనందున సమావేశం వాయిదా వేయబడినది. 9-11-84 వ తేదీ మరుసమావేశంగా నిర్ణయింప బడినది.

(సం) బి. గోపాల్

21-10-84

వేగుళ్ళ జానకిరామయ్య వ్రాలు

ఓమ్

# ఓం నమో భగవతే శ్రీ మలయాళ యతీన్ద్రాయ

9-11-84 వ తేదీ ఉదయం 10 గం॥ లకు శతజయంత్యుత్సవ సంఘ, కొనుగోలు సంఘ సమావేశము శ్రీ వ్యాసాశ్రమములో జరుగును. కావున కొనుగోలు సంఘ సభ్యులగు తాము సదరు సమావేశమునకు హాజరు కాగోరుచున్నాము.

ఇట్లు
బి. గోపాల్

ఈ సర్క్యులర్ చూచినాము :—

1. వేగుళ్ళ జానకిరామయ్య వ్రాలు
2. సాధు రామకోటి రెడ్డిగారు

Note :-

1. చలువాది జ్వాలా కృష్ణయ్యగారికి,
2. శ్రీ అయితా సుబ్బరాయులుగారికి
3. శ్రీ జి. కె. కృష్ణమూర్తిగారికి పోస్టుద్వారా తెలుపబడినది.



# ఓమ్ నమో భగవతే శ్రీ మలయాళ యతీన్ద్రాయ

9-11-84 వ తేదీ శుక్రవారం ఉదయం పదిగంటలకు శ్రీ వ్యాసాశ్రమం శతజయన్తి కమిటీ కొనుగోలు సంఘ సమావేశం శ్రీ గోవింద స్వాములవారి అధ్యక్షతన జరిగినది. అందీ క్రింది నిర్ణయములు గైకొనబడినవి.

వడ్లు కొనుగోలు :-

శతజయంత్యుత్సవములో భోజనాలకు వడ్లు కొనుగోలు విషయములో ఎచట కొనడం, ఏవి కొనడం అని నిర్ణయించుట.

1. తీర్మానం :

శతజయంతికి భోజనాలకు నెల్లూరు అసలు సన్న మొలగొలుకులు కొనవలయుననియు, అవి లభించనిచో గవర్నమెంట్ నెం॥ 74 సన్న మొలగొలుకులు కొనవలయుననియు సభ్యులందరు చర్చించి ఏకగ్రీవముగా నిర్ణయించిరి.

2. తీర్మానం:

శ్రీ సాధు రామకోటి రెడ్డిగారు తెచ్చిన 74 నె॥ మొలగొలుకుల ధరల కొటేషన్‌లు పరిశీలించబడెను. అసలు సన్న మొలగొలుకులు కొనడమే తగుననియు కాని అసలు మొలగొలుకులు 20 పుట్లు అనగా 220 బస్తాలు మాత్రమే శ్రీ పెళ్ళకూరు రామచంద్రా రెడ్డిగారి వద్ద మాత్రమే గలవనియు, మరెక్కడా లేవనియు, శ్రీ రామకోటారెడ్డి

గారు తెలుపగా శ్రీ పెళ్ళకూరి రామచంద్రారెడ్డిగారి వద్ద నున్న అసలు సన్న మొలగొలుకులు మొత్తం ఇరవై పుట్లు కొనవలయునని ఏక గ్రీవముగా నిర్ణయింపబడెను.

నెంబరు 74 సన్న మొలగొలుకులు గౌర్నమెంటు మొలగొలుకులు కొటేషన్‌లు (1) ఎడ్లపల్లి శ్రీనివాసరావు, సుధాకర్ అండ్ కో నెల్లూరు (2) రంగా & కంపెనీ నెల్లూరు (3) శ్రీనివాసా ట్రేడర్స్ నెల్లూరు (4) ప్రతాప్ ట్రేడర్స్ నెల్లూరు (5) ధనలక్ష్మి రైస్ కంపెనీ నెల్లూరు వారి కొటేషన్‌లు పరిశీలించి తక్కువధర పుట్టి ఒకటికి 1500 రూపాయలు వున్నందున సదరు పుట్టి ఒకటికి 1500 రూ॥ ధరనే నిర్ణయిస్తూ ఆ ధరకు 74 నంబరు సన్నమొలగొలుకులు అసలు సన్న మొల గొలుకులు పెళ్ళకూరి వారివద్ద వున్నవి పోను మిగతా 10 పుట్లు నెంబరు 74 ను కొనమని ఏకగ్రీవంగా తీర్మానిస్తూ సదరు కొనుగోలు పని శ్రీ సాధు రామకోటి రెడ్డిగారికి అప్పజెప్పడమైనది.

3. విస్తళ్లు కొనుగోలు :

శతజయన్తికి భోజనాలకు కావలసిన విస్తళ్లు కొనుగోలు.

4. తీర్మానము :

రానున్న శతజయన్తి ఉత్సవములకు భోజనములకు విస్తళ్లు కారంచేడు ఆశ్రమ ప్రతిష్ట సమయంలో వాడనవి పెద్దవిగా చాలా బాగుగా వున్నందున అవి కొనిన బాగుండునని బి. గోపాల్‌గారు ప్రతిపాదించగా అందరూ ఏకగ్రీవంగా ఆమోదించి వాని ధరలు యితర త్ర ధరలు విచారించి ధరలు యోగ్యంగా వుంటే కారంచేడు ఆశ్రమ వారు తీసిన ఆకులనే కొను అధికారము శ్రీ సాధు రామకోటిరెడ్డి గారికి యివ్వబడినది.

[సం] 1. S. గోవిందస్వామి
ప్రెసిడెంట్

2. బి. గోపాల్
   సెక్రటరీ 9-11-84
3. వేగుళ్ళజానకిరామయ్యగ్రాలు
4. సాధు రామకోటిరెడ్డి
5. కె. జి. కృష్ణమూర్తి
6. అయితా సుబ్బరాయులు



# ఓమ్ నమో భగవతే శ్రీ మలయాళ యతీన్ద్రాయ

శతజయంతి భవన నిర్మాణము పని పరిశీలన కొరకు శతజయం త్యుత్సవ సంఘ భవన నిర్మాణ సంఘ సమావేశము 19 11-84 వ తేది గురువారం ఉదయం 10 గంటలకు శ్రీ వ్యాసా శమములో జరుగును. కావున సదరు సంఘ సభ్యులగు మీరందరు సదరు సమావేశమునకు రాగోరుచున్నాము.

ఇట్లు
బి. గోపాల్
9-10-84

సర్క్యులర్ చూచినాము :—
1) వేగుళ్ళ జానకిరామయ్య
2) చిట్టూరి. సత్యనారాయణ గ్రాలు.

Note :

ఈ సర్క్యులర్ లోని విషయం ఉత్తరాల ద్వారా
1. శ్రీ పరానందస్వాముల వారికి

2. శ్రీ జె. రఘుపతిరావుగారికి
3. శ్రీ కె. కృష్ణమూర్తిగారికి తెలుపడమైనది.

ఓం

# ఓమ్ నమో భగవతే శ్రీ మలయాళ యతీన్ద్రాయ

శత జయంత్యుత్సవ సంఘ పబ్లికేషన్ కమిటీ సమావేశము 14-11-84 వ తేది బుధవారము ఉదయం 11 గంటలకు శ్రీ అసంగానందస్వాములవారి అధ్యక్షతన జరిగినది. అందీ క్రింది తీర్మానములు చేయబడినవి.

1. సమీక్ష :-

ఇంతవరకు పబ్లికేషన్ కమిటీలో చేసిన తీర్మానములన్నింటిని కార్యదర్శిగారు సమీక్షించి తెలిపిరి. అందు 17-8-84 వ తేది సమావేశములో జరిపిన ఆరు తీర్మానములలో 6 వ తీర్మానము మాత్రము అమలు జరుపబడినదనియు 29-2-84 వ నాటి సమావేశంలో నాల్గు తీర్మానములు చేయగా అందు మొదటి తీర్మానము అమలు చేయ బడింది అనియు 27-5-84 వ నాటి సమావేశంలో అయిదు తీర్మానములు చేయగా అందు ఒకటి, రెండు 5 వ తీర్మానాలు అమలులోనికి వచ్చినవి అనియు 2-9-84 న జరిగిన సమావేశంలో రెండు తీర్మానాలు చేయగా ఆ రెండు యింకను అమలు చేయలేదని వివరించిరి.

2. శ్రీ గోవిందస్వాములవారి సన్మాన సంచిక :—

పూజ్య శ్రీ గోవిందస్వాములవారి సన్మాన సంచిక యెన్ని పేజీలుండాలి అని నిర్ణయించుట.

తీర్మానము :—

సన్మాన సంచిక 160 పేజీలకు తగ్గకుండా 200 పేజీలకు మించ

కుండా ఫోటోలతో కలిపి వుండవలయునని శ్రీ అసంగానందస్వాముల వారు ప్రతిపాదించగా అందరూ ఆమోదించిరి.

3. "నా గురుదేవుడు" :—

గ్రంథము ముఖచిత్రమును నిర్ణయించుట.

తీర్మానము :—

నా గురుదేవుడు గ్రంథమునకు శ్రీ విమలానందస్వాములవారు శ్రీవారి అధిష్ఠాన మందిరములో పూజ చేస్తున్నట్లున్న ఫోటోను త్రివర్ణములతో ముఖచిత్రంగా వేసిన బాగుండునని శ్రీ గోపాల్ గారు ప్రతిపాదించగా అందరూ ఏకగ్రీవంగా ఆమోదించిరి.

(సం) 1. అసంగానంద
సమావేశ అధ్యక్షులు
2. గోపాల్
14-11-84
3. ఆలపాటి వెంకటప్పయ్య
4. బి. నరసింహారెడ్డి

ఓమ్

# ఓం నమో భగవతే శ్రీ మలయాళ యతీన్ద్రాయ

6 – 1 – 1985 వ తేది ఆదివారము ఉదయం 10 గంటలా 30 నిమిషాలకు శ్రీ సద్గురు మహర్షి మలయాళస్వాములవారి శత జయంత్యుత్సవ సంఘ కార్యనిర్వాహకవర్గ సమావేశము శ్రీశ్రీ గోవిన్దానందస్వాములవారి అధ్యక్షతన శ్రీ వ్యాసాశ్రమం బ్రహ్మవిద్యా

పాఠశాలలో జరిగినది. అందీ క్రింది విషయములు చర్చించి నిర్ణయించ బడినవి :-

1. విషయము :-

వసూళ్ళు.

తీర్మానం :-

ఇప్పటికి Bank లో S. B. లో అన్ని బ్యాంకులలోను యిప్పటి వరకు ఖర్చులు పోను 6,81,615-40 పై.

F. D. లలో 2,25,000-00

Total = 9,06,615-40

మాత్రముంది. మన బడ్జెట్ 70 లక్షుల నుండి తగ్గించి 30 లక్షులు వేసుకొన్నాము. కాని అంత కూడ వసూళ్ళు కాలేదు. కాబట్టి సభ్యులు తగు శ్రద్ధ చూపి తీవ్రంగా వసూళ్లు ప్రారంభించాలని కారుణ్యానందస్వాములవారు గోదావరి జిల్లాలకు ఆశ్రమము నుండి యెవరినైన పంపితే ధాన్యం వసూళ్ళు చేస్తామని వ్రాసినారని గోపాల్ గారు తెలుపగా ఉభయ గోదావరి వసూళ్ళకు శ్రీ ప్రణవానందస్వాముల వారు; శ్రీ కారుణ్యానందస్వాములు, శ్రీ రాజశేఖరానందస్వాముల వారు, శ్రీ లలితమ్మగార్లతో కలసి అచటికి ఆయిల్ పోసు కొనిగాని, లేక అద్దెకుగాని బండి, జీపు తీసికొని వసూళ్ళు ప్రారంభించాలని; శ్రీ పరిపూర్ణానందస్వాములవారు, వగైరా, కర్నూలు, మహబూబు నగర్ జిల్లాల వసూళ్లు వారి పాటికి వారు చేయాలని నిర్ణయించబడినది. అట్లే శ్రీ నిర్మలానందస్వాములవారు, శ్రీ మాధవానంద స్వాములవారు, శ్రీ ధనమ్మగారు (గూడవల్లై) శ్రీ రాజరత్నమ్మ గారు, శ్రీ సావిత్రమ్మగారు, శ్రీ ఆత్మానందస్వాములవారు వగైరా కృష్ణా గుంటూరు జిల్లాలలో ధాన్యం వగైరా వసూళ్ళు చేయాలని నిర్ణయింపబడినది.

2. విషయము :—

సభ్యులకు డెలిగేట్ పాసులు, సభ్యులు కాని డెలిగేట్ ఎట్లా నిర్ణయము.

తీర్మానము :-

A. మహారాజ పోషకులకు డెలిగేట్ పాసులు యెన్ని యివ్వాలి అని కార్యదర్శిగారు అడుగగా పదివేలు రూపాయలిచ్చిన మహారాజ పోషకులకు పది డెలిగేట్ యివ్వవచ్చునని శ్రీ పి. కుమారస్వామిగారు ప్రతిపాదించగా అందరూ దానికి ఏకగ్రీవముగా ఆమోదించి తీర్మానించ బడినది.

B. రాజ పోషకులు :-

ఐదు వేల రూ. యిచ్చిన వ్యక్తికి ఐదు డెలిగేట్లు యివ్వవచ్చునని శ్రీ లలితమ్మగారు ప్రతిపాదించగా యిందుకు అందరూ ఏకగ్రీవముగా ఆమోదించిరి.

C. పోషకులకు :—

వెయ్యిన్నినూట పదహారు రూ. యిచ్చిన వారికి మూడు డెలిగేట్లు యివ్వవచ్చునని శ్రీ మాధవానందస్వాములవారు ప్రతిపాదించగా అందుకు యందురూ ఏకగ్రీవంగా ఆమోదించిరి.

D. అయిదు వందలు యిచ్చిన వారికి రెండు డెలిగెట్లు యివ్వవచ్చుననియు తీర్మానించబడినది.

E. నూటపదహారు రూ. యిచ్చిన వారికి ఒక డెలిగేటుగా నిర్ణయించబడినది.

సభ్యులు కాని వారికి :—

పై విధంగా సమాజ సభ్యులుగా చేరని వారికి కేవలం డెలిగెట్టుగా యెంత యుంచాలి? ఈ డెలిగేట్టుకు ఐదు రోజులు భోజన

వసతి. సభలో పాల్గొనడము వసతినిచ్చి (నివాస వసతి మాత్రము గ్యారంటీ లేదు) పద్ధతిలో డెలిగేటు యెంత ఫీజు కట్టాలి యని కార్యదర్శి అడుగగా రూ. 50/- డెలిగేట్ ఫీజు చెల్లించాలనియు నిర్ణయించి వీరికి సావనీర్ ఉచితంగా లేదనియు వారు సావనీర్ కొనుగోలు చేయవలయునని తీర్మానించడమైనది.

3. విషయము :-

A. మహారాజ పోషకులు, రాజపోషకులు, పోషకులు, సాధారణ సభ్యులకు యుచితంగా ఏమేమి యివ్వాలి?

తీర్మానము :-

మహారాజ పోషకులకు ఉచితంగా (Free) శతజయంతి సంఘము వేసిన యన్ని గ్రంథములు క్యాలండర్లు, లాకెట్లు సంచులు, వగైరా అన్ని యివ్వవలయునని గోపాల్‌గారు ప్రతిపాదించగా యందులకందరు ఏకగ్రీవంగా ఆమోదించిరి.

B. ఐదు వేల రూ. యిచ్చిన రాజపోషకులకు ఆంగ్ల గ్రంథములు తప్ప మిగత అన్ని ఉచితంగా (Free) గా యిచ్చునట్లు తీర్మానించడమైనది.

C. వెయ్యిన్నినూట పదహారు రూ. యిచ్చిన పోషకులకు, జీవిత చరిత్ర, లోకాద్ధారకులు, BooK pet, (యితర గ్రంథాలు లేదు) సావనీరు క్యాలండరు, లాకెట్టు, సంచి, వగైరా అన్ని ఒక్కొక్కటి యివ్వవలయునని తీర్మానించడమైనది.

D. ఐదు వందలు యిచ్చిన సాధారణ సభ్యులకు చరిత్ర తప్ప మిగత పోషకులకు వలె Book pet సావనీరు స్టిక్కరు, లాకెట్టు, క్యాలెండరు, సంచి, Freeగా యివ్వవలయునని తీర్మానించడమైనది.

E నూటపదహారు రూపాయలు ఇచ్చిన వారికి సావనీరు, సంచి, క్యాలండరు ఒక్కొక్కటి Freeగా ఇవ్వ తీర్మానించడమైనది.

F. 50 రూపాయలిచ్చిన డెలిగేట్లుకు Freeగా ఏమీ లాదు, సావనీరు వగైరా యన్ని కొనుకొనవలయును.

Note :

శతజయంతి రూములు నిర్మించిన వారికి ఐదు డెలిగేట్లు freeగా ఒక్కొక్క రూముకు ఇవ్వవలయుననియు, ఐదు వేలు యిచ్చిన వారికి, యిచ్చువాని వలె గ్రంథములు వగైరా freeగా యిచ్చునట్లు తీర్మానించబడినది.

మధ్యాహ్నము భోజన సమయము అయినందున సమావేశం మధ్యాహ్నము 3 గం॥లకు వాయిదా వేయబడినది.

గోపాల్.

మధ్యాహ్నము 3 గం॥లకు మరల సమావేశము ప్రారంభమైనది.

4. విషయము :-

జన్మస్థలము మరియు గోగర్భ తపోవనములో నిత్యపూజలకు నిధి.

తీర్మానం :—

తిరుమల గోగర్భతపోవన నిత్యపూజా నిధిని వసూళ్ళు చేసి యుంచి దానిని Co- op. బ్యాంకులో శాశ్వత నిధిగా యుంచి దాని పైన వచ్చే వడ్డితో గోగర్భ నిత్యకార్యక్రమాలు అచ్చట యుండే సాధువుగారికి భోజనాదులు, ఖర్చు ఏర్పరచిన బాగుండునని శ్రీ గోపాల్ గారు ప్రతిపాదించగా, అందు కందరు ఏకగ్రీవముగా ఆమోదించిరి.

16

అన్లో శ్రీవారి జన్మస్థలములో నిత్యపూజలకు నిధి వసూలు చేసి దానిని మూలధనముగా కో-ఆప్టు బ్యాంకులో వుంచి దానిపై వచ్చు వడ్డీతో నిత్యపూజ ఏర్పరచిన బాగుండునని శ్రీ గోపాల్ గారు ప్రతిపాదించగా యందుల కందరు ఏకగ్రీవంగా ఆమోదించిరి.

5. విషయము :-

గోగర్భం, తపోవన ప్లాను ఆమోదం.

తీర్మానం :—

తిరుమల గోగర్భ క్షేత్రము శ్రీవారు తపస్సు చేసిన చోట నిర్మించదలంచిన తపోవన హాలు ప్లానును చూచి యందరు ఏకగ్రీవంగా ఆమోదించిరి.

6. విషయము :-

శ్రీ సద్గురు స్థూప ప్లాను ఆమోదము.

తీర్మానం :—

శ్రీ సద్గురు స్థూప ప్లాను మద్రాసు ఇంజనీరుగారి ప్లాను శ్రీ రఘుపతి ఇంజనీరుగారి ప్లాను రెండింటిని పరిశీలించడమైనది. రెండింటి యెస్టిమేషన్ వచ్చిన పిదప, శ్రీశ్రీశ్రీ విద్యానందస్వాముల వారు శ్రీ గోవిందస్వాములవారు, నిర్మాణ కమటీవారు కలసి నిర్ణయించునట్లు వారికి అధికారమివ్వడమైనది.

7. విషయము :—

జనరల్ షెడ్డు నిర్మాణము ఆయం ఆమోదము.

తీర్మానం :

జనరల్ షెడ్డు, 71 అడుగు 7 1/4 అంగుళము పొడవు, 18 అడుగుల వెడల్పుతో షెడ్డు నిర్మాణానికి ఆమోదము ఏకగ్రీవముగా చేయడమైనది.

8. విషయము :-

వంటవాళ్ల ఏర్పాట్లు, వంట ఏర్పాట్లు-

తీర్మానం :—

వంటవాళ్లు ఏర్పాటు, పచ్చళ్ళు పెట్టడము మొదలగు భోజన అవసర సామానులు తయారు చేయుటకు శ్రీ కె. జి. కృష్ణమూర్తి గారు శ్రీ ఎతా సుబ్బరాయులుగారు, శ్రీ నెల్లూరు పుల్లమ్మగార్లకు అధికారమిస్తూ, యింకేవరైన అవసరమనుకుంటే మరెవరినైన కో-ఆప్టు చేసుకొనే అధికారము వారికివ్వడమైనది.

9. విషయము :

శతజయంతి అకౌంట్లు.

తీర్మానము :

శతజయంతి అకౌంట్సు జమా ఖర్చులు, రసీదులు వగైరా ఆఫీసు పని వ్రాయించడము శ్రీ చలువాది జ్వాలాకృష్ణయ్యగారికి అప్పగించునట్లు శ్రీ జ్వాలాకృష్ణయ్యగారు గోపాల్‌గారికి ఈ విషయములో సహకారముగా వుండునట్లు అంగీకరించడమైనది. కో ఆప్టు టౌన్ బ్యాంకులో ప్రారంభించిన S B A/c ఆమోదింపబడెను. ముద్రణ విషయములో శ్రీవారి జీవిత చరిత్ర సంగ్రహముగా తెలుగులో ముద్రణ, లోకోద్ధారకులు శ్రీ మలయాళస్వాములవారు అను బుక్‌లెట్సు తమిళము, హిందీ, కన్నడము, మలయాళము భాషలో ముద్రణ పూర్తిగావచ్చినది. శ్రీవారి జీవిత చరిత్ర హిందీలో ముద్రణ ప్రారంభమైనది. లోకోద్ధారకము, గురుభక్తి ప్రభావము తెలుగులో ముద్రణ ప్రారంభమైనది. నా గురుదేవుడు, ఓంకారము ముద్రణ పూర్తి అయినది. లాకెటులకు స్టిక్కర్లకు ఆర్డర్ యివ్వడమైనది అను కార్యదర్శి గారి రిపోర్టును ఆమోదించడమైనది.

సభా కార్యక్రమం వగైరాలు మాఘమాసం గురుపూజా జనాలల్లో జరిపే కార్యవర్గ సమావేశంలో నిర్ణయింపబడును. ఇంతటితో సమావేశం పూర్తి కావింపబడినది.

(సం) 1. S. గోవిందస్వామి
ప్రెసిడెంట్

2. బి. గోపాల్
కార్యదర్శి

3. విద్యానందస్వామి
4: పరానందస్వామి
5. ప్రణవానంద
6. నాగిళ్ళ లింగమూర్తి
7. కె. జి. కృష్ణమూర్తి
8. సదానందబ్రహ్మచారి
9. కె. కృష్ణమూర్తి
10. ఎ. ఎస్. క్రిష్ణయ్యశెట్టి
11. పి. రామచంద్రన్
12. అసంగానంద
13. వై. ఉపేంద్రనాథ్
14. తులసి వెంకటసుబ్బయ్యా
15. పి. కుమారస్వామి
16. గుజ్జ భూమయ్యా
17. ముద్రంశెట్టి విశ్వనాథం
18. పి.రామచంద్రారెడ్డి
19. ఎస్. లక్ష్మయ్యా
20. పి. సీతారామమ్మ
21. పి. అన్నపూర్ణమ్మ
22. చిట్టూరి సత్యనారాయణ
23, గాదుశెట్టి సుబ్రహ్మణ్యం
24. నామా యెరుకలయ్యా
25. గంగా లక్ష్మీనారాయణ
26. ఎస్. వెంకటేశ్వరరావు
27. పి. ఎస్. చంద్రశేఖర్
28. చోడే వెంకటరమణమ్మ

ఓమ్

# ఓమ్ నమో భగవతే శ్రీ మలయాళ యతీన్ద్రాయ

6-1-1985 వ తేది ఆదివారము సాయంత్రము 5 గంటలా 45 నిమిషాలకు శతజయన్తి ఉత్సవ సంఘు కొనుగోలు కమిటీ (ప్రై్రైవేజు

కమిటీ) ఈ సమావేశం శ్రీ గోవిందానన్ద స్వాములవారి అధ్యక్షతన జరిగినది.

1. విషయము :—

విస్తళ్లు కొనుగోలు

తీర్మానము :

విస్తళ్లు పొదలకూరులో నూరు ఆకులు మంచివి 8 రూ. అని శ్రీ అయితా సుబ్బరాయులుగారు, రాపూరు సైడులో విస్తళ్లు వంద ఆకు 6 రూపాయలు కాని ఆకు చిన్నది. రంధ్రములు కలిగియుండును. బాగుగా వుండదనియు శ్రీ రామకోటిరెడ్డిగారు తెల్పిరి. శ్రీ ప్రణవానంద స్వాములవారు నూరు ఆకులు మంచిది శుద్ధంగా వుండేది శ్రీశైలము దగ్గర మున్ననూరులో 5 1/2 రూపాయలుగా వున్నదనియు తెలిపిరి. అన్ని ఆకుల ధరలు పరిశీలించి మున్ననూరు ఆకునే కొనవలయునని తీర్మానించబడెను.

2. విషయము :-

నిమ్మకాయలు పచ్చళ్ళకు, చింతకాయలు.

తీర్మానము :—

పచ్చళ్ళకు నిమ్మకాయలు, చింతకాయలు ధరలు పరిశీలించి కొనుగోలుచేసి త్వరగా పచ్చళ్లు పెట్టునట్లు తీర్మానించబడినది.

3. విషయము :-

వడ్లు 74 నంబరు.

తీర్మానము :-

74 వ నెంబరు మొలగొలుకులు పుట్టి ఒకటికి 1700 లకు శ్రీ పెళ్ళకూరి రామచంద్రారెడ్డిగారి వద్దే కొనుగోలు చేయవలెనని తీర్మానించబడినది.

4. శతజయన్తి ఆఫీసుకు యినుప బీరువాల కొటేషన్‌లు పరిశీలించి బీరువాలు రెండు, కుర్చీలు రెండు కొనుటకు కార్యదర్శికి అధికారమివ్వడమైనది, పప్పులు, వగైరా ధరలు కొటేషన్‌లు ఫిబ్రవరిలో తీసుకొని అప్పుడు కమిటీ సమావేశం జరగాలని నిర్ణయించ బడినది.

(సం) 1. గోవిందస్వామి 4. చలువాది జ్వాలాకృష్ణయ్య
2. కె. జి. కృష్ణమూర్తి 5. బి. గోపాల్
3. అయితా సుబ్బరాయులు 6. సాధు రామకోటిరెడ్డి



# ఓమ్ నమో భగవతే శ్రీ మలయాళ యతీన్ద్రాయ

6-1-1985 వ తేది ఆదివారం సాయంకాలం 7 గంటలకు శత జయన్తి ఉత్సవ భవన నిర్మాణ సంఘ సమావేశం శ్రీ వ్యాసాశ్రమ ములో శ్రీ గోవిందస్వాములవారి అధ్యక్షతన జరిగినది. అందు క్రింది విషయములు చర్చించి నిర్ణయించబడినది.

1) రూముల కట్టడం పనులు ఇంతవరకు జరిగినదానిని శ్రీ జానకి రామయ్యగారు వివరించినారు. జనరల్ షెడ్డు 71 అడుగుల పొడవు, 18 అడుగుల వెడల్పుతో వేయాలని పిల్లర్స్ పోసి పైన పైపుల ట్రెస్సులు చుట్టూ 4 1/2 అంగుళాల సిమెంటు గోడల కట్టుడు, పైన కప్పు జింకు రేకులు వేయవలసినదిగా తీర్మానించడ మైనది.

2) వేగిస కట్టు తిరుపతి కాళహస్తి, నగరి కొటేషన్‌లు పరిశీలించి నగరి రామస్వామయర్ కొటేషన్ల ధరనే స్థిరపరచి నగరిలో కట్టు కొని కొయించుటనట్లు తీర్మానించడమైనది.

(సం) ఎస్. గోవిందస్వామి

1. పరానన్దస్వామి
2. కె. కృష్ణమూర్తి
3. జె. సి. రఘుపతి
4. వేగుళ్ళ జానకిరామయ్య
5. బి. గోపాల్



# ఓమ్ నమో భగవతే శ్రీ మలయాళ యతీన్ద్రాయ

**6-2-1985** వ తేది బుధవారం ఉదయం 10 గంటలకు శ్రీసద్గురు మహర్షి మలయాళ స్వాములవారి శతజయన్తి ఉత్సవ సంఘ కార్య నిర్వాహకవర్గ సమావేశం శ్రీ గోవిందస్వాములవారి అధ్యక్షతన జరిగినది.

1. విషయము :—

కార్యక్రమ నిర్ణయము.

తీర్మానము :—

కార్యక్రమ నిర్ణయము ఎవరెవరికి ఏమి యివ్వాలి వగైరా నిర్ణయమును శ్రీ స్వాములవారు, శ్రీ సముద్రాల లక్ష్మణయ్య, శ్రీ గోపాల్‌గారు కలిసి నిర్ణయించవలసినదిగా తీర్మానిస్తూ ఏకగ్రీవ ముగా తీర్మానించబడ్డది.

2. విషయము :-

27 వ తేది కార్యక్రమ ప్రారంభం.

తీర్మానము: —

మార్చి 27 వ తేది శ్రీవారు జన్మించిన ఆంగ్ల తేదీ కావున ఆనాడు శతజయంతి కార్యక్రమము పెట్టిన బాగుండునని పూజ్యశ్రీ చిదానంద స్వాములవారు తెలిపినందున ఎలా చేయాలి అని చర్చ రాగా 27 వ తేది ఆస్పత్రి ప్రారంభోత్సవము చేయాలని అందరూ ఏకగ్రీవంగా నిర్ణయించిరి. ఆస్పత్రి ప్రారంభోత్సవము శ్రీ చిదానంద స్వాములవారిచేత చేయించవలసినదిగా తీర్మానించబడినది.

3. విషయము :-

సభాపందిరి నివాస రూములు.

తీర్మానము :-

సభాపందిరి స్వర్ణోత్సవాలకు వేసిన జాగాలోనే వేయ నిర్ణయింప బడినది. నివాస రూములు లక్ష్మీనిలయం వెనుక ఖాళీ జాగాలోను వేసి మిగిలిన షెడ్లు ఎచటెచట ఖాళీ మరియు అనుకూలముగా వుంటే అచట వేయాలని తీర్మానించడమైనది.

4. విషయము :-

పందిళ్లు, తాత్కాలిక షెడ్లు నిర్మాణము.

తీర్మానము :-

సభాపందిళ్లు తాత్కాలిక షెడ్లు నిర్మాణము కెప్టెన్ ఆనంద రాజుగారికి అప్పజెప్పడమైనది.

5. విషయము :-

వడ్డన

తీర్మానము :-

నెల్లూరు పుల్లమ్మ, బొప్పన సీతా రామమ్మ, కొట్టడి కృష్ణమూర్తి గుజ్జభూమయ్యగారిల ఆధ్వర్యంలో జరుగాలని తీర్మానించడమైనది.

6. విషయం :-

Store సాధువులవంట.

తీర్మానము :—

సాధు సత్కార్యము, సేవ శ్రీ ప్రణవానంద సరస్వతి సదానంద బ్రహ్మచారి గార్లు వారికి కావలసినవారి సహకారము తీసుకొని చేయునట్లు తీర్మానించడమైనది.

7. విషయము :-

సభా నిర్వహణ, అలంకరణ వగైరా.

తీర్మానము :—

శ్రీ సముద్రాల లక్ష్మణయ్య, శ్రీ నిర్మలానందస్వామి, శ్రీ అసంగానందస్వామి, శ్రీ రఘుపతి, శ్రీ గోపాల్‌గార్లు సభానిర్వహణ చూచునట్లు తీర్మానించడమైనది.

8. విషయము :-

శానిటేషన్.

తీర్మాణం :-

శ్రీ పి. కుమారస్వామిగారు తగిన శానిటరీ వారిని ఏర్పాటు చేయునట్లు తీర్మానించడమైనది. కెప్టన్ ఆనందరాజుగారు ఉత్సవాలలో శానిటేషన్ పర్యవేక్షకులుగా నిర్ణయింపబడినది

9. విషయము :—

రక్షణ.

తీర్మానము :—

పాకలవద్ద కాపలా, భోజనశాల గేట్లు వద్ద గారా శ్రీ పరానంద స్వాములవారికి అప్పజెప్పుటకు తీర్మానించడమైనది.

10. విషయము :—

స్వాగతకర్తృత్వ.

తీర్మానము :-

శ్రీ అద్దేపల్లి వివేకానందదేవి, శ్రీ టి. సుబ్బయ్యశెట్టిగారు మరిద్దరికీ అప్పజెప్ప నిర్ణయించడమైనది. "కారంచేడు శ్రీ ప్రణవానందస్వామి వారికి సహకారము.

(సం) 1. గోవిందస్వామి
ప్రెసిడెంట్

2. విద్యానందస్వామి
3. నిర్మలానందస్వామి
4. సదానన్దబ్రహ్మచారి
5. బి. గోపాల్
6. ఆనందరాజ్
7. పి. కుమారస్వామి
8. నామా ఎరుకలయ్య
9. పరానన్దస్వామి
10. గాదంశెట్టి సుబ్రమణ్యంగారు
11. సి. హెచ్. రంగారావు
12. కె. జి. కృష్ణమూర్తి
13. ప్రణవానందస్వామి
14. అయితా సుబ్బరాయులు
15. తులసి వెంకటసుబ్బయ్య
16. బి. సుబ్రమణ్యం
17. చిట్టూరి సత్యనారాయణ
18. పెనల వెంకటసుబ్బయ్య
19. చోడే వెంకటరమణమ్మ
20. అద్దేపల్లి వివేకానందదేవి
21. ముపాళ్ళ శేషమ్మ
22. శృంగవరపు సావిత్రమ్మ
23. నెల్లూరు పుల్లమ్మ (ప్రత్యేకాహ్వానితులు)
24. కోకా అంకాలమ్మ "

25. అద్దేపల్లి నాగేశ్వరరావు
26. వేగుళ్ళ జానకిరామయ్య
27. పరబ్రహ్మానందస్వామీ
28. కె. కృష్ణమూర్తి
29. గుజ్జ భీమయ్య
30. కె. ఎస్. కృష్ణయ్యశెట్టి
31. ఎస్. లక్ష్మణయ్య
32. పి. ఎస్. చంద్రశేఖర్
33. బొప్పన సీతారామమ్మ

ఓమ్

# ఓం నమో భగవతే శ్రీ మలయాళ యతీన్ద్రాయ.

4-3-85 వ తేదీ సోమవారము శ్రీ సద్గురు శత జయంత్యుత్సవ సంఘ పబ్లికేషన్ కమిటీ సమావేశం సాయంకాలం 6 గంటలకు శ్రీ వ్యాసాశ్రమములో శ్రీ గోవిందస్వాములవారి అధ్యక్షతన జరిగినది. అందీ విషయములు చర్చించి నిర్ణయించబడినవి.

1. శ్రీ సద్గురు స్వాములవారి జీవితచరిత్ర సంగ్రహపరచి ముద్రణలో 200 పేజీలు వచ్చునట్లు శ్రీ లక్ష్మణయ్యగారు రచించిన గ్రంథాన్ని 2000 కాపీలు ముద్రించాలని నిర్ణయింపబడినది.

2. శతజయంతి సంచికలకు ఆర్టు పేపరు చాలా అధికంగా అగుచున్నందున దానికి ఖర్చు పేపరు ధరలు పెరిగి చాలా అయ్యేటట్లు వున్నందువలన శతజయంతి సంచికలు 5000 ప్రతులకు బదులు 4000 కాపీలు ముద్రించిన చాలునని తీర్మానించడమైనది.

3. శ్రీమతి అద్దేపల్లి వివేకానందదేవిగారికి "శ్రీస్వా జీవిత చరిత్ర" ఆంగ్ల రచనను 1000 కాపీలు ముద్రించాలని తీర్మానించడమయినది.

4. శతజయంతి కార్యక్రమాలన్నింటిని వీడియో తీయించాలని, ఉపన్యాసాలన్నింటిని టేప్ చేయించాలని తీర్మానించడమైనది.

5. శతజయంతి ఉత్సవాల అనంతరము శతజయంతి సమితుక ముద్రించాలని అందు శతజయంతి సంఘ ప్రారంభము నుండి చివరి వరకు సమావేశాలు, నిర్ణయాలు ముద్రించాలని, సభ్యుల పేర్లు అన్ని వ్యాఖ్యచ్చిన పైకముతోటి ముద్రించాలని జమా ఖర్చు, ఆడిట్ రిపోర్టు ముద్రించాలని ఉత్సవ కార్యక్రమాలు ఉపన్యాసాలన్ని వుండాలని ఇట్లు సమితుక 3000 కాపీలను ముద్రించాలని తీర్మానించబడినది.

| | |
|---|---|
| ,, 3. ఎస్. లక్ష్మణయ్య | [సం] 1. గోవిందస్వామి |
| | అధ్యక్షులు |
| ,, 4. ఆ వెంకటప్పయ్య | |
| ,, 5. బి. నరసింహారెడ్డి | ,, 2. బి. గోపాల్ |
| | కార్యదర్శి |

ఓం

# ఓమ్ నమో భగవతే శ్రీ మలయాళ యతీన్ద్రాయ

9–4–1985 వ తేదీ మంగళవారము ఉదయం 10కి గం॥లకు శ్రీ సద్గురు మహర్షి మలయాళ స్వాముల వారి శత జయంత్యుత్సవ సంఘ కార్యనిర్వాహకవర్గ సమావేశము శ్రీ గోవిందానందస్వాముల వారి అధ్యక్షతన జరిగినది. అందీ విషయములు చర్చించబడినవి.

1. శతజయంత్యుత్సవాలు ఆనందప్రదంగా, జయప్రదంగా శ్రీసద్గురు కృపచే జరిగినందులకు భగవంతుడైన శ్రీ వెంకటేశ్వరులకు, శ్రీ సద్గురు దేవులకు కృతజ్ఞతలు చెల్లించడమైనది. తిరుమల తిరుపతి దేవస్థానం వారి సహకారమునకు హర్షం తెలుపుతూ టి. టి. డి. వారికి కృతజ్ఞతలు ప్రకటించడమైనది.

2. శత జయంత్యుత్సవాలకు శ్రీ సత్యసాయిబాబా (పుట్టపర్తి)వారు నీటివసతి నిమిత్తం లక్ష రూపాయలు భూరి విరాళం యిచ్చినందులకు వారికి కృతజ్ఞతాభివందనాలు ప్రకటించడమైనది.

3. శతజయంత్యుత్సవాలు పూర్తి అయినందున సదరు ఉత్సవాలకు ఖరీదు చేసిన సరుకులు బియ్యం, పప్పులు మిరపకాయలు వగైరా మిగిలిన సరుకులను శ్రీ వ్యాసాశ్రమమునకు యివ్వవలయునని అందరు ఏకగ్రీవంగా తీర్మానించిరి.

4. గోగర్భంలో శ్రీవారి స్మారకంగా నిర్మించదలచిన తపోవన నిర్మాణానికి T. T. D. వారిచ్చిన ప్లాను అనుమతిలో పెట్టిన అవసరమను కొన్నపుడు నేల స్వాధీనం చేసుకోవడం" అనే షరతున్ను T. T. D. వారి నుండి రద్దు చేయించవలెననియు దానికి ప్రయత్నం చేయుమనియు, కార్యదర్శి గోపాల్ గారిని కోరడమైనది.

(సం) S. గోవిందస్వామి
President

బి. గోపాల్
9-4-85
సెక్రటరీ

హాజరైనవారు :—

1. విద్యానన్దస్వామి (సం)
2. పాలడుగు అన్నపూర్ణమ్మ
3. చోడే వెంకటరమణమ్మ
4. అద్దేపల్లి వివేకానందదేవి
5. పెంటిపాటి లలితాదేవి
6. బొప్పన సీతారామయ్య
7. అసంగానంద
8. పరానన్దస్వామి
9. శృంగవరపు వేణుగోపాలరావు
10. వేగుళ్ళ జానకిరామయ్య
11. చిట్టూరి. సత్యనారాయణ
12. వై. ఉపేంద్రనాథ్
13. ఆనందరాజ్
14. నామా ఎరుకలయ్య

15. నిర్మలానందగిరిస్వాములవారు
16. గాదంశెట్టి సుబ్రమణ్యం
17. గుజ్జ భూమయ్య
18. ఎ. ఎస్. కృష్ణయ్యశెట్టి
19. ఎస్. లక్ష్మణయ్య
20. పి. ఎస్. చంద్రశేఖర్



# ఓమ్ నమో భగవతే శ్రీ మలయాళ యతీన్ద్రాయ

శ్రీ సద్గురు మహర్షి మలయాళస్వాములవారి శతజయంత్యుత్సవ సంఘ సర్వసభ్య సమావేశము 29-6-1985 వ తేదీ శనివారం మధ్యాహ్నం 2 గం॥లకు శ్రీ గోవిందస్వాముల వారి అధ్యక్షతన శ్రీ వ్యాసాశ్రమములో జరిగినది. సంఘ సభ్యులగు శ్రీ రుద్రరాజు నారాయణ రాజుగారి (పోడూరు) నిర్యాణమునకు వారి ఆత్మ శాంతికై ప్రార్థన చేయబడెను.

**విషయము :-**

జమా ఖర్చుల పరిశీలన, ఆమోదించుట.

తీర్మానము :-

1985 వ సం॥ము యిప్పటివరకు అయిన జమా ఖర్చుల పరిశీలనకు లెక్కలు సంపూర్ణంగా యింకను తయారు కాలేదని శ్రీ రామచంద్రారావుగారు తెలిపినందున జమా ఖర్చుల పరిశీలన వాయిదా వేయబడినది.

నేడున్న బ్యాంకులోని Cash S B A/c అన్నింటిలో కలిపి రూ. 4,27,658-41 నాలుగు లక్షల యిరవై ఏడువేల ఆరువందల

యాభై యెనిమిది రూపాయల నలభయి ఒక్క పైసలు వున్నవి. తాత్కాలిక ఫిక్సెడు పై శ్యా బ్యాంకు శాళహస్తిలో 80 వేల రూపాయలు, శాళహస్తి కో-ఆపరేటివ్ టౌన్ బ్యాంకు ఫిక్సెడు రూపాయలు 5 లక్షల రూపాయలు ఉన్నవి. ఇట్లు అంతా కలిపి క్యాష్ పది లక్షల ఏడువేల ఆరువందల యాభయి యెనిమిది రూపాయల నలభయిఒక్క పైసలు మాత్రము బ్యాంకులో వుంది.

1. జన్మస్థల నిధికి F. D. R. నం॥4483 = రు. 2000-00
2. " " 4534 = రు. 3200-00

నేటికి Total 5200 00

3. గోగర్భ నిధికి F. D.లో నం॥4535 = రు. 6816-00
4. " " 4496 = రు. 2900 00

నేటికి Toal 9716.00

5. శ్రీ గోవిందస్వాముల వారి నిధి F. D. నం 4506 — 7000—00
6. " " 4523 — 5000-00

నేటికి Total 12000-00

7. భీమవరం రాజుగారు F. D. నం॥ 4502 — 10000-00
(వడ్డి శాస్త్రీ సంస్కృత విద్యాభివృద్ధికి)
8. అంచూరు రామయ్యగారి F. D. నం॥ 4525 — 10016-00

పై వానిని అందఱూ చూచి ఆమోదించిరి. శాళహస్తి, కోఆపరేటివ్ టౌన్ బ్యాంకులోని S B A/C ను ఆమోదించిరి.

2. విషయము :-

జన్మస్థలములో నిర్మింపబడిన శతజయంతి భవనమును శ్రీ వ్యాసాశ్రమమునకు శతజయంతి సంఘము సమర్పించుట.

తీర్మానము :-

కేరళలో శ్రీవారి జన్మస్థలములో శతజయంతి సంఘము పైక ముతో నిర్మించిన కట్టడమును శతజయంతి సంఘము వారు శ్రీ వ్యాసా శ్రమ పీఠమునకు సమర్పించి స్వాధీనము చేయవలెనని ఏకగ్రీవముగా తీర్మానించడమైనది.

3. విషయము :-

శ్రీ వ్యాసాశ్రమములో శతజయంతి సంఘం నిర్మించిన కట్టడ మును శ్రీ వ్యాసాశ్రమ పీఠమునకు సమర్పించుట:-

తీర్మానము :-

శ్రీ వ్యాసాశ్రములో శతజయంతి సంఘం నిర్మించిన కట్టడముల నన్నింటిని శ్రీ వ్యాసాశ్రమ పీఠమునకు సమర్పించి స్వాధీనము చేయు టకు యందఱు ఏకగ్రీవంగా అంగీకరించి తీర్మానము చేయడ మయినది.

4. విషయము :-

కేరళలో శ్రీవారి జన్మస్థలములోను, గోగర్భము తిరుమలలో, తపోవనములోను కార్యక్రమాల నిమిత్తం వచ్చిన నిధిని శ్రీ వ్యాసా శ్రమానికి సమర్పించుట.

తీర్మానము :-

కేరళలో శ్రీవారి జన్మస్థలములో నిత్యకార్యక్రమానికై వచ్చిన నిధిని తిరుమలలో గోగర్భములోని తపోవనమునకు నిత్య కార్యక్రమా లకు వచ్చిన నిధిని F. D. లుగా వేసియున్నాము. సదరు F. D. లను శ్రీ వ్యాసాశ్రమమునకు స్వాధీనపరచి శ్రీ వ్యాసాశ్రమము వారే సదరు పై రెండు స్థలములలో శాశ్వతంగా ఈ వడ్డీతో నిత్య కార్య క్రమాలను నడపాలని కోరుతూ సదరు F. D. లనన్నింటిని శ్రీవ్యాసా

్రశమ పీఠమునకు స్వాధీనం చేయవలెనని అందరు ఏక[గీవంగా తీర్మా నించిరి.

5. విషయము :-

శతజయంతి ప్రచురణలను శ్రీ వ్యాసాశ్రమమునకు స్వాధీనము చేయుట.

తీర్మానం :-

శతజయంతి సంఘము వారు తెలుగులో, ఆంగ్లములో, హిందీ, తమిళం, కన్నడం, మలయాళం వగైరా అన్ని భాషలలో ప్రచురించిన గ్రంథములు శ్రీ వారి పటములను సభ్యులకు ఫ్రీగా యివ్వవలసిన వన్నింటిని యిచ్చి అవి పోను నిల్వలన్నింటిని శ్రీ వ్యాసాశ్రమమునకు స్వాధీనము చేయవలెనని, అందరు అంగీకరించి ఏకగ్రీవంగా తీర్మానించడమైనది.

6. విషయము :-

శ్రీ సత్యసాయిబాబాగారు శ్రీ వ్యాసాశ్రమంలో శాశ్వతంగా నీటి సాకర్యం చేయమని, తన్నిమిత్తమిచ్చిన పైకమును శ్రీ వ్యాసాశ్రమమునకు స్వాధీనము చేయుట.

తీర్మానం :-

భగవాన్ సత్యసాయిబాబాగారు శ్రీ వ్యాసాశ్రమములో శాశ్వతంగా నీటి సాకర్యం ఏర్పాటు చేయమని యిచ్చిన లక్ష రూపాయలలో ఇప్పటివరకు తన్నిమిత్తం చేసిన 'బోర్ వెల్' పైకము పోను నిల్వ పైకాన్ని శ్రీ వ్యాసాశ్రమం పీఠానికి సమర్పించి శ్రీ వ్యాసా

క్రమం వారినే ఆ శాశ్వత నీటి ఏర్పాటులను చేయమని కోరుతూ ఏకగ్రీవంగా తీర్మానించడమైనది.

7. విషయము :—

శతజయంతి సంచిక ముద్రించిన 'Freedom press' వారు సంచిక ముద్రణలో నష్టము కలిగినది కాన వారి కోటేషన్ల కంటే అధికంగా యివ్వమని కోరిన దానిపై నిర్ధారణ.

తీర్మానం:-

శతజయంతి సంచిక ఒక నెల రోజుల లోపలే ముద్రించవలసి వచ్చినందున 'ఓవర్ టైమ్' పని చేయించినందున నష్టమని మరికొంత యివ్వమని అడిగిన 'Freedom' ప్రెస్ వారికి రెండు వేల రూపాయలు అదనంగా యిచ్చుటకంగీకరింపబడెను.

8. విషయము :-

శ్రీ వ్యాసాశ్రమములోని ఆస్పత్రికి నిధిగా పైకము నుంచుట.

తీర్మానము :—

శ్రీ వ్యాసాశ్రమములో నిర్మించిన పది బెడ్డుల ఆస్పత్రికి నిత్య కార్యక్రమాల నిమిత్తం లక్ష రూపాయలను నిధిగా ఏర్పరచి దాని వడ్డీని మాత్రము ఆస్పత్రిలో ఉచిత వైద్యం నిత్య ఖర్చులకు అనగా మందులకు వాడాలని సదరు F. D ని శ్రీవ్యాసాశ్రమానికి సమర్పించాలని అందరు ఏకగ్రీవముగా ఆమోదించిరి. ఇది వరలో బడ్జెట్‌లో తెల్పిన రెండు లక్షల రూపాయలలో F. D. లక్ష రూపాయలు పోను, నిల్వ లక్ష రూపాయలను ఆస్పత్రిలో మంచాలు వగైరా సామాను లను ఖరీదు చేసివ్వాలని తీర్మానించిరి. ఆస్పత్రికై సామాను ఖరీదుపోను మిగిలిన పైకం F. D. వేయాలని తీర్మానించిరి.

9. విషయము :-

శ్రీ వ్యాసాశ్రమమునకు శతజయంతి ఉత్సవములో మిగిలిన బియ్యం పప్పు వగైరాలను యాశ్రమానికే సమర్పించుట.

తీర్మానము :—

శతజయంత్యుత్సవము జరిగిన పిదప మిగిలిన బియ్యము పప్పు వగైరాలను శ్రీ వ్యాసాశ్రమానికి సమర్పించాలని చేసిన 9-4-1985వ తేదీ గల వర్కింగ్ కమిటీ తీర్మానం ప్రకారం సదరు మిగులు సరకులను శ్రీ వ్యాసాశ్రమానికి సమర్పించిన దానిని అందరు ఏకగ్రీవంగా ఆమోదించిరి.

[సం] 1. S. గోవిందస్వామి
ప్రెసిడెంట్

2. బి. గోపాల్
కార్యదర్శి

3. విద్యానందస్వామి
4. కె. కృష్ణమూర్తి
5. స్వామి సర్వేశ్వరానంద
6. పరమానందస్వామి
7. సదానంద బ్రహ్మచారి
8. పి. కుమారస్వామి
9. గాదంశెట్టి సుబ్రహ్మణ్యం
10. తులసి వెంకటసుబ్బయ్య
11. కె. జి. కృష్ణమూర్తి
12. చిట్టూరి సత్యనారాయణరావు
13. నామా ఎరుకలయ్య
14. చిదానందస్వామి (వీరఘట్టం)
15. జి రామచంద్రరావు
16. నేరెళ్ళ సూర్యనారాయణశెట్టి
17. వై. ఉపేంద్రనాథ్
18. చలువాది జ్వాలాకృష్ణయ్య
19. పి. రామచంద్రారెడ్డి
20. జి. జయచంద్రారెడ్డి

21. కన్నెగంటి సాంబశివరావు
22. యం. (సంతకం పేరు తెలియలేదు)
23. కె. ఆండాళమ్మ
24. ఆనం సుబ్బమ్మ
25. వి. ఇందిరమ్మ
26 బి. సీతారామమ్మ
27. చెల్లూరు పుల్లమ్మ
28. ముప్పాళ్ళ శేషమ్మ
29. (సంతకము పేరు అర్ధం కాలేదు)
30. పాలడుగు అన్నపూర్ణమ్మ
31. అక్కినేన నారాయణమ్మ
32. వి కుప్పమ్మ
33. చోడే వెంకటరమణమ్మ
34. బి. జయచంద్రారెడ్డి
35. పరుచూరి వీరాస్వామి
36. వేగుళ్ళ జానకిరామయ్య
37. గంగా లక్ష్మినారాయణ
38. ఎ. వెంకటయ్య
39. అరుగొండ రామచంద్రయ్య
40. సూర్యదేవర శివాభవాని
41. ఆలపాట వెంకటప్పయ్య
42. పార్లపల్లి కాంతమ్మ
43 శృంగవరపు సావిత్రమ్మ
44. బిక్కినేన శాంతమ్మ
45. బి. నరసింహారెడ్డి
46. గుజ్జ భూమయ్య
47. ఎస్. లక్ష్మణయ్య

---

ఓం

# ఓమ్ నమో భగవతే శ్రీ మలయాళ యతీన్ద్రాయ

30-1-86 తేది గురువారం ఉదయం 10 గంటలకు శ్రీ సద్గురు మహర్షి మలయాళస్వాములవారి శతజయంత్యుత్సవ సంఘ కార్య నిర్వాహకవర్గ సమావేశము శ్రీ గోవిందస్వాములవారి అధ్యక్షతన జరిగినది. అందీక్రింద సంతకము చేసిన వారు హాజరయినారు—

(సం.)విద్యానందస్వామి
ఎస్. గోవిందస్వామి
బి. గోపాల్
స్వామి సర్వేశ్వరానంద
నామా యెరికలయ్య
శృంగవరపు వేణుగోపాలరావు
పి రామచంద్రారెడ్డి
పి. కుమారస్వామి
ప్రణవానంద
మాధవానంద
అనంతానంద
చిట్టూరి సత్యనారాయణ
తంగుటూరి శ్రీనివాసులు
గుజ్జ భూమయ్య
అయితా సుబ్బారాయుడు
వై. ఉపేంద్రనాథ్
ఎ. వివేకానందదేవి
కె. కృష్ణమూర్తి
పరిపూర్ణానందస్వామి
చలువాది జ్వాలా కృష్ణయ్య
గాదంశెట్టి సుబ్రహ్మణ్యం
యం. నాగరత్నమ్మ
పరానందస్వామి
నరెళ్ళ సూర్యచంద్రరావునాయుడు
అరుగొండ రామచంద్రయ్య

**1.** 29-6-85 తేదీ తీర్మానించిన తీర్మానాల ప్రకారము జన్మస్థల నిధి, తపోవననిధిఆస్పత్రి నిధి ఎఫ్ డి. లను శ్రీవ్యాసాశ్రమ పీఠాధి పతుల వారికి సమర్పించడమైనది. అట్లే శ్రీ సత్యసాయిబాబాగారు ఆశ్రమ శాశ్వత నీటి సౌకర్యార్థం ఇచ్చిన లక్ష రూ/లలో మిగిలిన పైకం 29-6-85 తేది తీర్మానం మేరకు రూ 89,000/ అక్షరాలా ఎనభైతొమ్మిదివేల రూ/లను చిత్తూరు వైశ్యా బ్యాంకు చెక్కు నెం 606942 ద్వారా శ్రీ వ్యాసాశ్రమ పీఠాధిపతులవారికి ఇవ్వడ మైనది. ఆశ్రమంలో కట్టిన కట్టడములను శ్రీ వ్యాసాశ్రమమునకు సమర్పించడమైనది.

